# మర్డర్ కేస్

చుట్టూవున్న చీకటిని చీల్చుకుంటూ మోటార్ సైకిల్ పైన భార్గవ స్పీడుగా వస్తున్నాడు.

ఆ కొండల మధ్య వేసిన రోడ్డు నిర్మానుష్యంగా వుంది.

రాత్రి పదకొండు కావస్తోంది.

ఆకాశంలో నల్లమబ్బులు కమ్ముకొస్తున్నాయి.

చల్లగాలి తిరిగింది.

"వాన వచ్చేలా వుంది. త్వరగా గూటికి చేరుకోవాలి" అనుకున్నాడు భార్గవ.

నిజంగా ఆ సమయంలో వాన కురవడం మొదలుపెడితే తలదాచుకోడానికి కూడా నెలవు లేదు.

బండి వేగాన్ని పెంచాడు భార్గవ.

పెదవుల మధ్య సిగరెట్ వెలుగుతోంది.

ఓ ఫ్రెండ్ గదికి వెళ్ళి మందుకొట్టి తీరుబడి చేసుకొని బయలుదే సరికి ఆ టైమ్ అయిందతనికి.

కొండరాళ్ళ మధ్య నుంచి గాలి హోరు పెడుతూంది. గీజారు శబ్దం కీచురాళ్ళ మోత.

అసలా రోడ్డులో రావడం తనదే తప్పు.

ఏ కొండరాయి దొర్లి మీదపడినా ప్రమాదమే.

దారికాసే దోపిడీ దొంగల బెడద కూడా వుంటుంది.

అయినా అలాంటి దొంగల భయం అతనికి లేదు. పదిమంది ఒక్క సారిగా మారణాయుధాలతో దాడిచేసినా వాళ్ళని మట్టికరిపించగల సత్తా తనలో వుందని అతనికి తెలుసు.

సినిమాల్లో హీరో వేషం కోసం ప్రయత్నాలు చేసి ఆఖరికి స్టంట్ మాష్టర్‌గానూ, హీరోలకి ప్రమాద ఘట్టాల్లో డూప్‌గానూ మారిపోయాడు భార్గవ.

వాన మొదలైంది.

ఆకాశం ఒక్కసారి ఘర్జించింది. ఒక గగన సౌదామని తృటిల్లో మెరిసింది.

ఆ నిశీధిలో, ప్రకృతి విలయతాండవం చేస్తుంటే లెక్కలేనట్టుగా బండి నడుపుతున్నాడు భార్గవ.

ఆ గాలి విసురుకి, వాన జోరుకి ఆ ప్రయత్నం ఎక్కువసేపు సాగ దని అతను గ్రహించేలోగానే పూర్తిగా తడిసిపోయాడు.

ఫెళ ఫెళమని ఉరిమింది.

"అర్జునా....అర్జునా...." అనుకున్నాడు. వణుకులోనూ పెదవుల మెల్లగా కదిపాడు.

ఉరుము ఉరిమినప్పుడు అర్జునుడ్ని స్మరిస్తే పిడుగు పడదని ఓ నమ్మకం. మందు కొట్టబట్టి సరిపోయింది కానీ లేకపోతే ఆ చలిగాలికి, వానకీ ఒణికిపోయేవాడే.



తాగిన నిషా దిగిపోతోంది.

చీకటి చినుకుల్ని పెనవేసుకోడంతో అతని ప్రయాణం సాగడం లేదు.

చుట్టూ చూశాడు. అన్నీ బండరాళ్ళే. ఓ చెట్టు కూడా లేదు.

ఎత్తుగా ఉన్న గుట్టపైకి ఎక్కుతోంది మోటార్ సైకిల్.

పైనుంచి క్రిందికి వాన నీరు వేగంగా ప్రవహిస్తోంది.

అతనిలో మొండితనం.

అదే సిన్మాల్లో తనలా ప్రయాణం చేస్తుంటే అది హీరో చేస్తున్న సాహసంగా ఈలలు వేస్తారు ప్రేక్షకులు.

కెమేరా లేదుగానీ అదో షూటింగ్ కార్యక్రమంలాగే అనిపిస్తోంది భార్గవకి.

ఆకాశాన్ని, భూమినీ చినుకుల దశల్తో ముడివేస్తోంది ప్రకృతి.

"ఇక లాభంలేదు" అనుకుంటూ మోటార్ సైకిల్ పక్కగా ఆపేసి దిగాడు.

గాలి జోరుకి వాన విసురు ఎటుపడితే అటు తిరుగుతోంది.

చినుకులు సూదుల్లా ఒంటిని తాకుతున్నాయి. జుట్టులోంచి మొహం పైకి కారుతోన్న వాన నీటిని తుడుచుకోడానికి జేబులోంచి కర్చీఫ్ తీశాడు. అతనా ప్రయత్నం చేయక ముందే అది ముద్దయిపోయింది.

తన తెలివికి అతనికే నవ్వొచ్చింది.

ఏదో చిన్న తుంపర అయితే అది పనికొచ్చేది. ఇంత వర్షానికి ఆరడుగుల మనిషి తనే నిలవలేకపోతున్నాడు.

పూర్తిగా తడిసిపోయాడు. తలనుంచి నీరు జారుతోంది. కొంత చలి అనిపించి శరీరంలో చిన్న ఒణుకు కూడా ప్రారంభం అయ్యింది.

ముఖం పైన పడుతోన్న జుత్తుని చేత్తో వెనక్కి తోసుకున్నాడు భార్గవ.

ఆ చీకటిలో కళ్ళు చిట్లించి చూశాడు తల దాచుకోడానికి చోటు దొరకుండే మోనని.

అన్నీ రాళ్ళు గుట్టలే!

ఓ చెట్టు కూడా లేదు.

మరో రెండు కిలోమీటర్లు పోతే ఏ దిగులూ ఉండేది కాదు. షెల్టర్ దొరికేది

వాన జోరు, గాలి విసురూ చూస్తుంటే ఇప్పుడప్పుడే తగ్గేలా లేదు.

ఇలా తడిసిపోతూ ఎంతసేపు ఉండగలడు?

ఎలాగూ తడిసేదే! వెళ్ళిపోతే?

వానలో నడవటం వేరు....

బండి నడపటం వేరు....

స్పీడు పెరిగినకొద్దీ వాన చినుకులు అదే వేగంతో దాడి చేస్తాయి.

అదీకాక ఎగుడు దిగుడుగా ఉన్న నేల....

ఈ వాన నీళ్ళలో ఏ రాయి ఎక్కినా, గోతిలోకి దిగినా ఇంతే సంగతులు.

వాన తగ్గేవరకూ తప్పదు. ఇలా తడుస్తూ నించోవాల్సిందే.

ఓ కొండరాయి పక్కగా వెళ్ళి నించున్నాడు. అది కొంత షెల్టర్ యిస్తోంది. చినుకులు అతన్ని నడుం వరకూ తడుపుతున్నాయి.

జేబులోంచి సిగరెట్ పెట్టె తీశాడు. వానకి పెట్టె తడిసిపోయి సిగరెట్లు నానిపోయినాయి.

కసిగా దాన్ని నేలకేసి కొట్టాడు.

ఇలాంటి దృశ్యాలను షూటింగుల్లో చూశాడు భార్గవ.

వృత్తిరీత్యా, ప్రవృత్తి చేత అతను నటుడు

అయితే అదృష్టం కలిసిరాక అతనిలోని కళాకారుడికి పెద్ద గుర్తింపు రాలేదు. ఓ చిన్న నటుడిగా మిగిలిపోయాడు.



అయినా నిరాశపడలేదతను.

స్టంట్ మాస్టర్‌గా సంవత్సరం క్రితం అవకాశం వచ్చింది. రెండు పిక్చర్స్ చేశాడు.

తనలాగే ఒడ్డూ పొడుగూ ఉన్న హీరోకి డూప్‌గా చేస్తున్నాడు.

తెర పైన తన మొహం కనిపించకపోయినా తన భారీ శరీరం కనిపిస్తున్నందుకు తృప్తిపడటం నేర్చుకున్నాడు భార్గవ.

తన నటనా కౌశలానికి, సాహసకృత్యాలకీ చప్పట్లు కొట్టాల్సిన జనం, అవన్నీ హీరోనే చేస్తున్నట్లుగా జనం ఈలలు వేస్తూ తెరపైన పూల వర్షం కురిపిస్తుంటారు.

క్రితంరోజు వాన సన్నివేశంలో ఓ పాటను తీశారు. తనక్కడే వున్నాడప్పుడు.

హీరో, హీరోయిన్ వానలో తడుస్తూ పాట పాడుకొంటూ పరవశం అయిపోతున్న సన్నివేశం. అలాంటి సన్నివేశాల్లో తన అవసరం వుండదు.

అంతలో విలన్ వచ్చి హీరోయిన్ని ఎత్తుకుపోవడానికి ప్రయత్నిస్తాడు

హీరో విలన్ని చావబాది హీరోయిన్ని రక్షించాలి.

నిజ జీవితంలో కట్టుకున్న భార్యను కళ్ళెదురుగా రేప్ చేస్తున్నా అసహాయతతో నిలబడిపోయే జనం తెర పైన మాత్రం హీరో తన ప్రతాపాన్ని చూడడాన్ని హర్షిస్తారు.

తనలో లేనిదాన్ని వెండితెరపైన చూసి సంతోషపడలని ఆశిస్తారు ప్రేక్షక మహాశయులు.

అలాంటి ఫైట్లకి తను తప్పనిసరి.

తనదికాని హీరోయిజానికి, తనలో లేని ధైర్యానికి హీరో ప్రేక్షకుల నీరాజనాలు అందుకుంటూంటే, ఆ ఫైట్లలో ఒక్కోసారి జరిగే ప్రమాదాలకి, తగిలే దెబ్బలకి డూప్స్ ఎక్కడో చికిత్స పొందుతుంటారు.

చిన్నగా నిట్టూర్చాడు భార్గవ.

కళ కోసం సినిమారంగంలో ప్రవేశించిన తను ఆఖరికి బ్రతుకు తెరువు కోసం అలా మారిపోయాడు. ఫలితం....తెర వెనుక వ్యక్తిగానే మిగిలిపోయాడు.

సినిమా ఫీల్డ్ అనేది పెద్ద గాంబ్లింగ్ డెన్‌లాంటిది. ఎప్పుడు ఎవరు లైములైట్లోకి వస్తారో, పెద్ద స్థానంలోంచి ఒక్కసారిగా కిందికి పడిపోతారో చెప్పలేం.

డైరెక్టరు, ప్రొడ్యూసర్ లాంటి తెరవెనుక వ్యక్తులకి పేరు, కీర్తి, గుర్తింపు అయినా దక్కుతాయి.

తనలాంటి వాళ్ళకి అవీలేవు.

క్షణంపాటు నిరాశ అనిపించింది.

అంతలోనే, ఆ మరుక్షణంలోనే తనని తానే సముదాయించుకున్నాడు భార్గవ.

గుర్తింపు లేకపోయినా, చిత్ర విజయానికి తన వంతు కృషిని తనూ చేస్తున్నాడు.

ఆ కారణం, ఆ తృప్తీ చాలు తనకి.

మనసు తేలికైంది

అంతలోనే అతనికి షూటింగ్ కోసం సృష్టించే కృత్రిమ వర్షం మనసులో మెదిలింది.

ఫైర్ ఇంజన్స్ నించి వాటర్‌ని పైకి ఎగజిమ్ముతారు. అదే వానలా కనిపిస్తుంది. ఆ వానలో తన్మయత్వంగా అద్భుతంగా నటిస్తారు హీరోలు, హీరోయిన్లు. సెన్సార్ కత్తెర నించి తప్పించుకొనే ఇలాంటి సీనులే కనక వర్షం కురిపిస్తాయి నిర్మాతలకి.

కానీ చిత్రం ఏమిటంటే కల్పించిన ఆ వర్షం వాళ్ళకంత సుఖాన్నిచ్చినట్టుగా రచయితల కల్పనయితే, నిజజీవితంలోని ఈ వర్షం చీదరగా వుంది.



ఎప్పుడీ వర్షం తగ్గిపోతుందా అని అసహనంగా వుంది భార్గవకి.

దూరంగా ఏదో కాంతి....కళ్ళు చిట్లించి చూశాడు.

ఏదో కారు వస్తోంది.

ఆ కాంతి మరింత దగ్గరయ్యింది.

మెరుపు వెలుగులో స్పష్టంగా కనిపించింది అతనికి తెల్లని కారు.

ఆ కారులో వాళ్ళని లిఫ్టు అడగాలి. మనసులో ఆశ తళుక్కుమంది.

మోటార్ సైకిల్ని అక్కడే వదిలేసి ఆ కారులో వెళ్ళిపోతే తెల్లారాక వచ్చి తీసుకోవచ్చు.

వేగంగా పరుగెత్తాడు భార్గవ.

కారు మరింత దగ్గరయ్యింది.

కారు ఆపమన్నట్టుగా చేతులు ఊపాడు.

ఏమాత్రం మానవత్వం వున్నా ఆ పరిస్థితిలో తనని కారులో ఎక్కించుకొంటారని గట్టిగా అనిపించిందతనికి. అదే నమ్మకంతో చేతులు ఊపుతున్నాడు భార్గవ.

కానీ ఆ కారు ఆగలేదు. కనీసం వేగం కూడా తగ్గలేదు.

ఒక్క విసురుతో అతని పక్కనించి వెళ్ళిపోయింది. ఆ విసురుకి వాన నీళ్ళు చింది మొహం పైన పడినాయి.

"ఇడియేట్స్" మొహాన్ని చేత్తో తుడుచుకుంటూ తిట్టుకున్నాడు.

సాధారణంగా కారుల్లో ప్రయాణంచేసే వాళ్ళకి, కాలినడకన పోయే వాళ్ళు కనిపించరని ఆ క్షణంలో భార్గవకి గుర్తురాలేదు.

అదీకాక సమయం కాని సమయంలో రోడ్డు పైన ఓ వ్యక్తి చేయి చూపి కారుని ఆపమంటే ఎవరు ఆపుతారు? ఎన్ని సంఘటనలు చూడటం లేదు.

ఎవరి భయం వాళ్ళది.

ఆ తర్వాత మరో రెండు కార్లు అటొచ్చాయి. వెళ్ళాయి.

ఏదీ ఆగలేదు.

విసుగు కోపంగా మారింది భార్గవకి.

కానీ ఆ కోపాన్ని ఎవరి పైన చూపించాలి?

కారు వాళ్ళది. వాళ్ళిష్టం. తను చేయి చూపి ఆపమంటే వాళ్ళెం ఆపుతారు? కానీ పరిస్థితిని కూడా అర్థం చేసుకోరా?

ఎంతో డబ్బు ఖర్చుచేశాడు భార్గవ.

కనీసం ఓ సెకండ్ హాండ్ కారన్నా కొనుక్కో-లేక పోయినం తనని తాను తిట్టుకున్నాడు భార్గవ.

ఇప్పుడు చేస్తోన్న పిక్చర్లో వచ్చే పారితోషికంతో కారు కొన అప్పుడిలాంటి ఇబ్బందులు వుండవు. గట్టిగా నిర్ణయించుకున్నాడు భార్గ

ఎలాగూ తడుస్తున్నాడు. ఇలా ఇక్కడ పడిగాపులు పడేదానిక వెళ్ళిపోవడం మంచిది. వానలో అంతసేపు తడిసింది మోటార్ సైకి స్టార్ట్ అవుతుందో లేదో! అదో అనుమానం.

వెహికల్ దగ్గరకి నడవబోయాడు.

సరిగ్గా అదే క్షణంలో....

వేగంగా ఓ కారొచ్చి వంద గజాల దూరంలో ఆగింది.

భార్గవ కళ్ళు మెరిశాయి. ఆశగా చూశాడు. ఇంతకూ ఏ ఒక్క కారు ఆపివావలేదు. ఇప్పుడెలాగూ ఇది ఆగింది కాబట్టి తనకి లిఫ్ట్ ఇస్తా

వాన జోరు కాస్త తగ్గిందే తప్ప....బాగానే కురుస్తోంది.

ఎందుకో అడుగు ముందుకేయలేదు భార్గవ. ఆ కారెందుకు ఆగిం అందులో ఎవరున్నారో? ఏం పని మీద వచ్చారో!

బహుశా ఏ అమ్మాయినో తెచ్చుకుని వుంటారు.



సమయానికి వాన వచ్చి వుంటుంది. వాన కురుస్తూన్నా కారులో పని జరిగిపోతుంది.

తను వెళితే వాళ్ళు ఇబ్బంది పడతారు. కొన్ని క్షణాలు వేచిచూడాలి. కానీ ఈలోగా కారు వెళ్ళిపోతే!

అదో అనుమానం.

అకస్మాత్తుగా కారు తలుపులు తెరుచుకున్నాయి.

ఓ ఆకారం కిందకి దబ్బుమంటూ వురికింది.

అంతలోనే ఆ వ్యక్తి లేచి పరుగెత్తుతున్నట్టుగా అనిపించింది.

భార్గవ కళ్ళు చికిలించి చూశాడు.

కారు హెడ్‌లైట్ల వెలుగులో స్పష్టంగా చూడ్డానికి ప్రయత్నించాడు.

కారులోంచి దూకిన వ్యక్తి తనవేపే దూసుకువస్తున్నట్టు పసిగట్టాడు భార్గవ.

కార్లోంచి మరో ఇద్దరు కిందికి దూకి పరుగెత్తే మనిషిని వెంబడించి క్షణాలపైన పట్టుకున్నారు.

"వదులు....నన్ను వదలండి" అరుపు.

అరుస్తూనే ఆ వ్యక్తి గింజుకోవడం భార్గవ గమనించాడు. ఆ గొంతు సన్నగా, పీలగా వుంది. సరిగ్గా అప్పుడే ఓ మెరుపు మెరిసింది.

ఆ వెలుగులో గింజుకొంటున్నది ఓ స్త్రీ అని గుర్తించాడు భార్గవ.

అర్ధరాత్రి—

ప్రకృతి ప్రళయాన్ని సృష్టిస్తోన్న ఆ సమయంలో ఆపదలో ఓ అమ్మాయి.

ఆమె ఎవరైనా కావచ్చు.

ఆపదలో వుంది.

తనకి కానట్టు వూరుకోవడం ధర్మం కాదు.

ఓ మనిషి ఆపదలో వున్నప్పుడు, అది తెలిసిన ఎవరైనా సరే రిస్క్-నించి కాపాడ్డం ధర్మం.

ఆ అమ్మాయిని ఆ దుండగులు మానభంగం చేయడానికి తీసు కొచ్చారో, లేక చంపడానికి తీసుకొచ్చారో?

ఇలాంటి సమయంలో వాళ్ళు ఆమెని అక్కడికి తీసుకొచ్చారం ఈ రెండు కారణాల్లో ఒకటి మాత్రం నిజం.

భార్గవ వానని లెక్కచేయలేదు.

దుండగులు తెగించిన వారని అతనికి తెలుస్తూనే వుంది. అయి కూడా సాహసం చేస్తున్నాడు.

ఆమెని కాపాడాలి.

వాళ్ళిద్దరూ కనిపిస్తున్నారు. కారులో ఇంకెందరున్నారో తెలీదు.

ఆకాశం ఉరిమినట్టు ఓ పెడబొబ్బ పెట్టి రివ్వున వాళుప తాత్రం దూసుకెళ్ళాడు.

అంత వర్షంలోనూ అతని గొంతులోని తీవ్రతకి అగంతకు క్షణంపాటు నివ్వెరపోయారు.

ఆ ప్రదేశంలో అక్కడో మనిషి ఉనికిని, అదీ తమని ప్రతిఘటిం గల వ్యక్తినీ వాళ్ళు ఊహించలేదు.

అదే అదనుగా వాళ్ళ చేతుల్లోంచి ఆ అమ్మాయి తప్పించుకు వెయ్యి ఏనుగుల బలంతో ఒక్క ఉదుకు ఉరికింది.

తనని రక్షించేందుకు ఓ వ్యక్తి వున్నాడన్న నమ్మకం ఆమె ధైర్యాన్నిచ్చింది.

మెరుపులా ఆమె అతన్ని చుట్టేసింది.

"ప్లీజ్....నన్ను కాపాడండి. వాళ్ళు నన్ను చంపేస్తారు...." ఆమె ఒగరుస్తోంది. ఆయాసంతో ఆమె రొమ్ములు ఎగిరిపడుతున్నాయి.

ఆమె వీపు పైన చేత్తో నిమిరాడు.

"నీకేం భయంలేదు. నేనున్నాను" అన్నాడు.



ఆ అభయంతో ఆమెకెక్కడలేని ధైర్యం వచ్చింది.

అయితే ఆగంతకులు ఆ చర్యకి తేరుకొని పరుగెత్తుకొంటూ వచ్చారు.

భార్గవ వాళ్ళకేసి తీక్షణంగా చూశాడు.

వానలో తడిసిన కారణంగా వాళ్ళని మళ్ళీ చూస్తే గుర్తు పట్టేలా లేరు.

"ఏయ్! నీ దారిన నువ్వు పోరా! అనవసరంగా జోక్యం చేసు ంటే దానితోపాటే నిన్ను కూడా చంపేయాల్సి వస్తుంది!" అంటూనే ఆ మనిషి అతని చేతిని పట్టుకొని గట్టిగా గుంజాడు.

భయంతో ఆమె కెవ్వుమని అరిచింది.

భార్గవ ఈసారి మాటల్తో ఓదార్చే ప్రయత్నం చేయలేదు.

ఆమెని నడుం చుట్టూ చేయివేసి తన వెనక్కి తోశాడు.

"ఏమ్! బేవకూఫ్.... నీకేరా చెప్పేది! నాలుగు తగిలిస్తే కానీ బుద్ధొచ్చేలా లేదు నీకు" రెండోవాడు ముందుకొచ్చాడు.

భార్గవ నవ్వాడు.

"ఆకాశంలో ఎన్ని నక్షత్రాలున్నాయి తమ్ముడూ?" అడిగాడు భార్గవ అందులో ఒకడ్ని.

"ఘోరన వాన కురుస్తూంటే ఆకాశంలో నక్షత్రాలు ఎక్కడుంటా యిరా కుయ్యా!" అన్నాడు వాడు.

"పోనీ యిప్పటికి ఎన్ని వాన చినుకులు కురిశాయో నువ్వన్నా చెప్పన్నా?" రెండోవాడిని అడిగాడు.

"ఒరేయ్! వీడు నిజంగా పిచ్చి నా కొడుకే!" అన్నాడు రెండో ాడు.

"పిచ్చినా కొడకల్లారా! ఆకాశంలో నక్షత్రాలు కనిపిస్తాయి. కురుస్తున్న న చినుకుల లెక్క తెలుస్తుంది చూడండిరా" అంటూ రెండు చేతులని కిళ్ళ విరిచి ఒక్కసారి గాలిలోకి విసిరాడు.

ఇద్దరు అగంతకులూ చెరో పక్కనా ఎగిరి కింద పడ్డారు.
బైర్లు కమ్మినట్టయ్యింది వాళ్ళకి. కాళ్ళకింద నేల గిర్రున తిరుగుతున్నట్టు
వుంది వాళ్ళకి.

తలలో నరాలు అదిరిపోయినాయి వాళ్ళకి. క్షణాల్లో తేరుకొని భా
పైకి దుమకబోయారు.

కానీ వాళ్ళకి ఎలాంటి అవకాశాన్నివ్వలేదు భార్గవ.

గాలిలోకి లేచి పాదంతో ఒకడ్ని మొహంపైన, రెండోవా
గుండెలపైన కొట్టాడు.

ఇద్దరూ నేలపైన దొర్లుకుంటూ దూరంగా పడ్డారు.

భార్గవ వాళ్ళు మళ్ళీ లేచి తనపైన దాడిచేసే అవకాశాన్నివ్వలే

ఎగిరి వెల్లకిలా పడున్న వాళ్ళ గుండెపైన నించుని కిందకి
ఇచ్చేలా ఎగిరి వాళ్ళమీద పడ్డాడు.

కెవ్వుమని అరిచారిద్దరూ.

ఆడపిల్ల మీద దౌర్జన్యం చేయటం కాదురా! గుండెలున్న మ
నన్నాసులైతే నాలాటి వాడితో తేల్చుకోండి" అంటూ వంగి పిడికి
బిగించి గెడ్డంకింద బలంగా కొట్టాడు.

"చచ్చాం దేవుడో!" అరిచాడో అగంతకుడు.

"ఏరా! నెప్పిగా వుందా? మీరు పెట్టే హింస ఆమెకి నెప్పికాద

'ఫట్'మని కాలితో వాడి నడుంపైన కొట్టాడు. ఆ దెబ్బకి అర్
పాటు లేవలేడా వ్యక్తి.

కీచుగా అరిచాడు.

"నేను తల్చుకొంటే మీ ఇద్దరి ప్రాణాలు తీసేస్తాను. కానీ న
మనుషుల్ని చంపటం ఇష్టం వుండదు. నేను కేవలం జంతువుల్ని,
క్రూర జంతువుల్ని మాత్రమే వేటాడతాను. మళ్ళీ ఈమె జోలికొస్తే చం
స్తాను."



వానలో జరిగిన ముష్టి యుద్ధాన్ని ఆ అమ్మాయి విస్మయంగా తిల
స్తోంది.

తన ప్రాణాల్ని, మానాన్ని కాపాడిన దేవుడే అతను. కాకపోతే ఆ
మయంలో అతను అక్కడెందుకు వుంటాడు.

భార్గవ ఆమెవేపుకి తిరిగాడు.

తనని చంపబోయిన దుండగులు నేల కరవడం చూడగానే ఆమె
క్కడలేని ధైర్యం కలిగింది.

"మీరెవరో నాకు తెలీదు. కానీ నా కోసం ఇంత ప్రమాదాన్ని మీరు
దుర్కొన్నారు నన్ను కాపాడారు. మీకు నా కృతజ్ఞతలెలా చెప్పుకోవాలో
లీడంలేదు" చేతులు జోడించింది.

చీకటిగా వున్నప్పటికీ వానకి ఆమెకూడా పూర్తిగా తడిసిపోయినట్లుగా
నిపిస్తోంది. ఆమె గొంతు వణకడంతో ఇంకా ఆ సంఘటననుంచి తేరుకో
దని అర్థం అవుతోంది భార్గవకి.

అతను చిన్నగా నవ్వాడు.

"ఆపదలో వున్న వాళ్ళని ఆదుకోడం మనిషిగా నా కర్తవ్యం.
ందులో నా గొప్పతనం అంటూ ఏదీ లేదు మొండితనం తప్ప" అన్నాడు
ర్గవ.

"ఏ పని చేసినా లాభాన్ని ఆశించే ఈ రోజుల్లో ముక్కూ మొఖం
లీని అమ్మాయిని కాపాడ్డం కోసం మీరు ప్రాణానికి తెగించారు. వీళ్ళు
రహంతకులు!" అందామె.

"ఈ విషయాన్ని ఇక్కడితో వదిలేయండి మేడం. వీళ్ళు లేచేలోగా
క్కడ్నించి బయటపడాలి మనం" అన్నాడతను.

ఆమె కిందపడి వున్న వాళ్ళకేసి ఓసారి చూసి—

"నిజమే! వెళ్ళిపోదాం!" అంది.

ఆమె అతని చేయి పట్టుకుని ముందుకి నడిచింది.

వాన జోరు చాలావరకూ తగ్గిపోయింది.

ఇంకా చిన్నగా కురుస్తున్నా ఇప్పుడంత ఇబ్బందిగా అనిపించట లేదు.

కానీ కాస్త చలిగా మాత్రం వుంది.

"ఈ వానలో వాళ్ళు కారులో వెళ్ళిపోతే?" అన్నాడతను.

ఆమె భయంగా చూసింది.

"వద్దు వాళ్ల మీ వెహికిల్ ఆధారంగా మీ వివరాలు తెలుసుకొ టారు. వానలో ఎలాగూ తడిసిపోయాం. మీ బండిపైనే వెళదాం!" అం

ఆమె మాటల్లో నిజం అతన్ని మరో మాట మాట్లాడనివ్వలేది

అంత అలజడిలోనూ ఆమె అంత తెలివిగా ఆలోచించగలిగి అంటే ఆమె మనసు చాలా గట్టిదయి వుండాలనుకున్నాడు.

ఎందుకైనా మంచిదని కారు టైర్లలోంచి గాలి తీసేశాడు.

ఇప్పుడు వాళ్ళు తమని ఫాలో చేస్తారన్న భయంకూడా లేదు.

మోటార్ సైకిల్ దగ్గరికి ఆమెతోపాటుగా నడిచాడు భార్గవ.

అంతవరకూ వానలో తడవటం చేత నాలుగైదు కిక్కులు కొ గానీ స్టార్ట్ కాలేదు మోటార్ సైకిల్.

ఆమె వెనక ఎక్కి కూర్చుని అతని నడుం చుట్టూ చేతిని వేసి

ఆమె గుండెలు అతని వీపుకి మెత్తగా తగిలాయి.

ఆమె చలికి వణుకుతున్నట్టుగా అతను గ్రహించాడు. మోట సైకిల్ కదిలింది.

* * * * *

ఆమె చెప్పిన చోట పెద్ద కాంప్లెక్స్ ముందు మోటార్ సైకి ఆపాడు భార్గవ.

ఆమె కిందికి దిగింది.

పూర్తిగా తడిసిపోయి రెండు చక్రాల బండిని నడవటం చా కష్టం.



చలికి వణుకుతూన్న గొంతుతో-

"గుడ్‌నైట్!" అని స్టార్ట్ చేయబోయాడు భార్గవ.

ఆమె గబుక్కున బండి హాండిల్ని పట్టుకొని-

"భలేవారే! లోపలకి రాకుండానే వెళ్ళిపోతారా!"

"చాలా రాత్రయ్యింది!" అన్నాడు.

"ఫర్వాలేదు. నేనే రమ్మంటున్నానుగా! కాఫీ తాగి వెళ్ళచ్చు."

అంతలో వాచ్‌మెన్ పరుగెట్టుకొచ్చాడు.

ఆమెని చూసి-

"సలాం మేడమ్!" అన్నాడు.

అతని ఎదురుగా సంభాషణ పెంచడం ఇష్టం లేకపోయింది భార్గవకి.

అయినా మెల్లగా అన్నాడు—

"ఇంత రాత్రివేళ కాఫీ ఏమిటి మేడమ్"

అతని మాటలకి ఆమె అందంగా నవ్వింది.

పోర్టికోలో వెలుగులోనూ, దీపాల కాంతికి ఆమె పలువరస నెల వంకలా తళుక్కుమంది.

పెదిమలు అందంగా విచ్చుకున్నాయి.

"వెచ్చగా వుంటుంది. తడిశారు కదా!"

"రేపు కలుస్తాను"

"పోనీ కాఫీ కోసం కాకపోయినా నా కోసం రావచ్చుగా"

అతను ఆమె ముఖంలోకి చూశాడు.

"మళ్ళీ ఆ రౌడీలొస్తారేమోనని భయం. నన్ను ఫ్లాట్‌లోకి చేర్చి వెళ్ళిపొండి" నెమ్మదిగా అంది.

"అతని ముందు ఈ మాటల్ని ఎందుకు?"

వాచ్‌మెన్ తమ మాటలన్నీ వింటున్నాడని ఆమెని వారించాడు భార్గవ.

"ఇతనికి తెలుగు రాదు" అన్నదామె.

అసలామె ఎవరో ?

ఆ రౌడీలు ఆమెనెందుకు ఎత్తుకొచ్చారో! అత్యాచారమో, హత్యో ఎందుకు చేయాలనుకొన్నారో అన్ని వివరాలూ ఆమెని అడిగి తెలుసుకోవాలనే ఆరాటం ఇంతవరకూ వేధించింది.

అయినా మర్యాద కోసం ఆ సందేహాన్ని పక్కకి నెట్టాడు.

ఆమె బలవంతం చేస్తోందిప్పుడు లోపలికి రమ్మని.

తన సందేహాలకి నివృత్తి కలుగుతుంది.

బండి దిగి పార్క్ చేసి ఆమెతోపాటు నడిచాడు భార్గవ.

ఇద్దరూ లిఫ్ట్ దగ్గరకు నడిచారు.

లిఫ్ట్ బోర్డు మీద వున్న నెంబర్లు చూసి అది ఆరంతస్తులున్నాయన్న మాట ఈ కాంప్లెక్స్‌లో అనుకొన్నాడు.

ఆమె మూడో నెంబర్ నొక్కింది.

"మీది థర్డ్ ఫ్లోరా?"

"అవును. నెంబరు త్రీ నాట్ త్రీ" చిన్నగా నవ్వుతూ జవాబిచ్చిందామె.

ఆమెనే చూస్తూ మౌనంగా నిలబడ్డాడు భార్గవ.

ఇరవై, ఇరవై నాలుగు మధ్య వుండచ్చు ఆమె వయస్సు. కట్ చేయబడిన జుత్తుని రబ్బర్ బ్యాండ్‌తో ముడివేసుకొంది.

జుత్తు చివర్ల నుంచి నీరు కారుతోంది.

వానకి తడిసిపోయిన చీరా, జాకెట్ ఆమె ఒంటికి అతుక్కుపోయి ఒళ్ళు స్పష్టంగా కనిపిస్తోంది.



మునిపంటితో పెదిమని కొరికాడతను.

ఆమె అతన్ని గమనించి చిరునవ్వు నవ్వింది.

అంతలో లిఫ్ట్ ఆగింది.

డోర్ తెరచుకోగానే బయటకొచ్చి త్రీ నాట్ త్రీ ఫ్లాట్ కేసి నడిచారు.

గుమ్మం దగ్గర అందంగా తగిలించబడిన ఫ్లవర్ వాజ్‌లోకి చేతిని పోనిచ్చి తాళంచెవిని తీసింది.

ఆ తాళం తలుపుకి వేసి "లోపలికి రండి" అంటూ మరోసారి అతన్ని ఆహ్వానించింది.

లోపలికి నడిచాడతను.

"కూర్చోండి—నేనిప్పుడే వస్తాను" అంటూ లోపలకి వెళ్ళిపోయింది.

సోఫాలో కూర్చుని నలువేపులా పరికించి చూశాడు భార్గవ.

రోజ్ కలర్ పెయింట్‌తో గోడలు తళతళలాడుతున్నాయి.

అక్కడక్కడ అమర్చిన వాల్ ప్లేట్స్ ఆ గదికి మరింత అందాన్నిస్తున్నాయి.

అన్నింటిలోకి 'ఉషోదయం' అన్న పెయింటింగ్ అతన్ని బాగా ఆకట్టుకొంది.

నెమ్మదిగా లేచి ఆ పెయింటింగ్‌కి సమీపంగా నిలబడి చూస్తున్నాడు భార్గవ.

అదే సమయంలో వెనకగా అడుగుల చప్పుడయ్యింది.

"మీకూ అదే నచ్చిందా?"

వెనుక నుంచి ఆమె గొంతు వినగానే తలతిప్పి చూశాడు భార్గవ.

డ్రస్ ఛేంజ్ చేసుకొని వచ్చిందామె.

ఆమె తెల్లని సిల్క్ ట్రాన్స్‌పరెంట్ మేక్సీలో మెరిసిపోతోంది.

తల తుడుచుకొని ఉత్తనే దువ్వుకొని ఒదిలేసినట్టుంది. భుజాలపైన పడుతోంది గిరజాల జుత్తు.

ఆమె కదులుతోంటే జుత్తు కూడా అలలు అలలుగా కదులుతోంది.

సూది ముక్కు, పెద్ద కళ్ళు....పల్చని పెదిమలు ఆమె చాలా అంద మైందని వేరే చెప్పనవసరం లేకపోయిందతనికి.

కానీ విశాలమైన ఆమె కళ్ళలో ఏదో విషాదం.... బాధ స్పష్టంగా గోచరిస్తున్నాయి. ఆ విషాదంలోనూ ఓ సౌందర్యం....అందులోనే ఓ విషా.

ఎక్కడో ఓ మామూలు పగులు వేసిన అందమైన గాజు బొమ్మలా వుందామె.

అలా ఆమెకేసి చూస్తూ వుండిపోయాడు భార్గవ.

"ఏమిటలా చూస్తున్నారు?"

నవ్విందామె.

వెన్నెల్లో మెరిసే గోదావరిలా ఉందామె నవ్వుతూంటే.

చూసే వాళ్ళ చూపుకి గాలం వేసే ఈ నవ్వు ఆమెకి ఓ అద్భుత మైన ఆకర్షణ అనుకొన్నాడు భార్గవ.

"నాకు చెప్పనేలేదు" రెట్టించిందామె అలా నవ్వుతూనే.

"మీ అందాన్ని చూస్తున్నాను"

"అందాన్ని చూస్తున్నారా లేక నన్ను చదువుతున్నారా?"

ఈసారి భార్గవ నవ్వుకొన్నాడు.

"ఇంటలిజెంట్!"

ఎక్కడోకానీ అందానికీ తెలివికీ జంట కుదరదు.

"అదే ఆలోచింపాను. ఇప్పుడర్థం అవుతోంది వాళ్ళు మిమ్మల్ని ఎందుకు ఎత్తుకెళ్ళారో."

ఆలోచనల్ని అదుపులోకి తెచ్చుకొంటూ అన్నాడు భార్గవ.

అతని మాటలకి ఆమె ముఖం పాలిపోయింది. అంతవరకూ చిలిపి నవ్వులొలకబోసిన ఆమె ముఖం క్షణంలో చిన్నబోయింది.



"ఎందుకనుకొన్నారు?" పేలవంగా అడిగింది.

"అరవై ఏళ్ళ ముసలిదానిపైన కూడా అత్యాచారాలు జరుగుతున్న ఈ రోజుల్లో మీలాంటి అందమైన ఆడదానికి రక్షణెక్కడుంది చెప్పండి?"

అతని మాటలు విన్న తర్వాత ఆమె ముఖంలోకి తిరిగి పాత కళ వచ్చింది.

"వాళ్ళు చేసినదాన్లో తప్పు లేదంటారు. తప్పంతా నా అందానిదేనా?"

కళ్ళు తిప్పుతూ అడిగింది.

అప్పుడామె మరింత అందంగా కనిపించింది.

"ఏమో! కానీ వాళ్ళనా పనికి ప్రోత్సహించింది మాత్రం మీ అందమే అనిపిస్తోంది" చెప్పాడు భార్గవ.

"అయితే అందవిహీనంగా లేని అమ్మాయి నెత్తుకుపోతే మాత్రం తప్పు దుండగులది. అదే అందమైన అమ్మాయి అయితే తప్పు ఆ అందానిదీ. ఆ నేరం వాళ్ళది కాదంటారు. కళ్ళు మూసుకుపోయిన కామాంధులకి ఆడదాని అందంతో పనికాదు సర్—అవసరం తీరడం" అంది.

"నా ఉద్దేశ్యం అదికాదు. మీ అందానికి నేనిచ్చిన కాంప్లిమెంట్ అది" చేసేదిలేక నిజాన్ని ఒప్పుకున్నాడు భార్గవ.

ఆమె చిన్నగా నవ్వింది మరోసారి.

"ఇందాక మీరు వాళ్ళతో ఫైట్ చేస్తుంటే గొప్ప ధైర్యవంతులను కొన్నాను. ఇప్పుడు తెలుస్తుంది-ధైర్యంతోపాటు రూపమూ, మాట నేర్పు కూడా కలవారని. మీలాంటి మగ మహారాజు కనబడితే ఎలాంటి ఆడపిల్లైనా నీరాజనాలర్పిస్తుంది. మనసుని పారేసుకొంటుంది. ఓ. కే. మీరు ముందు తడి బట్టలు మార్చుకోండి. మా ఇంట్లో మగాళ్ళెవరూ లేరు కనక మీకీ తెల్లచీర ఇవ్వక తప్పట్లేదు. దాన్నే లుంగీ అనుకోండి. అఫ్‌కోర్స్! లంగా అనుకొన్నా చీరే అనుకొన్నా ఫర్వాలేదు పైన టవలు కప్పుకోండి."

పొడి బట్టలు అందించింది.

"ఇంటికెళ్ళి పోతాను కదా! ఇవన్నీ ఎందుకు?"

"మీరు నాకు చేసిన ఈ సహాయానికి ఈ కాస్త సేవన్నా చేసుకునే అదృష్టాన్ని కలిగించండి. ఇందులో నాకు సంతోషమే తప్ప శ్రమ లేదు. బట్టలు మార్చుకోండి. ఇప్పుడే వస్తాను" అని లోపలకి వెళ్ళిందామె.

మరో అయిదు నిమిషాల్లో తిరిగొచ్చిన ఆమె చేతిలో ట్రేలో కమ్మని కాఫీ పొగలు కక్కుతూ సువాసనను వెదజల్లుతోంది.

"కాఫీ తీసుకొచ్చాను. వద్దంటే హాట్ డ్రింక్ వుంది" ట్రేని టీపాయ్ పైన పెడుతూ అంది ఆమె.

ఆమె మాటలకి కాస్త తుళ్ళిపడ్డాడు భార్గవ. ఇందాక చీర అందిస్తూ 'ఇంట్లో మగవాళ్ళెవరూ లేరు' అన్న ఆమె మాటలు మనసులో మెదిలాయి.

ఆమె అతని సందేహాన్ని చదివినట్లు అంది—

"ఆశ్చర్యం దేనికి? మగాళ్ళు లేని ఇంట్లో హాట్ డ్రింక్స్ ఏమిటనా! అవి ఆడవాళ్ళు వేసుకోకూడదన్న నియమం లేదుగా" అల్లరిగా నవ్వింది.

అలా నవ్వుతున్నప్పుడు ఆమె భుజాలు చిత్రంగా కదిలాయి.

గుండ్రటి ఆమె అందాలు బంతుల్లా అల్లల్లాడేయి పల్చటి నైటీలో.

"తన భావాలని ఆమె సునాయాసంగా చదివేస్తున్నందుకు ఆశ్చర్యపోయాడు మరోసారి. ఏమి జవాబు ఇవ్వాలో తెలీక మౌనంగా వుండిపోయాడు భార్గవ."

"నేను డాన్సర్నని తెలిస్తే ఇంకెంత ఆశ్చర్యపోతారో మీరు. బ్రాందీ విస్కీ కాకపోయినా, బీర్, జిన్, వైన్ తరచుగా తీసుకొంటాన్నేను. మొహమాటపడకండి. ఇంట్లో అన్ని వెరైటీలు వున్నాయి" అంటూనే కాఫీ కప్పు అందించింది.

ఆ కప్పు అందుకుంటూనే ఆమె చేతి వేళ్ళని తాకాడు భార్గవ.



తీగల్లాంటి ఆ వేళ్ళ స్పర్శ అతని నరాలను జివ్వుమనిపించాయి.

అనుకోకుండా ఆమె చేతిని తన చేతితో అదిమిపట్టాడు భార్గవ. ...

అంత రాత్రివేళ తనను నిర్భయంగా ఆహ్వానించిందామె. ఆమె మాటల ధోరణి, ఆమె అందం అతన్నా సమయంలో మైకంలో పడేస్తున్నాయి.

"ముందు కాఫీ తాగండి"

నవ్వుతూనే మృదువుగా హెచ్చరించింది.

ఆ మాటలతో తనను తాను అదుపులోకి తెచ్చుకున్నాడు భార్గవ.

పెళ్ళి కాలేదతనికి. అలాని మడికట్టుకు కూర్చోలేదు భార్గవ. కోరి దగ్గరయిన ఆడవాళ్ళతో అందాన్ని, ఆనందాన్ని పొందినవాడే అతను. కానీ యిప్పుడామెను కొందరు దుండగుల బారినుంచి కాపాడి, ఇప్పుడామెని తను కోరుకోవడం అత్యాచారం కిందే లెక్కవుతుంది. గిల్టీగా ఫీలయ్యాడు భార్గవ.

కొద్ది క్షణాల క్రితం అతనిలో చెలరేగిన అలజడి స్థానంలో ఇప్పుడు పశ్చాత్తాపం చోటుచేసుకుంది.

ఆ మార్పు అతని ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది.

మనసు మూలల్లోని భావాలను కూడా సునాయాసంగా చదివేయగల ఆమె అతనిలోని భావ సంచలనాన్ని తెలుసుకోవడం చిటికెలో పని.

ఇప్పుడతని పైన గౌరవం, నమ్మకం రెండూ కలిగాయి.

ఇతను కూడా ఓ మామూలు మగవాడే అనిపించేలా ప్రవర్తించిన భార్గవ కొద్ది క్షణాల్లోనే ఆమె ప్రశంసకి పాత్రుడయ్యాడు.

"ఇంతవరకూ మీరడగలేదు. నేను చెప్పలేదు. నా పేరు మనీషా.... వృత్తి కారణంగా 'నిషా'గా మారిపోయింది" బరువుగా వుందామె స్వరం.

"మీరు వర్రీ కాకండి! భార్గవ రాముడిలా అన్యాయాన్ని ఎదుర్కోవాలన్న కోరికతో మా నాన్నగారు భార్గవ అని పేరు పెట్టారు. కానీ నేను

కూడా వృత్తిపరంగా అనామకుడిగా మిగిలిపోయాను. కష్టపడి నేను చేసే సాహసకృత్యాలు వేరేవాళ్ళ పేరు పైన చలామణి అవుతున్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే ఓ ప్రముఖ హీరోకి డూప్‌గా మిగిలిపోయాన్నేను" ఆమె బాధను కన్‌సోల్ చేయడానికన్నట్టుగా తన గురించి చెప్పాడు అతను.

ఆమె అతను తనను ఊరడించటానికి, ధైర్యం చెప్పడానికీ చేస్తున్న ప్రయత్నానికి సంతోషపడిపోయింది.

"నిజమేనేమో భార్గవగారూ!

నా బాధని, ఆవేదనని దాచుకొని బయట వాళ్ళ ఆనందం కోసం నాట్యం చేయటానికి అలవాటు పడ్డానిన్నాళ్లూ.

నా బాధని అర్థం చేసుకుని నన్ను ఓదార్చాలని చూసిన మొదటి వ్యక్తి మీరు. అందుకే మీ దగ్గర దాచాలనిపించటంలేదు. వాళ్ళు....అదే ఆ దుండగులు నన్నెత్తుకెళ్ళింది మీరనుకున్న కారణం కాదు. ఇదీ అసలు కారణం...."

మాట్లాడుతూనే లోపలికి వెళ్ళి తిరిగొచ్చిన మనీష అతని కెదురుగా నిలబడి చెయ్యి చాచి చూపించింది.

ఆమె అరచేతిలో ఓ పెద్ద సైజు గోళీకాయంత రాయి ధగ ధగ మెరుస్తోంది.

అతను ఉలిక్కిపడ్డాడు.

అది వజ్రం....

కోహినూర్ వజ్రం స్థాయిలో కనిపిస్తోంది. సానబడితే అది మరింత కాంతిని వెదజల్లుతుంది.

ఆమె అతని కెదురుగా కూర్చుంది.



"దీన్ని ఓ వజ్రాల వ్యాపారి తెచ్చాడిక్కడికి. కొంతమంది పెద్ద వాళ్ళకి దీన్ని అమ్మాలని బేరం పెట్టాడు. కానీ బేరం కుదరలేదు. సానపడితే యిది మరో కోహినూర్ వజ్రం స్థాయిలో మేలురకం వజ్రం అవుతుం దన్నాడు. అయితే ఆ శేఠ్‌ని చంపాలని కొందరు చూశారు. శేఠ్ కొన్నాళ్లు నా దగ్గరే వుండిపోయాడు.

అతనికి అనుకోకుండా గుండె జబ్బు వచ్చింది. ఇక బ్రతుకుతానో లేదో అన్న ఓ అపనమ్మకంతో వెళ్ళిపోతూ యీ వజ్రాన్ని ఆయన నాకు బహుమతిగా యిచ్చేశాడు. ఇది నా దగ్గర వున్నట్టు మొత్తానికి వాళ్ళకి తెలి సింది. గత రెండు నెలలుగా దీని కోసం నాకు టెలిఫోన్ చేసి బెదిరించ టము, దాన్ని సంపాదించడానికి ఆఖరికి నాపైన అత్యాచారం కూడా చేశారు."

ఆమె ఆగి దిగులుగా అతనికేసి చూసింది.

భార్గవ నొసట్లు ముడిపడినాయి.

విస్మయంగా చూశాడామెకేసి.

టీపాయ్ కింద అరలో సిగరెట్ పెట్టెని తీసి అతని ముందుకు తోసింది మనీష

"థాంక్స్...." అంటూ సిగరెట్ వెలిగించాడు భార్గవ. ఆమె కేసే చూస్తుంటే-

"నా మాటల్లో నమ్మకం కుదరలేదా మీకు?" అడిగింది.

అతను చిన్నగా నవ్వాడు.

"నమ్మకం కుదరక కాదు! ఇంత విలువయిన వజ్రం గురించి నా కెందుకు చెప్పావా అని....? ఇప్పుడు నేనే దాన్ని అపహరిస్తే....?" అన్నాడు.

ఆమె ఓ వెర్రి చూపు చూసింది.

"మీ మీద నాకా నమ్మకం ఏర్పడింది" అంది.

"నేనెవరో, నా పూర్వాపరాలు మీకు తెలీదు. పరిచయం అయిన ఈ కొద్ది నిమిషాల్లో నాకు యింత విలువయిన వజ్రానికి సంబంధించిన సమాచారం చెబుతున్నారు. అందమయిన ఆడదాన్ని చూస్తే బ్రహ్మదేవుడికే రిమ్మతిరుగుతుందంటారు. విలువయిన సంపదని చూసినప్పుడు తస్కరించాలని ఎలాంటి వాడికయినా అనిపిస్తుంది. మీరు నాకే చెప్పారో, ఇంకెవరికన్నా చెప్పారో తెలీదు. అంతకంటే దాన్ని మీ తెలివితక్కువతనం అనుకోవాలో, లేక మంచితనం అనుకోవాలో అర్ధం కావడంలేదు.

"అర్ధం అయినా కాకపోయినా నేనో నిర్ణయానికొచ్చాను. ఈ వజ్రాన్ని నేను కాపాడలేను. దీనికోసం ఏ క్షణంలోనయినా ఆ రాక్షసులు దాడిచేసి ఎత్తుకుపోవచ్చు. నేను కాపాడుకోలేను కాబట్టి, ఇప్పుడు దీన్ని పదిలపరచమని మీకే యివ్వబోతున్నాను. పరిస్థితులు చక్కబడితే దాన్ని అమ్మేసి యిద్దరం పంచుకుందాం!

దీన్ని, నన్ను కాపాడినందుకు పారితోషికంగా మీకిచ్చే డబ్బన్న మాట!"

అతని చేతికి వజ్రాన్ని అందించింది మనీష.

ఆమె తనపట్ల చూపించే అభిమానానికి కదిలిపోయాడు భార్గవ.

బతుకుతెరువు కోసం హోటల్లో డాన్సులు చేస్తున్న ఓ యువతి... తన మీద వుంచిన నమ్మకం అతన్ని ముగ్ధుణ్ని చేసింది.

"మనీషా. మీరు నా పైన వుంచిన నమ్మకానికి నేను నిజంగా కృతజ్ఞుణ్ని. మీకు మాటిస్తున్నాను. నా కంఠంలో ప్రాణం వుండగా దీన్ని నా నుంచి ఎవరూ దొంగిలించలేరు. ఇందుగ్గానూ మీరు నా కిస్తానన్న సగం వాటా నాకు అవసరం లేదు. మీరుంచిన నమ్మకం చాలు నాకు."

మనీష పిచ్చిగా నవ్వింది.



"సర్లెండి. అసలీ వజ్రం అమ్మడము వరకూ నేనంటూ బతికి వుండాలికదా! అప్పుడాలోచిద్దాం. ఈలోగానే నేను వాళ్ళ చేతుల్లో మరణిస్తే దాన్ని మీరే వుంచేసుకోండి నా కానుకగా!"

ఆ మాటలకి అదిరిపడ్డాడు భార్గవ.

"వాళ్ళు మీకు ప్రాణహాని తలపెడతారన్న భయం, అనుమానం మీకుంటే ఇక్కడుండ నవసరంలేదు నాతో వచ్చేయండి. మీ మీద ఈగ వాలకుండా నేను కాపాడతాను. ఒంటరి వాడినని సందేహించకండి. నా వల్ల మీకే ఇబ్బందీ కలుగనీయను."

ఆమె అతని చేతిని తన చేతిలోకి తీసుకుని నిమిరింది.

"ఈలాంటి సమయంలోనే ఇంత నిగ్రహంగా వున్న మీరు నా విషయంలో ఏదో తొందరపడతారనుకోను! కానీ నేను మీలో వుంచే నిప్పుని చెంగున కట్టుకున్న వాళ్ళవుతారు. నా కారణంగా మీరు కోరి ప్రమాదాన్ని తెచ్చుకొన్న వాళ్ళవుతారు.

నేను ఇక్కడే వుంటే వాళ్ళు నాపైన దాడిచేసినా వాళ్ళకి కావల్సిన వజ్రం నా దగ్గర దొరకదు. కనుక నన్ను వదిలేయడానికి అవకాశం వుంటుంది. ఇంక ఈ విషయంలో మరో మాట చెప్పకుండా వెంటనే వెళ్ళిపోండి. వాళ్ళే క్షణంలో నయినా రావచ్చు."

ఆమె ఎందుకో కంగారుపడుతోంది.

"ఇంతకీ ఆ గ్యాంగ్ ఎవరు?" అడిగాడు.

"తెలీదు!" అంది.

ఆలోచిస్తే ఆమె చెప్పినది కరెక్టే కానీ ఆమెనలా ఆపదలో వదిలి వెళ్ళడానికి అతనికి మనస్కరించడంలేదు.

తటపటాయిస్తూ అలాగే వుండిపోయాడు అతను.

"ప్లీజ్! భార్గవా! వెళ్ళిపోండి" మరోసారి అభ్యర్థించింది మనీష.

"మనీషా!" ఆమెని పేరుతో పిలిచాడు.

ఆమె కళ్ళెత్తి అతనికేసి చూసింది.

"మిమ్మల్ని విడిచి వెళ్ళలేకపోతున్నాను. నేను వెళ్ళాక ఏదైనా జరిగితే అది నా అశ్రద్ధవల్ల మీరు ఆపదకి గురైయ్యారని నేను జీవితాంతం బాధపడాల్సి వస్తుంది" అశాంతిగా నుదురు రాసుకుంటూ అన్నాడు.

"నా నుండి ఏమీ ఆశించకుండా నా పట్ల ఇంత శ్రద్ధ చూపిస్తున్నందుకు థాంక్స్.

నా జీవితంలో తొలి పరిచయం మీలాంటి వ్యక్తితో జరిగి వుంటే ఈ రోజు నా బతుకు మరోలా వుండేది! నా వల్ల మీరు రిస్క్‌లో పడకూడదన్న కోరికని ఇప్పుడింకా తీవ్రం చేశారు. దయచేసి వెళ్ళిపోండి భార్గవ. లేకుంటే నా పీడ ఒట్టే!

రేపు మనం కలుద్దాం!"

"ఎక్కడ?"

ఆమె క్షణం ఆలోచించింది.

రేపు పదకొండు గంటలకి. ఇందిరా పార్క్ వినాయకుడి గుడి గేటు దగ్గర కలుద్దాం. అతని చేతిని పట్టుకుని లేవదీసింది మనీష.

ఆమె భయపడుతుందనే విషయం వణుకుతున్న ఆమె చేతి వేళ్ళు తెలియ జేస్తున్నాయి.

ఆమె చేతిని తన చేత్తో అదిమిపట్టి మృదువుగా నిమిరాడు భార్గవ.

ఆమె కళ్ళల్లో నీరు గిర్రున తిరిగింది

ఏమిటీ అనుబంధం?

ఆమె ఎవరు? తనెవరు?

యాదృచ్ఛికంగా తనామెని కాపాడాడు.

బహుశా తనే కనబడకపోతే ఈపాటికి వాళ్ళు ఆమెని చంపేసేవారేమో!

తను బతికించిన ఓ ప్రాణం....



అద్భుత సాహచర్యం రూపంలో తన ఎదురుగా....ఆత్మీయంగా నిలబడి మాట్లాడుతుంటే అనిర్వచనీయమైన భయము కలుగుతున్నాయి తనకి

ఆమె అతని చెంపలపైన చేతుల్ని వేసి నిమురుతూ అతని ముఖాన్ని వంచి అతని పెదవులపైన ముద్దుపెట్టుకొంది.

"భార్గవా! ఇంతకంటే మీ కివ్వడానికి నా దగ్గరేమీ లేదు. మీలాంటి మంచి మనిషికి నన్ను పూర్తిగా అర్పించుకోవాలనే వుంది. కానీ నా శరీరం పవిత్రమైనది కాదు. అదే ముందే మనం కలుసుంటే నేను మిమ్మల్ని వదులుకునేదాన్ని కాను."

ఆమె చెక్కిళ్ళ పైనించి నీళ్ళు జరజర జారిపోతోంది.

క్షణాలపైన ఆమె తన పట్ల ఏర్పరుచుకున్న ఆరాధనకి నలిగిపోయాడు భార్గవ.

ఆమె భుజాల చుట్టూ చేతుల్ని వేసి ఆమెని గుండెలకి హత్తుకున్నాడు అతను

"మనీషా! నువ్వనుకుంటున్నంత గొప్పవాణ్ని కాదు నేను. ఈ విషమ పరిస్థితినించి బయటపడితే ...నీ గురించి నేను ఆలోచిస్తాను."

"ఏమిటాలోచిస్తారు?"

"నిన్ను నేను పెళ్ళిచేసుకుంటాను."

ఆమె అదిరిపడిందతని మాటలకి.

అతనికేసి పిచ్చిగా చూసింది.

"నేను....అప్రకటిత పుష్పాన్ని."

అతను నవ్వాడు.

"పువ్వుని ఎందరు ఆస్వాదించినా దాని పరిమళం ఎక్కడికీ పోదు మనీషా! నువ్వు బతుకుతెరువు కోసం తప్పటడుగులు వేసి వుండచ్చు. సరైన రక్షణలేక నిన్ను తప్పుదారి పట్టించి వుండచ్చు నీ శరీరం మలిన

మైనదయినా నీ మనసులోని స్వచ్ఛత పోలేదు. మనసు కంటే శరీర ముఖ్యం కాదు."

"ఇవన్నీ మనం రేపు మాట్లాడకుందాం!" అంటూ అతన్ని చే పట్టుకుని బయటకి నెట్టి తలుపేసింది మనీష.

ఆమె భయాన్ని అతను అర్థం చేసుకున్నాడు.

ప్రమాదకరమైన ఆ ప్రదేశం నించి అతనెంత త్వరగా తప్పుకుం అంత మంచిదని ఆమెకి బాగా తెలుసు.

క్షణంపాటు గుమ్మం బయట నిలబడి మూసుకున్న తలుపులకే చూశాడు భార్గవ.

అతనికి అక్కడవించి వెళ్ళాలని లేదు.

చేతిలోని వజ్రం అతని అరచేతిని కాల్చేస్తున్నట్టుగా అనిపిస్తోంది

మనీష తన పైన వుంచిన నమ్మకం కొండంత బరువుగా ఊపిరాడకుండా చేస్తోందతన్ని.

అంత రాత్రివేళ విలువైన వజ్రాన్ని జేబులో పెట్టుకు వెళ్ళట శ్రేయస్కరం కాదనిపించిందతనికి.

ఏదో సిక్త్సెన్స్ కీడుని శంకిస్తోంది.

అటూ యిటూ చూశాడు భార్గవ.

ఓ పక్కగా వేలాడుతూ పూల కుండీ కనబడింది.

గదిలోకి వచ్చేటప్పుడు ఆ కుండీలోంచే తాళం చెవిని తీయట గుర్తొచ్చిందతనికి

వెంటనే ఆ కుండీ దగ్గరకి చేరుకున్నాడతను.

లోపల మట్టిని కొద్దిగా తీసి వజ్రాన్ని అందులో పెట్టి మట్టి కప్పే కాడు.

అంత ఓపెన్ ప్లేసులో లక్షల ఖరీదు చేసే వజ్రం దాచబడింద ఎవరికీ తెలీదు.



తృప్తిగా గాలి పీల్చుకుని లిఫ్ట్‌కేసి నడిచాడు భార్గవ. మర్నాడు ఆమెని ఇందిరా పార్క్ దగ్గర కలవడానికి నిశ్చయించుకున్నాడు భార్గవ.

* * * *

మోటార్ సైకిల్ స్టార్ట్ చేయబోతూ వెనక్కి తిరిగి చూశాడు భార్గవ.

ఎవరో ఇద్దరు వ్యక్తులు వాచ్‌మెన్‌తో మాట్లాడుతూండడం గమనించాడు భార్గవ.

వాచ్‌మెన్ వాళ్ళకి తనని చూపిస్తున్నాడు.

భార్గవకి అర్థం అయిపోయింది.

వాళ్ళెవరో....ఆ దుండగుల బాపతు మనుషులేనని అతను గ్రహించాడు.

అతని మనసు ప్రమాదాన్ని శంకించింది. అక్కడ క్షణం ఆలస్యం చేయటం కూడా ఎంత ప్రమాదమో అతనికి బాగా తెలుసు.

వెంటనే మోటార్ సైకిల్ స్టార్టు చేశాడు.

క్షణం తర్వాత వెనక్కి తిరిగి చూశాడు.

ఎర్ర మారుతీ కారు తనని వెంబడిస్తోంది.

అందులో తనని వెంబడించేవాళ్ళు ప్రాణాలు తీయటానికి వెనుకాడని కసాయివాళ్ళని అతనికి బాగా తెలుసు. కానీ కారు చాలా వేగంగా వచ్చేస్తోంది. అందులో రాత్రి సమయం.

వాన కురవడంచేత తన రెండు చక్రాల వాహనం స్పీడు పెంచితే ప్రమాదానికి దారి తీస్తుంది.

కారు దూరలేని సన్నని బైలైన్ దొరుకుతుందేమోనని చూసుకొంటూనే స్పీడు పెంచాడు భార్గవ.

కానీ అలాంటి అవకాశం దొరకడం లేదు. కారుకి, మోటార్ సైకిల్‌కీ మధ్యగల దూరం తరిగిపోతోంది.

మరికొన్ని క్షణాల్లో వాళ్ళకి దొరికిపోతానన్న విషయం భార్గ
తెలుసు.

ఆ కర్కోటకులు తన ప్రాణాల్ని తీయటానికి వెనుకాడరు.

అనవసరంగా ప్రమాదంలో చిక్కుకున్నాననిపిస్తోంది.

నిజమే!

అది అంత ప్రమాదకరమయిన విషయంగా పరిగణించబట్టే మని తనకి వజ్రాన్నిచ్చేసింది. లేకపోతే అప్పటికప్పుడు పరిచయమైన ముఖ ముఖం తెలీని తనకి లక్షల విలువచేసే వజ్రాన్నిస్తుందా? అలాని చెబితే రయినా నమ్ముతారా?

అతను తప్పించుకోడానికి శత విధాలా ప్రయత్నిస్తున్నాడు.

కానీ సడన్‌గా వెనక కారు అతన్ని ఓవర్ టేక్ చేసి రోడ్డుకి అ తిరిగి ఆగింది. దాంతో సడన్ బ్రేక్ వేసి ఆపాడు భార్గవ.

కారులోంచి ఇద్దరు అగంతకులు కిందికి దుమికి అతని ద కొచ్చారు. ఇద్దరి చేతుల్లోనూ రివాల్వర్లు వున్నాయి.

ఆయుధాలు లేకపోతే వాళ్ళని చిత్తు చేయగలడు భార్గవ. ఇప్పుడు పరిస్థితిలో వాళ్ళకి ఎదురు తిరిగి ప్రాణాల్ని పోగొట్టుకోవడం వేకమనిపించింది.

మోటార్ సైకిల్‌మీంచి దిగి నిలబడ్డాడు.

ఇద్దరిలో ఒకడు రివాల్వర్‌ని అతని గుండెకి గురిపెట్టి—

"చెప్పు బే— నిషా నీకేమిచ్చింది?" అడిగాడు.

భార్గవ విస్మయంగా చూశాడు.

అంతలో రెండోవాడు పిస్తోలుని అతని గొంతుకి ఆనించి—

"చెప్పరా! లేకపోతే కుక్కచావు చస్తావు!"

అవే తనకి చివరి క్షణాలనిపించింది భార్గవకి. కానీ ఆ గండంను తెలివిగా తప్పించుకోవాలన్న విషయం అతను మరచిపోలేదు.

"నిషా ఎవరు?"



ఎదురు ప్రశ్న వేశాడు భార్గవ.

భార్గవ చెంప ఛెళ్‌మంది.

"నిషా ఎవరో చెప్పాలిరా నీకు. దానితోపాటు వచ్చి దాని పక్కలో తొంగొనిపోతావు నీకు అదెవరో తెలీదా?" కఠినంగా వుందా గొంతు.

"ఆమె పేరు నిషా అని నాకు తెలీదు. నాతో లిల్లీ అని చెప్పింది."

"ఒరేయ్ డ్రామాలాడకు. గుండు దూసుకెళ్ళిపోతుంది. నువ్వా ఫ్లాట్‌లోంచి వస్తున్నావ్?" అడిగాడు ఒకడు.

భార్గవ చురుగ్గా ఆలోచించాడు. ఫ్లాట్ నెంబర్ మాత్రం కరెక్టుగా చెప్పాలి. దాంతో పేరు విషయంలో ఆమె తనకి అబద్ధం చెప్పిందని వాళ్ళు నమ్ముతారు.

"త్రీ నాట్ త్రీ!" చెప్పాడు.

"అది నిషా ఫ్లాట్. మరి లిల్లీ అంటావే?"

"నాతో తన పేరు లిల్లీ అనే చెప్పింది" అమాయకంగా చెప్పాడు భార్గవ.

"అది నీకెలా తగిలింది?"

"జూబ్లీ హిల్స్‌నుంచి వస్తున్నాను దారిలో ఆటో పాడైపోయిందని లిఫ్ట్ అడిగింది."

"ఇంత రాత్రివేళ ఆ రోడ్డులో ఎందుకొచ్చిందో తెలీదా నీకు."

"తెలీదు. అడగలేదు. ఆమెతో పని పూర్తి చేసుకోవాలనిపించింది. అందుకే పిచ్చి ప్రశ్నలేమీ అడగలేదు."

ఆమెని ఓ కాల్‌గర్ల్ స్థాయిలో తను మాట్లాడుతున్నాడు. అందుకు బాధగా వుంది. కానీ ఈ పరిస్థితిలో అలా మాట్లాడక తప్పటంలేదు.

ఆమె కనిపించిన ప్రదేశం.... వివరాలు చెప్పాక అతని మాటల్లో నిజం వుందని నమ్మేట్టు చేసింది వాళ్ళని.

"ఇంతకీ పని చేశావా?" అడిగాడొకడు.

"లేకపోతే మీకు దొరికేవాణ్ణి కానుగా!" అన్నాడు భార్గవ.

"సృష్టికార్యం ఎవరు చేసినా నాకు సంతోషమే!" అన్నాడు రెండో వాడు.

"షటప్! అసలు విషయం వదిలేస్తున్నావు. అది మనవాళ్ళ బోకరా ఇచ్చి తప్పించుకొచ్చుంటుంది. దారిలో వీడ్ని పట్టుకొనుంటుంది" అన్నాడు మొదటివాడు.

"నిజం చెప్పు.... ప్రాణాలతో విడిచిపెట్టేస్తాను. అది నీకేమయినా ఇచ్చిందా?"

ఈసారి అతని గొంతులో మునుపున్న తీవ్రత లేదు.

"బాగుంది. ఎదురిచ్చే అడాళ్ళుంటారేమిటి? పని చేసుకొంది నేను అయిదొందలు నేనే ఇచ్చాను" ఘోషిస్తోన్న మనసుని అదుపులో పెట్టుకొంటూ అన్నాడు భార్గవ.

"వాడి జేబులన్నీ చెక్ చేయ్."

రెండోవాడు రివాల్వర్ని జేబులో పెట్టుకొంటూ అన్నాడు.

భార్గవ పాకెట్స్ అన్నీ చెక్ చేశాడు మొదటి వ్యక్తి. అతనికి పర్సు తప్ప ఏమీ దొరకలేదు.

"సీక్రెట్ పాకెట్స్ ఏమైనా వున్నాయా బాస్!" వెకిలిగా నవ్వుతూ అడిగాడు వాడు.

"లేవు. కావాలంటే ప్యాంట్ విప్పుతాను."

"వద్దులే! గంగలో మునిగొచ్చినవాడివి" అని—

"దొంగముండ! ఇలాంటి సమయంలో కూడా బిజినెస్ చేసుకుంటుంది" కోపంతో అన్నాడు మొదటివాడు.

"వీడ్ని పోనీయ్. మోకాళ్ల నొప్పి పుట్టుంటాయి ఈత కొట్టి. ఇంటికెళ్ళి పడుకోరా పో!" భార్గవని వెనక్కి తోశాడు వాడు.

నిండా ముంచేస్తుందనుకొన్న కెరటం పాదాలని మాత్రమే తడిపి పారిపోయినట్టుగా అనిపించింది.



తేలిగ్గా నిట్టూర్చి మోటార్ సైకిల్ స్టార్టు చేశాడు.

వజ్రాన్ని తను పూలకుండీలో దాచి రావడం నిజంగా ఎంతో తెలివయిన పని చేశాడు. మాటల గారడీతో తప్పించుకొన్నాడే తప్ప వాళ్ళు పట్టాన విడిచిపెట్టేవాళ్ళు కాదు.

* * * * *

ఇంటికొచ్చి మంచం పైన వాలాడే కానీ నిద్ర పట్టడం లేదు అతనికి.

అతని మనసంతా మనీషా మీదే వుంది. ఆ దుర్మార్గులు ఆమెకేదయినా హాని తలపెట్టారేమో అన్న ఆలోచన అతన్ని తినేస్తోంది.

అప్పటికప్పుడు లేచివెళ్ళి ఆమెని చూసి రావాలనిపించిందతనికి.

కానీ అంత రాత్రివేళ తిరిగి అక్కడికి వెళ్ళడం మంచిది కాదు.

ఆమె క్షేమాన్ని కోరి వెళ్ళినా ఆ వంకతో ఆమెని లోబరుచుకోడానికి ప్రయత్నిస్తున్నట్టుగా ఆమె తనని అపార్థం చేసుకోవచ్చు.

ఆ భావం ఆమె మనసులోకి వచ్చిందంటే ఆమె తనని ఎంతో నీచంగా భావించగలదు. ఇంతకుముందు ఆమెతో వెళ్ళడం వేరు. వాచ్‌మెన్ కూడా తనని గుర్తు పడతాడు.

అసలు మనీషా పరిస్థితి ఏమిటి? ఆమెకి చాలా పరిచయాలున్నట్టుగా మాటల్నిబట్టి గ్రహించాడు.

ఇప్పుడు దుండగులు ఆమె ఇంటికెళ్ళినా కూడా వజ్రం ఎలాగూ దొరకదు కాబట్టి ఆమెకి వాళ్ళే అపకారం చేయరనిపిస్తోంది భార్గవకి. ఆ ఊహ అతనికి మనశ్శాంతిని చేకూర్చింది.

మనీష!

ఆమె ఎంతో ఉన్నత స్థితికి రావాలని ఆ పేరు పెట్టారు తల్లిదండ్రులు.

బిడ్డల్ని కనచ్చు. కానీ జీవితాల్ని కనలేరు కదా! అంత చక్కటి పేరు ఆమె జీవిత పథం మారేసరికి అర్థాన్ని మార్చుకొని 'నిషా'గా మారి పోయింది.

జీవితంలో దిగజారినా, నైతిక విలువల్ని కోల్పోయినా ఆమె మాన సికంగా మంచి సంస్కార వంతురాలనిపించింది.

తన తప్పుల్ని అంగీకరించి కూడా వాటిమీద అందమయిన ముసుగు వేస్తూ.... ఆత్మవంచనతోపాటు ఎదుటి వాళ్ళని కూడా వంచించే మధ్య వాదులకంటే ఆమె ఎంతో ఉన్నతురాలనే చెప్పాలి.

కల్మషం ఆమె శరీరానికే కానీ మనసుకి అంటలేదనిపించింది.

ఆమె గురించి అంత ఆలోచిస్తున్నాడు.

తను మాత్రం పవిత్రుడేం కాదు.

నిజానికి పరిస్థితుల కారణంగా దిగజారిన ఓ అమ్మాయి బతుకు ఉద్ధరిస్తే ఆ పని దేవుడు కూడా మెచ్చుకుంటాడు.

అసలు పవిత్రత అనేది అర్థం లేని పదం తనలాంటి వాళ్ళకి.

రేపు ఇందిరాపార్క్‌లో కలిసినప్పుడు చెప్పాలి.

ఆమెని తన జీవితంలోకి ఆహ్వానించాలి.

ఆ నిర్ణయానికి రాంగానే అతని మనసు చల్లబడింది.

ఇంతకు ముందు ఆమె బతుకుతెరువు కోసమే పరిస్థితుల ప్రభ వానికి తల వంచి, జీవితాన్ని కాల్చుకుని వుండచ్చు. పెళ్ళయిన తర్వాత తనకి లాయల్‌గా వుంటే చాలు.

* * * * *

పార్క్ గేటు దగ్గర నించున్నాడు భార్గవ. అతనొచ్చి గంటన్నర దాటింది.

మనీష రాలేదు.

సరిగ్గా పదకొండు గంటలకి వస్తానంది.

"[illegible] రాదేం?"



ఒకేచోట ఓ మనిషి వెయిట్ చేస్తూ నిలబడితే చూసేవాళ్ళకి అను మానం వస్తుంది.

టైమ్ చెబితే ఆ టైమ్‌కి ఖచ్చితంగా రావడం భార్గవకి అలవాటు. ఆమె రాకపోవడంతో చాలా చిరాగ్గా వుందతనికి. వెయిట్ చేయట మనేది చిత్రమయిన శిక్ష.

ఓ వ్యక్తి ఎక్కడో హాయిగా తన పని చూసుకుంటూ తన సంతో షంలో తనుంటే మరో వ్యక్తి ఆ మనిషి కోసం ఎదురు చూడ్డం ఓ పిచ్చి తనం.

రోడ్డుకి రెండువైపులా దృష్టిని సారించి చూశాడు.

అప్పటికి ఓ సిగరెట్ పాకెట్ అయిపోయింది. రెండో పాకెట్ ఓపెన్ చేసి మరో సిగరెట్ వెలిగించాడు.

ఒంటి గంటయ్యింది.

ఆమె రాలేదు.

అంతలో ఓ మెరుపులా ఊహ కలిగిందతనికి. లక్షల ఖరీదయిన వజ్రాన్ని తనని నమ్మి ఇచ్చిన మనీషా రాలేదంటే.... రాలేని పరిస్థితులో వుందా?

ఆమెకేదైనా అపాయం జరిగిందా?

చిగురుటాకులా వణికిపోయాడు భార్గవ.

ఆమె అక్కడ సహాయం కోసం విలవిల్లాడిపోతూ వుంటే ఆమె ...న చిరాకు పడుతూ కాలాన్ని వృధా చేస్తున్నాడా?

అంతే! వెంటనే ఎగిరి మోటార్ సైకిల్ స్టార్టు చేశాడు భార్గవ.

* * * * *

మనీష వుండే అపార్టుమెంట్స్‌కి కొద్ది దూరంలో వెహికల్ ఆపాడు భార్గవ.

పోలీసు వ్యాన్, జీపు ఆగి వున్నాయి. కాంప్లెక్స్ ముందు జనం....

భార్గవ మనసు కీడు శంకిస్తోంది.

జనాన్ని అదుపు చేస్తున్నారు పోలీసులు.

అటు తిరిగి పోలీసులతో ఏదో చెప్తున్నాడు వాచ్ మెన్.

ఆ స్థితిలో తను అక్కడికెళ్ళడం అంత తెలివయిన పని కాదని భార్గవ గ్రహించాడు.

ఆ వీధి చివర వున్న షాపు దగ్గరకి నడిచాడు భార్గవ.

సిగరెట్ పెట్టె కొని సిగరెట్ వెలిగించాడు. జేబులో ఓ పాకెట్ వుంది. ఉత్తనే షాపుముందు ఆగి వివరాలు అడిగితే అనుమానం రావచ్చు.

వాడి దగ్గర ఏదో కొని— మాటల్లో వివరాలు రాబట్టవచ్చన్నదే భార్గవ అభిప్రాయం.

"ఏంటా జనం? పోలీసు లెందుకొచ్చారు?" అడిగాడు.

యధాలాపంగా అడిగినట్టు అడిగాడు.

"ఆ బిల్డింగ్‌లో ఓ పిట్ట వుంది సార్. భలేగా వుండేది. దాన్నెవరో రాత్రి సఫా చేశాడు" చెప్పాడు పాన్‌షాపు కుర్రాడు.

గుండె ఝల్లుమంది భార్గవకి.

"ఆమె పేరు?"

"నిషా!"

"వాళ్ళ వాళ్ళెవ్వరూ లేరా?"

"క్లబ్బుల్లో, హోటళ్ళలో డ్యాన్సులు చేస్తుంది. దానికెవరూ లేరు సార్. అప్పుడప్పుడు ఎవరో ఒకళ్ళని తెచ్చుకొనేది. ఎవడో రాత్రి కూడా వచ్చాడట. ఏదన్నా గొడవ జరిగిందేమో! ఖతంచేసి పారిపోయాడు."

సొరుగు మూసేస్తూ చెప్పాడు పాన్ షాపువాడు.

వాడు పరిశీలనగా చూస్తే తన భావాలు వెల్లడయిపోతాయని భయపడ్డాడు భార్గవ.



ఇంకా ప్రశ్నలు వేస్తూ కూర్చుంటే వాడికి అనుమానం కలగవచ్చు.

"రోజులే అలా ఉన్నాయి. అంతే జరిగి వుంటుంది" వాడిని సమర్థిన్నట్టుగా అని బయటపడ్డాడు భార్గవ.

ఇంకా ఆ పరిసరాల్లో వుండటం కూడా మంచిది కాదనిపించింది.

వాచ్ మెన్ తనని గుర్తు పట్టొచ్చు. అదీకాక రాత్రికూడా ఎవడినో తెచ్చుకొందట అని పాన్ షాపువాడు అంటున్నాడంటే తను ఆమెతో వచ్చినట్టు వాచ్ మెన్ పోలీసులకి చెప్పే వుంటాడు.

క్షణాలపైన అక్కడ్నించి కదిలాడు భార్గవ.

* * * * *

ఎంతో ఆవేదనగా వుంది భార్గవకి నిజానికి ఇరవై నాలుగ్గంటల ముందు ఆమె ఎవరో అతనికి తెలీదు

అలాగని పరిచయమయినా కూడా గంటల తరబడి మాట్లాడుకోలేదు. ఏ ప్రేమ బాసలూ చేసుకోలేదు ఏ వలపు వాక్యాలూ వల్లించలేదు.

మనీషని పెళ్ళి చేసుకోవాలన్న నిర్ణయం కూడా తన అభిప్రాయం మాత్రమే.

తన భార్య కావాలనే కోరికని ఆమె వెల్లడించలేదు. తన నిర్ణయాన్ని విని ఆమె ముఖం వెలిగిపోతుందనుకొన్నాడు భార్గవ. జీవితం కుదుట పడుతున్నందుకు ఆమె ఎగిరి గంతేస్తుందనుకొన్నాడు.

ఆమె ఇచ్చిన ముద్దు.... ఒకే ఒక ముద్దు.... పదేపదే గుర్తుకు వస్తోంది.

ఆమె ఆపదలో వుందని తెలిసీ తను నిర్లక్ష్యం చేసినట్టుగా ఫీలవుతున్నాడు.

రాత్రి తిరిగి ఆమె ఇంటికి వెళితే ఆ రాక్షసుల బారినుంచి ఆమెని కాపాడగలిగేవాడేమో!

ఆమె జీవితాన్ని బలిగొన్నది వాళ్ళ దుర్మార్గం కాదు. తన నిర్లక్ష్య మాత్రమే!

హంతకులు వాళ్ళు కాదు. తనే హంతకుడు. ఆ బాధ అతని మ సుని తొలిచేస్తోంది.

గుండె బరువుగా అయిపోయింది భార్గవకి. ఎన్నో టన్నుల బ వుని గుండె పైన పెట్టి ఉక్కుపాదంతో తొక్కుతున్నట్టు వుందతనికి.

మనీష చివరి క్షణాల్లో ఎంత నరకం అనుభవించిందో.

ఆ ఊహే అతనికి అంతులేని క్షోభని కలిగిస్తోంది. ఆ క్షణాల్ల తనొచ్చి కాపాడతాడని ఆశతో ఎదురు చూసి వుంటుంది.

కొన్ని గంటల ముందే నిజానికి ఆమె చంపబడి వుండేది. త అడ్డుపడ్డాడు.

అటు తర్వాత మళ్ళీ హత్యా ప్రయత్నం జరగటం, ఆమె చం బడటం జరిగింది.

అంటే ఆ కొన్ని గంటలు ఇంకా ఆమెకి బతికే యోగం వుంది ఆదీ ఒక వజ్రాన్ని తనకి పుట్టచెప్పడానికి.

"యోగం" అంటే ఏమిటో ఇప్పుడు తెలుస్తోంది.

చావునుంచి ఆమె తప్పించుకోలేని యోగం ఆమెదయితే, కొన్ని లక్షల ఖరీదు చేసే వజ్రానికి సొంతదారుడయ్యే యోగం తనది.

ఆమె మరణమే అతన్ని వేధిస్తోంది.

డబ్బుకంటే ఓ మనిషి ప్రాణం విలువైనదని అతని అభిప్రాయం

డబ్బు సంపాదించవచ్చు.

కానీ ప్రాణాన్నెలా తీసుకొస్తాం?

ఆమె ఎవరో తెలీకపోతే తనకి గుండె కోత వుండేది కాదు.

ఆమె తనపట్ల వుంచిన నమ్మకం, స్నేహభావం అతన్ని కుంగదీ న్నాయి.



నమ్మిన ఆడదాన్ని రక్షించలేని అసమర్థుడు తను.

అవతలి వ్యక్తులు బలవంతులై తను ఓడిపోలేదు. అసలు ప్రయత్నమే చేయలేదు తను.

అంటే ఆమె కేదన్నా ప్రమాదం జరిగితే లక్షల ఖరీదు చేసే వజ్రం తన సొంతం అవుతుందన్న స్వార్థం ఏదన్నా....ఆమెని కాపాడే ప్రయత్నం నించి దూరం చేసింది అన్న సందిగ్ధత.

ఎంత దుర్మార్గుడు తను?

దీనికి పరిష్కారం వుంది.

అపరాధ భావం అతన్ని నిలువునా కాల్చేస్తోంది. మనీష చనిపోయాక మరింతగా అతని మనసు మీద ఆధిపత్యాన్ని పొందింది.

"మనీషా! నువ్వు నిజంగా మనీషవే. నేను అల్పుడిని. నీ ముందు కూడా నిలిచే అర్హత లేనివాడిని నేను."

కొన్ని గంటలపాటు మంచం మీంచి లేవలేదతను.

ఆ దుఃఖపు వడి తగ్గగానే అతని మనస్సు మేల్కొంది.

పాన్ షాపు కుర్రాడు అన్న మాటలు గుర్తొచ్చాయి.

రాత్రి ఆమెతో వచ్చినవాడే ఆమెని చంపి వుంటాడన్నది వాడి అభిప్రాయమేనా? లేక పోలీసులూ అలాగే అనుకొంటున్నారా?

అంటే వాళ్ళ దృష్టిలో తనే హంతకుడా?

కంపించిపోయాడు భార్గవ.

ఆమెతో తనని చూసింది వాచ్‌మెన్ ఒక్కడే.

అతను తనని అంత బాగా గుర్తుంచుకొంటాడా? తను ఫ్లాట్‌లోంచి బయటికి వచ్చినప్పుడు దుండగులకి వాడే తనని చూపించాడు.

కనక అతనికి ఆ సంఘటన బాగా గుర్తుండవచ్చు.

కానీ షాపు కుర్రాడి మాటల ప్రకారం ఆమెతో ఎవరెవరో రావడం అలవాటే కనక తనని అతనంత ప్రత్యేకంగా చూసి వుండకపోవచ్చు.

ఆ ఆలోచన ఆతనికి కొంత ధైర్యాన్నిచ్చింది

వాచ్ మెన్ వానలో తడిసిపోయిన తనని చూశాడు.

అప్పటి రూపానికి, ఇప్పటి రూపానికీ తేడా వుంటుంది. ఎటొచ్చీ మోటార్ సైకిల్ నెంబరు నోట్ చేస్తేనే ప్రమాదం.

అయితే దుండగులు కూడా తనని చూశారు.

కానీ ఈ ఘోరం చేసింది వాళ్ళే కనక వాళ్ళు బయటకి రారు

ఎటొచ్చీ ఇక వాచ్ మెన్ వల్లనే తను బయటపడే ప్రమాదం

వాచ్ మెన్ 'ఏ గుండె ఆగి చచ్చిపోతేనో బాగుండును' అను కొన్నాడు.

అంతలోనే ఆతనిపైన ఆధారపడిన భార్యాబిడ్డలు గుర్తొచ్చి అలా అనుకొన్నందుకు తనని తానే మందలించుకొన్నాడు భార్గవ.

ఎందుకొచ్చిన సందేహాలు!

తను గుండు కొట్టించుకొని, మీసాలు తీసేస్తే తన మొహమే మారి పోతుంది. ఎవరైనా అడిగినా యాదగిరి గుట్టకో, తిరుపతికో వెళ్ళానని చెప్పు కోవచ్చు.

అయితే ఇప్పట్లో ఆ వజ్రం గురించి మర్చిపోయారు.

ఇప్పుడక్కడ పోలీసులు కాపలా వుంటారు.

వారం పదిరోజులు పోయాక మెల్లగా అందరూ మనీష హత్య ఉదంతం మర్చిపోయాక వెళ్ళి వజ్రాన్ని తెచ్చుకోవాలి.

తన ఊహలకి తనే ఆశ్చర్యపోయాడు భార్గవ.

మనిషికెంత స్వార్థం?

ఇంతకు ముందే మనీష చావుకెంతో కుమిలిపోయాడు.

అలాంటి తను ఇప్పుడు ఆత్మరక్షణ గురించి, వజ్రం ద్వారా కలగ బోయే లాభం గురించీ ఆలోచిస్తున్నాడు.



వెర్రి నవ్వొకటి అతని పెదవులపైన కదిలింది.

* * * *

నెల గడిచింది.

మనీష జ్ఞాపకాల్లో మాత్రమే మిగిలిపోయింది భార్గవకి.

ఆ జ్ఞాపకాలు కూడా ఇదివరకంతగా అతన్ని బాధించడం లేదు.

వజ్రాన్ని అమ్మిన డబ్బుని ఆ యిదారు బ్యాంకుల్లో వేశాడు ఒకే బ్యాంకులో అంత మొత్తం వేస్తే అనుమానం....లేనిపోని రిస్కు.

మొత్తం పాతిక లక్షలు....దొంగవాళ్ళ వ్యాపారాలలోనే అంత ధర పలికిన ఆ వజ్రానికి ఓపెన్ మార్కెట్లో ఎంత విలువ వుంటుందో ఆలో చిస్తే ఆశ్చర్యంగా వుంది భార్గవకి.

ఓ రాయి ఖరీదు అన్ని లక్షలా ?

ఉన్న డబ్బు ఏం చేసుకోవాలో తెలీని సంపన్నుల పైత్యమే ఈ రాళ్ళకి బంగారానికీ ఇంతంత విలువ కలగజేస్తుందనిపించింది.

మనీష మరణం అతన్నోపక్క కలచివేస్తున్నా నిజానికి ఆమె తన పాలిట అదృష్టదేవతే అయ్యింది.

కేవలం తనకా డబ్బు ఋణం వుండడంచేతనే ఆనాడు ఆమెతో పరి చయం అయి వుంటుంది.

'పాడువాన' అని తిట్టుకొన్న ఆ రాత్రే! తన జీవితాన్ని మార్చే సింది.

కావాలంటే తనే ఓ ప్రొడ్యూసర్‌గా మారగలడు. కానీ ఇప్పట్లో తన దగ్గర అంత డబ్బు వుందన్న విషయం బయటకి రావడం అంత మంచిది కాదు.

నిన్నటివరకు సాదా మనిషిగా బతికిన తను ఈ రోజు సడెన్‌గా ఇన్ని లక్షల అధిపతి అయ్యాడంటే ఈ విషయం ఎన్నో అనుమానాలకి దారితీస్తుంది.

మరికొంత కాలం ఆ డబ్బునలాగే మరుగున వుంచడమే శ్రే
స్కరం.

అయితే ఖరీదైన బట్టలు, కొత్త స్కూటరు చూసి తనతోపాటే ప
చేస్తూ తనకున్న ఆప్తుల్లో ఒకడైన ప్రభు అడిగాడు—

"ఏం గురూ! ఏదన్నా లాటరీ కొట్టావా? ముదనష్టమా?" అని.

"రెండోదే! ఈ మధ్య మా తాతయ్య పోయాడని తెలుసుగా. అయ
నాకు రాసిపోయిన పొలం అమ్మేశాను"

అబద్ధం చెప్పాడు భార్గవ.

అతని తాత పోయిన మాట వాస్తవమేనని తెలిసినవాడు కావడం
ప్రభుకి ఆ విషయంలో సందేహం కలుగలేదు.

"అంతేలే! అలాంటిదేదో కలిసొస్తే తప్ప మన గొర్రె తోక బ
కుల్లో మార్పేం వుంటుంది" అన్నాడతను క్యాజువల్‌గా.

అతనికి విషయం తెలీక అన్నా, ఆ మాటలు నూటికి నూరుపాళ
నిజం అనిపించింది.

ఇప్పుడు భార్గవకి ఎంతో నిశ్చింతగా వుంది. తన వెనకాల డబ్బు
దనే విషయం మనిషికి కలిగించే నిబ్బరం అది.

ఇప్పట్లో కొత్త పిక్చర్లో ఛాన్సులు రాకపోయినా ఫర్వాలేదు.

నిజానికి జీవితం అంతా కూర్చుని తిన్నా ఆ వడ్డీ డబ్బులు
పోతాయి.

కానీ విచిత్రంగా అతని కిప్పుడే ఎక్కువ ఆఫర్లు రావడం మొద
పెట్టాయి.

మరీ విచిత్రం ఏమిటంటే రెండు రోజుల క్రితమే ప్రముఖ నిర్మా
చౌదరి తనకి కబురు చేశాడు. ఆయన పిక్చర్లో సెకండ్ హీరో అవకా
ఇచ్చాడాయన.



చౌదరి నాలుగేళ్ళ క్రితమే ఫీల్డులో అడుగుపెట్టాడు.

సుమారు పన్నెండు సినిమాలు తీశాడు.

అన్నీ మంచి చిత్రాలనే ముద్ర పడినాయి.

అలాంటి ప్రొడ్యూసర్ చేతిలో తను పడటం నిజంగా తన అదృష్ట మనే చెప్పాలి.

చిన్న వేషం దొరికినా చాలని తెగ తిరిగిన తనకి ఆ రోజుల్లో ఎవడూ వేషాన్నిచ్చిన పాపాన పోలేదు.

కానీ ఈ రోజు ఆశ్చర్యంగా, ఓ అపూర్వావకాశంగా అదృష్టం తనని వెదుక్కుంటూ వచ్చింది. తనకి ఆ అవకాశం రావడం అంటే ఆకాశంలోని చందమామ తన ఒళ్ళోకొచ్చి వాలినట్లుగా వుంది.

రెండు రోజుల్లో షూటింగ్ మొదలు. ఊటీలో తీస్తున్నాడు చౌదరి.

ఆ రాత్రే ప్రయాణం.

"ఒరేయ్ భార్గవా! నీ సత్తా ఏమిటో ఈ పిక్చర్లో నిరూపించుకో. నీ జాతకం మారిపోయినట్టేరా. నీ డూప్ బతుకు ముగిసిపోయినట్టే చాలా త్వరలోనే నువ్వు హీరోవై పోతావు. బీ కేర్‌ఫుల్" తనని తానే అభినందించుకొంటూనే హెచ్చరించుకొన్నాడు భార్గవ.

చిత్రపరిశ్రమలో అడుగు పెట్టినవాడిలో ఏమాత్రం టాలెంట్ ఉన్నా నోరుని అదుపులో పెట్టుకుని, వినయంగా ప్రవర్తించగలిగితే వాడు ఖచ్చితముగా ఓ రోజు సూపర్‌స్టార్ అవుతాడు.

ప్రయాణానికి కావల్సినవన్నీ సర్దుకున్నాడు భార్గవ.

* * * * *

"లొకేషన్ చాలా బాగుందిరా! అందుకేనేమో బలిసిన నాకొడుకులు హనీమూన్లకి, షికార్లు కొట్టడానికి యిక్కడికొస్తారు" అన్నాడు ప్రభు.

"నిజమే బ్రదర్. డబ్బుంటే నిప్పులు చెరిగే సూర్యుడ్ని చంద్రుడిగా మార్చేయచ్చు. వృత్తిపరంగా వచ్చిన మనమే యింత హాయిగా వుంటే,

హనీమూన్ కొచ్చేవాళ్ళెలా వుంటారో...." భార్గవ చిన్నగా దగ్గుతు
అన్నాడు.

వాతావరణం మార్పుకి అతనికి కాస్త జలుబు, దగ్గూ పట్టుకున్నాయ

"ఎలాగూ ఊటీ వస్తున్నాం అని తెలుసుకదా! ఓ అమ్మాయిని వెం
తెచ్చుకుంటే బాగుండేది" అన్నాడు ప్రభు.

"అప్పుడు మనని మెడపైన చెయ్యివేసి గెంటేవాళ్ళు" కోపం
అన్నాడు భార్గవ.

ప్రభు సిగ్గుపడ్డాడతని మాటలకు.

చౌదరికి క్రమశిక్షణ విషయంలో మంచి పేరుంది.

వృత్తే దైవం అంటాడతను.

"నిజమే బాస్! అమ్మాయిలెక్కడయినా దొరుకుతారు. చౌదరి పా
ఫిలింలో అవకాశం దొరకదు" నిరాశతోనే అయినా నిజాన్ని ఒప్పుకున్నా
ప్రభు.

అంతలో తలుపు చప్పుడయ్యింది.

"మే ఐ కమిన్?" అంటూ ఓ మగగొంతు వినిపించింది.

వెళ్ళి తలుపు తీశాడు ప్రభు.

తెల్లకోటు, చేతిలో స్టెతస్కోపు.

అతను డాక్టరని అర్థం అవుతోంది.

"అయాం డాక్టర్ సుధీర్! భార్గవగారికి ఒంట్లో బాగోలేదని చౌ
గారు ఫోన్ చేయించారు."

"నేనే భార్గవని! రండి" అన్నాడు భార్గవ ఆశ్చర్యం నుంచి
కొంటూ.

హీరో హీరోయిన్‌లకు కాస్త తలనొప్పి వచ్చినా అదో బ్రెయి
హ్యామరే అన్నంత హంగామా చేసే నిర్మాతలు చిన్న ఆర్టిస్టుల ప్రాణ
పోతున్నా పట్టించుకోరు.



అది భార్గవకి అనుభవమయిన విషయమే.

కాపీ చౌదరిలాంటి ప్రముఖ నిర్మాత తనలాంటి చిన్న ఆర్టిస్ట్‌కొచ్చిన జలుబు, దగ్గుని కూడా అంత సీరియస్‌గా తీసుకోవడం భార్గవని చకితుడ్ని చేసింది.

"చెప్పండి! ట్రబుల్ ఏమిటి?" అడిగాడు డాక్టర్.

"ఏం లేదు డాక్టర్! జస్ట్ కోల్డ్ అండ్ కేఫ్" కొద్దిగా సిగ్గనిపించింది అతనికి.

"చిన్నదే కదా అని నిర్లక్ష్యం చేస్తే అది పెరిగి పెద్దదైపోతుంది. అందులోనూ మీలాంటి సినిమా వ్యక్తులకు జలుబు కూడా సీరియస్ విషయమే!

చూడండి! సాధారణంగా కోల్డ్ వల్ల గొంతు మారిపోతుంది. ఇది ప్రాబ్లమే కదా!

పైగా ఈ జలుబనేది ఒకరినుంచి మరొకరికి అంటుకొని చిక్కని తెస్తుంది అందుకే పిలిచివుంటారు చౌదరిగారు" డాక్టర్ కాస్త ఎక్కువగా మాట్లాడాడు.

అయినా అంత చిన్న విషయం కూడా తనకు తట్టనందుకు భార్గవ తనను తాను తిట్టుకున్నాడు.

డాక్టర్ ఇంజక్షన్ చేసి, కొన్ని మందులు రాసిచ్చి వెళ్ళిపోయాడు.

"మనలాంటి వాళ్ళకోసం కూడా చౌదరిసాబ్ స్వయంగా డాక్టర్ని పిలిపించటం నిజంగా ప్రత్యేకంగా చెప్పుకోవల్సిందే ప్రభూ!"

అంతవరకూ మాట్లాడకుండా ఓ ప్రక్కగా వింటున్నాడు ప్రభు.

అతను కూడా ఆశ్చర్యపోయాడు.

"ప్రతి చిన్న విషయానికీ అంత ప్రాముఖ్యతనివ్వటం వల్లనే ఆయన యింత గొప్పవాడై వుంటాడు" అన్నాడు ప్రభు.

* * * *

నిరాటంకంగా ఊటీలో షూటింగ్ పదిరోజుల్లో ముగిసింది.

తిరుగు ప్రయాణానికి అంతా సిద్ధమయ్యారు.

ముందుగా చిన్న, చితకా ఆర్టిస్టు లందరికీ ట్రైన్‌లో టిక్కెట్లు ఇచ్చేశారు.

ప్రభుకి టిక్కెట్టు అందింది కానీ భార్గవకి రాలేదు.

ఈ పదిరోజులుగా హైదరాబాద్‌లో తను మిస్సయిన అమ్మాయిల్ని గుర్తుచేసుకొంటూ సామాను సర్దుకుంటున్నాడు ప్రభు.

"ప్రభూ! మేనేజర్ నాకు టిక్కెట్టు ఇవ్వలేదు. మరిచిపోయాడేమో! అడిగొస్తాను...." అన్నాడు భార్గవ. తన ప్రయాణం గురించి ఆలోచనలో వున్నాడతను.

ప్రభు నవ్వాడు.

"సింపుల్ కామన్ సెన్స్ బాస్! నీకు టిక్కెట్టు ఇవ్వలేదంటే నువ్వు మాతోపాటు రావటం లేదని అర్థం" తన లగేజిని చూసుకొంటూ చెప్పాడు ప్రభు.

"అంటే మీరంతా వెళ్ళిపోతే నేనిక్కడ గోళీకాయలాట ఆడుకోనా?"

"గోళీకాయలాట ఏం ఖర్మ బాసూ! అదృష్టం తన్నుకొస్తే, మంచి ఆటలే ఆడుకోవచ్చు. నువ్వు ఈ సినిమాలో సైడ్ హీరోవి. కర్మకాలి పెద్ద హీరోవి అయిపోతావనే భయం, గౌరవం యూనిట్‌కి వుంటాయి."

"ఏంటిరా నీ వాగుడు?"

"వాగుడు కాదు నాయనా! నువ్వు మాలాంటి బచ్చాగాళ్ళతో రావటం లేదు. నీకు వి.ఐ.పి. ట్రీట్‌మెంట్ ఇస్తున్నారు. నువ్వు పెద్దవాళ్ళతో కలిసి కారులో వస్తావన్నమాట...."

భార్గవకి తట్టలేదప్పటివరకు. కానీ అలా జరుగుతుందా?



కారు మొహం తెలీక, కారులో ప్రయాణం తెలీకా కాదు అతని ఆశ్చర్యం!

హీరో, హీరోయిన్‌తో సమానంగా తనను కూడా వాళ్ళతో కారులో తీసుకెళ్తారా అన్నది అతనికి ఆశ్చర్యంగా వుంది.

నమ్మకం కుదరటంలేదు.

"అదేం అయ్యుండదు. మేనేజర్ నాకు టిక్కెట్టు ఇవ్వటం మర్చిపోయి వుంటాడు."

"మరీ క్లాస్ ఫోర్‌లా ఆలోచించకు. నీ సంగతి ఇక్కడ ఎవరూ మర్చిపోరు. ఇది చౌదరిగారి కంపెనీ! ఇక్కడన్నీ చాలా పకడ్బందీగా జరుగుతాయి. పొరపాట్లు, మర్చిపోడాలూ జరిగే అవకాశం లేదిక్కడ...." అన్నాడు ప్రభు.

నిజమే! ప్రభు మాటల్ని కొట్టిపారేయటానికి లేదు. కానీ పెద్ద నటులతో, చౌదరిగారితో తనకి కార్లో సీటిస్తారంటేనే విడ్డూరంగా వుంది. అలా అనుకునేకంటే మేనేజర్ పొరబడ్డాడేమో అనిపిస్తోందతనికి.

"నాకంత స్పెషాలిటీ చూపిస్తారనుకోను. చూడూ! నేనూ మీతో రైల్లోనే వస్తాను."

"ఉన్నది చెప్పాను. నమ్మకపోతే నడిచిరా! నీ ఖర్మ."

ప్రభు ఎంత చెప్పినా నమ్మని అతనికి అందరూ వెళ్ళిపోయాక అర్థం అయ్యింది.

"భార్గవా! సార్ బయలుదేరమంటున్నారు...." అని మేనేజర్ వచ్చి చెప్పాడు.

అతను సూట్‌కేస్‌తో నడిచాడు.

కారిడార్‌లో చౌదరి, హీరో, హీరోయిన్ నిలబడి వున్నారు.

ఎదురుగా మూడు కార్లున్నాయి.

భార్గవ ఆయన పిలుపు కోసం ఎదురు చూస్తూ నించున్నాడు.

ముందు కార్లో మేనేజర్ శర్మ కూర్చుని భార్గవని పిలిచాడు.

వెంటనే వెళ్ళి ఆ కార్లో కూర్చున్నాడతను.

కొద్దిగా తలతిప్పి చూశాడతను.

రెండో కారులో చౌదరి ఒక్కడే ఎక్కాడు.

అయనలాగే ఆ కారు కూడా ప్రత్యేకంగా కనిపిస్తోంది.

తెల్లని ఫారిన్ కారు. ముద్దుగా రెక్కలు ముడుచుకు కూర్చున్న పావురంలా వుంది. కవులు వర్ణించే రాజహంసలా వుంది.

మూడో కారులో హీరోగారు, హీరోయిన్ ఎక్కారు.

కార్లు కదిలాయి. ఒకదాని వెనకే ఒకటి బయలుదేరాయి.

అదంతా కలలా ఉందతనికి.

చౌదరి చూపిస్తున్న ఈ ప్రత్యేక ఆదరణ అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తోంది.

తెల్లారేసరికి ఈ వార్త చిత్ర పరిశ్రమ మొత్తం పాకిపోతుంది.

తన విలువ ఉన్నపాటున పెరిగిపోతుంది.

ఇన్నాళ్ళకి తన కలలు ఫలించాయి. రేపట్నుంచి ఎన్నో ఆఫర్లు రావచ్చు. డూప్ జీవితానికి స్వస్తి చెప్పచ్చు.

చౌదరి సమర్థుడు. ఏ వ్యక్తిలోని ప్రత్యేకతనైనా ఇట్టే పసికట్టగల వ్యక్తి అని ఆయన గురించి అందరూ అంటారు.

తనలోని టాలెంట్‌ని ఆయన పసిగట్టి తనకి అవకాశం యిస్తున్నాడు.

ఒక్కసారిగా రెక్కలొచ్చి ఆకాశంలోకి ఎగిరిపోతున్నంత ఆనందంతో ఉక్కిరి బిక్కిరయ్యాడు భార్గవ.

* * * * *



మూడు గంటలపాటు ప్రయాణం సాఫీగానే సాగింది. మధ్య మధ్యలో మేనేజర్ శర్మ అడిగే ప్రశ్నలకి సమాధానం ఇస్తున్నాడు భార్గవ.

భార్గవతో మాట్లాడుతూనే మధ్య మధ్యలో వెనక్కి తిరిగి చూస్తున్నాడు మేనేజరు.

"డ్రైవర్ కారాపు. ఆయనగారి కారు వెనకాల రావడంలేదు" సడన్‌గా అన్నాడు మేనేజర్.

వెంటనే కారాగిపోయింది.

పది నిమిషాలు చూసినా చౌదరి కారు రాలేదు.

కారుని వెనక్కి పోనివ్వమన్నాడు మేనేజర్.

మళ్ళీ వెనక్కి తిరిగింది కారు.

ఆరు కిలోమీటర్లు వెనక్కి వెళ్ళగానే వాళ్ళకి కావల్సిన కారు కనబడింది.

ఉలిక్కిపడ్డారు శర్మ, భార్గవ, డ్రైవర్ కూడా!

చౌదరి కారు ఓ చెట్టుకు గుద్దుకొని వుంది.

మరుక్షణం కారులోంచి కిందికి దుమికి పరుగెత్తారు శర్మ, భార్గవ, డ్రైవర్.

డ్రైవర్ స్పృహలో లేడు.

చౌదరి వెనక సీట్లో....అలాగే పడివున్నాడు. ఆయన నోటినుంచి కొంచెం రక్తం స్రవిస్తోంది.

భార్గవ వాటర్ బాటిల్ తీసి శర్మకి అందించాడు.

నీళ్ళని చౌదరి ముఖం పైన చల్లాడు శర్మ.

డ్రైవర్ విషయం తోటి డ్రైవరే చూస్తున్నాడు.

"సార్....సార్...." కంగారుగా పిలిచాడు శర్మ. చౌదరి మెల్లగా కళ్ళు తెరిచాడు.

ఎదురుగా వున్న మేనేజర్ని, భార్గవనీ అమాయకంగా చూశాడు.

"దాహం" అంటూ సైగచేశాడు.

బాటిల్లోంచి గ్లాసులోకి నీళ్ళని వంపి కొద్ది కొద్దిగా ఆయన నోట్లో పోశాడు మేనేజరు.

కొంచెం తాగి తల తిప్పేశాడు చాలన్నట్టుగా.

అప్పుడు తెలిసినట్టుంది బాధ.

ఒక్కసారిగా గట్టిగా మూలిగాడు చౌదరి.

"ఎలా వుంది సార్! దెబ్బలు తగిలాయా బలంగా" జరిగిన ప్రమాదం కంటే తగిలిన గాయాలని గురించి తెలుసుకోవడం సరయినదిగా భావించాడు శర్మ.

"కాలు....కాలు...." బాధగా అన్నాడు చౌదరి.

అప్పుడు చూశాడు శర్మ.

ఆయన కాలు ముందు సీట్లోకి ఇరుక్కుని వుంది.

నెమ్మదిగా కాలు ఒత్తిగింపారు శర్మ, భార్గవా కలిసి.

కాలు ముట్టుకుంటేనే అరుస్తున్నాడు చౌదరి.

కాలు బాగా వాచింది.

"ఎముక విరిగినట్టుంది" తనలో తనే అనుకున్నాడు శర్మ.

"భార్గవా, నువ్వు, యాదయ్య కలిసి సాయం పట్టండి. అయ్యగార్ని మన కార్లో పడుకో బెడదాం" అన్నాడు శర్మ.

అప్పటికే డ్రైవర్కి తెలివొచ్చింది.

కానీ చౌదరి కన్నా ఎక్కువ దెబ్బలు తగిలినా తన యజమాని పరిస్థితి ఎలా వుందో అన్న ఆరాటం అతని ముఖంలో కనిపిస్తోంది.

భార్గవ, శర్మ, డ్రైవర్ యాదయ్య కలిసి చౌదరిని వాళ్ళ కారులోకి మార్చారు.

అంతలో మూడో కారు అక్కడికి చేరుకుంది.



అంతవరకూ హీరోయిన్తో సరదాగా మాట్లాడుతోన్న హీరో యాక్సిడెంట్ విషయం వినగానే కంగారుపడిపోయాడు.

"మీ కార్లో ఈ డ్రైవర్ని తీసుకురండి. అయ్యగార్ని మా కారులో తీసుకెళ్తున్నాం" తొందర చేశాడు మేనేజరు శర్మ.

మరుక్షణం రెండు కార్లు ముందుకి పరుగు దీశాయి.

ఫ్రంట్ సీట్లో కూర్చున్నాడు భార్గవ.

కొంచెం తల తిప్పి చూశాడు. చౌదరి తలని ఒళ్ళో పెట్టుకుని కూర్చున్నాడు శర్మ.

నిద్రపోతున్నాడో లేక స్పృహలో లేడో కానీ చౌదరి కళ్ళు మూసుకొని పడుకున్నాడు.

అయితే బాధతో ముఖం చిట్లిస్తున్నాడు.

ఏదో ఒకటి, రెండుసార్లు చౌదరిని దగ్గరగా చూసినా, తీక్షణమైన అతని కళ్ళలోకి చూసే ధైర్యంలేకా, భయభక్తులతో అతన్ని పరిశీలనగా చూడలేదు భార్గవ.

ఇప్పుడు పట్టి పట్టి చూస్తున్నాడు.

వయసు యాభై లోపు వుంటుంది. సరైన పోషణవల్ల, డబ్బుతో వచ్చిన దర్జావల్లా అంత వయస్సు వున్నవాడిగా కనిపించడంలేదు. పచ్చగా వున్నాడు మనిషి. క్రీమ్కలర్ సఫారీ అతని ఒంటి రంగులో కలిసిపోతోంది.

మెడలోని ఒంటి పేట చైన్ బయటకి వేలాడుతోంది. దాని చివర పులిగోరు.

అతను కళ్ళు మూసుకునే వున్నా పట్టి పట్టి చూస్తున్నట్టుగా వుంది భార్గవకి.

గబుక్కున చూపుని మరల్చుకున్నాడు భార్గవ.

నోరు తెరిచి ఏమీ అనకపోయినా, చూపులతోనే శాసించే పెద్దపులి లాంటి చౌదరి అలా నిస్సహాయంగా యాక్సిడెంట్ తాకిడికి నిస్తేజంగా పడి వుండడం చూస్తూంటే బాధ కలిగింది భార్గవకి.

ఆయన త్వరగా కోలుకోవాలని మనసులోనే దేవుడ్ని ప్రార్థించాడు భార్గవ.

అతను తనపట్ల కనపర్చిన శ్రద్ధ గుర్తొచ్చేసరికి ఆ బాధ రెండింతలైంది.

"భగవాన్! ఇంత మంచి మనిషికి ఏ ప్రమాదమూ జరక్కుండా కాపాడు."

మనసులోనే దేవుడ్ని ప్రార్థించాడు భార్గవ తిరిగి.

ఎంత తొందరగా అతనికి డాక్టరు సహాయం అందుతుందా అని తహతహ లాడుతున్నాడు భార్గవ.

మధ్యలో కారాపించి ఒకరిద్దరిని వాకబు చేశాడు మేనేజరు.

మరో అయిదు నిమిషాల్లో ఓ పెద్ద నర్సింగ్ హోమ్ ముందాగాయి రెండు కార్లూ.

అప్పటికి తెలివిలో కొచ్చి కళ్ళువిప్పి చూశాడు చౌదరి.

* * * *

పైకి కనిపించక పోయినా డ్రైవర్‌కి చాలా ఎక్కువ దెబ్బలు తగిలాయి.

స్టీరింగ్‌కి సీటుకీ మధ్యలో ఉండిపోయినందువల్ల గుండె బాగా నత్తుకుపోయింది.

క్షణాల మీద అతన్ని ఆపరేషన్ థియేటర్లోకి తరలించారు.

చౌదరికి ఏమీ అపాయం లేదనీ బహుశా కాలు విరిగి ఉండచ్చనీ చెప్పారు.



అయితే ఆపరేషన్ టేబుల్ మీదే కన్నుమూశాడు డ్రైవర్.

ఆ వార్త వినగానే చాలా బాధపడ్డారు భార్గవ వాళ్ళంతా.

చౌదరికి ఫర్వాలేదని చెప్పినా, అతన్ని గురించి ఆత్రుతగా ఎదురు చూడసాగారు బృంద సభ్యులు.

అంతలోనే డాక్టరు వచ్చి డ్రయివర్ బాడీని తీసికెళ్ళవలసిందిగా చెప్పడంతో వాళ్ళంతా అటు వెళ్ళారు.

వాళ్ళు తిరిగొచ్చేసరికి చౌదరి వార్డులోకి తరలించబడ్డాడని తెలిసి వార్డులోకి పరిగెత్తారు.

సరిగ్గా ఇంటి కెళ్ళబోతూన్న సమయానికి వచ్చిన ఆ యాక్సిడెంట్ కేస్ ఎటెండయి అలిసిపోయిన డాక్టరు ఇంటికెళ్ళిపోయాడు. మరో అర్ధ గంటలో లేడీ డాక్టర్ ఎటూ వస్తుంది కదా డ్యూటీకి అన్న ధీమాతో.

* * * *

కళ్ళు తెరిచే ఉన్నాడు చౌదరి.

తన చుట్టూ చేరిన వాళ్ళందరినీ చూస్తూనే చిరునవ్వు నవ్వాడు.

అతనికెలా ఉందో అని ఆతృతగా చూస్తున్న వాళ్ళందరికీ ఆ నవ్వే పెద్ద రిలీఫ్ నిచ్చింది.

"ఎలా ఉంది సార్? ఏమయ్యింది?"

ఆత్రుతగా అడిగాడు మేనేజర్ శర్మ ఆయన్ని సమీపించి.

"నాకేం ఫర్వాలేదు— డ్రయివర్‌కి ఎలా వుంది?"

ఆరా తీశాడు చౌదరి.

క్రిందవారి పట్ల ఆయన చూపించే శ్రద్ధకి మనసులోనే జోహార్లర్పించాడు భార్గవ.

"పాపం, డ్రయివర్ పోయాడు సార్."

విచారంగా చెప్పాడు మేనేజర్ శర్మ.

ఆయనున్న పరిస్థితిలో అలాంటి వార్త చెప్పచ్చో, లేదో తెలీదు. కానీ, ఆయనకా వార్త తెలియచేయడం తన బాధ్యతనిపించింది శర్మకి.

"అరెరే!" చాలా బాధపడ్డాడు చౌదరి.

"మీరు వెంటనే ఆ బాడీని తీసికెళ్ళి వాళ్ళ వాళ్ళకప్పగించి, జరగవలసిన పనులన్నీ చెయ్యండి" ఆజ్ఞాపించాడు.

"సార్! అవి చూడ్డానికి నేను వెళ్ళాలి కనక భార్గవని మీకిక్కడ సాయంగా వుంచివెళ్తాను"

వినయంగా అన్నాడు శర్మ.

"గో! నాకేం ఫర్వాలేదు. కాలుకే కదా ప్రాబ్లెం. నన్ను చూసుకునేందుకు హాస్పిటల్ స్టాఫ్ వున్నారు. మీరంతా వెంటనే వెళ్ళి డ్రయివర్ విషయం చూడండి. అసలే పిల్లలు గలవాడు. ఈ వార్త విని వాళ్ళెంత షాకవుతారో! ఆ అవసరాలు చూడండి మీరు. మేనేజర్! ముందు ఓ పది వేలు తీసి వాళ్ళ వాళ్ళకియ్యండి. నేనొచ్చాక వాళ్ళకి ఎంతివ్వాలో అంతా ఇద్దాం. ఆ కుటుంబం వీధిపాలు కాకుండా చూడాల్సిన బాధ్యత మనది."

ఆ కంఠంలోని కమాండ్‌కి ఎదురు చెప్పే ధైర్యం లేదు ఎవరికీ.

ఒకవేళ ఇక్కడుండిపోవాల్సి వస్తుందేమో. చౌదరిని ఈ స్థితిలో వదిలివెళితే, ఈయనేమనుకుంటాడో, వెళ్ళకుండా ఆగిపోతే మర్నాటికి కాల్షీట్స్ ఇచ్చిన నిర్మాతలెంత మొత్తుకుంటారో అనే సందిగ్ధంలో కొట్టుమిట్టాడుతున్న హీరో హీరోయిన్లకి ఆయన మాటలు అమృతంలా తోచాయి

ఎలాగూ ఆయనే వెళ్ళిపోమంటున్నాడు కనక సమస్యే లేదు అనుకుంటూ రిలీఫ్‌గా నిట్టూర్చారు.

బాగుండదని తమ వంతుగా వాళ్ళూ అన్నారు ఉండిపోతామని. అయితే చౌదరి అందుకు ఒప్పుకోలేదు.



కనీసం డాక్టరు వచ్చేంతవరకూ వుండి మాట్లాడి వెళ్ళే అవకాశాన్ని కూడా ఇవ్వలేదతను నలుగురు పిల్లల తండ్రయిన ఓ అమాయకుడి శవాన్ని దగ్గర పెట్టుకుని ఇలా టైం వృధా చెయ్యడం భావ్యం కాదంటూ వాళ్ళని వెంటనే పంపించేశాడు చౌదరి.

* * * * *

శర్మ డ్రయివర్ శవాన్ని హాస్పిటల్ వాళ్ళ అంబులెన్స్‌లో ఎక్కిస్తుంటే.... బరువయిన గుండెతో చూస్తూ నిలబడ్డాడు భార్గవ.

హీరో హీరోయిన్లు మాత్రం అప్పటికే జారుకున్నారు.

అంతలోనే క్రీమ్ కలర్ కారొచ్చి ఆగింది హాస్పిటల్ ముందు.

ఆ కార్లోంచి ఠీవిగా దిగిందో యువతి.

తెల్లటి చీరలో దేవమాతలా ఉందామె.

ఆమె చేతిలో స్టెతస్కోపుని చూడగానే చటుక్కున డాక్టర్ సుధీర్ గుర్తొచ్చాడు భార్గవకి.

అంతటి విషాదకర సందర్భంలోనూ ఓ చిన్న నవ్వు మెరిసింది భార్గవ పెదాలపై

అతనామెవంక చూస్తుండగానే కారు కదిలి వేగాన్నందుకుంది.

* * * * *

నాలుగురోజులు గడిచిపోయాయి బరువుగా.

ఈ నాలుగు రోజులుగా అతను ప్రతిరోజూ డ్రయివర్ ఇంటికి వెళ్ళొస్తూనే వున్నాడు భార్గవ.

ఆరేళ్ళలోపులో వున్న డ్రయివర్ పిల్లల్ని నలుగుర్నీ చూస్తుంటే అతని గుండె ఆల్లాడిపోతోంది.

తండ్రి పోయిన విషయం కూడా అర్థం చేసుకోలేని పసివయస్సులో వున్నారు వాళ్ళు.

సత్తా కాకాలాంటి ఇలాంటి కసుగందుల్తో, పాతికేళ్ళ దాటని అ
డ్రయివర్ భార్య ముందు ముందు ఎన్నిపాట్లు పడాలో తల్చుకుంటే
కడుపు చెరువైపోతోందతనికి.

అయితే చౌదరి దయాగుణం అతనికి కొస్త మనశ్శాంతినిస్తోంది

తన కోసం, తనని ఎటెండ్ అవడం కోసం ఒక్కడ్ని కూ
ఉంచుకోకుండా, డ్రయివర్ విషయం చూసుకుంటూ శామందర్నీ తరిమి
చౌదరి మంచితనం అతనికి ఊరటనిస్తోంది.

మనిషిని తిరిగి తేలేకపోయినా, ఆర్థికంగా వాళ్ళకే ఇబ్బందీ ఆయ
రానివ్వగలడనేది మాత్రం నిజం.

ఆ ఊహే అతనికి రిలీఫ్‌నిస్తోంది.

* * * * *

ఆ రోజూ మామూలుగానే వెళ్ళాడు డ్రయివరింటికి.

వసారాలో ఓ మూలగా పెట్టివున్న పళ్ళబుట్టా, బియ్యం మూటా
పచారీ సామాన్లూ అతని దృష్టిని ప్రత్యేకంగా ఆకర్షించాయి.

డ్రయివర్ పిల్లలు నలుగురూ అక్కడే కూర్చుని పళ్ళు తిం
న్నారు.

"రండి బాబూ! కూచోండి."

అతని రాకని గమనించిన డ్రయివర్ భార్య సీత అతన్ని ఆహ్
నించింది లేచి నిలబడి చెంగు భుజం మీంచి కప్పుకుంటూ.

అక్కడే వున్న చిన్న స్టూలుమీద కూర్చున్నాడు భార్గవ.

ఈ నాలుగురోజులుగా వచ్చి పోతూండడంతో అతనంటే గౌరవ
పెరిగింది సీతకి.

అతను తమ శ్రేయోభిలాషే అన్న నమ్మకం కూడా కలిగిం
ఆమెకి.



"అయ్యగారు ఊర్నుండి పొద్దునే వచ్చారట బాబూ. ఇదిగో.... ఇవన్నీ పంపారు. డబ్బు కూడా రెండువేలు పంపారు. దేనికీ ఇబ్బందీ పడవద్దనీ, ఏం కావాలన్నా అడగమనీ కబురు చేశారు బాబూ! ఆయన కాలు తగ్గగానే అంతా సర్దుబాటు చేస్తారట. నాకేం కావాలి బాబూ! ఆయన మొన్న పంపిన డబ్బులోపే ఆరేడువేలు వున్నాయి. ఇట్టాంటివి ఎన్ని వేలయినా ఎందుకు బాబూ! బిడ్డలకి తండ్రి లేకపోయాక...."

భోరుమంది మొహం చెంగులో దాచుకుని సీత.

ఆమె అన్నదీ నిజమే!

ఎంత డబ్బయినా ఆ బిడ్డలకి తండ్రి లేని లోటునీ, ఆమెకి భర్తలేని లోటునీ తీర్చలేదు.

కానీ జరిగినదానిలో తన తప్పేం లేదంటూ పక్కకి తప్పుకోకుండా డ్రయివర్ తన అజాగ్రత్త డ్రయివింగ్ కారణంగానే ప్రాణాలు కోల్పోయినా. అతని కుటుంబాన్ని ఆదుకుంటున్నాడు చౌదరి.

అది మాత్రం విశేషమే!

"అయ్యగారు వచ్చేశారా సీతా? ఎలాగుందట ఆయనకి?" ఆత్రుతగా అడిగాడు భార్గవ.

"పొద్దున్నొచ్చారట బాబూ! కాలిరిగిందట. ఇంకా చాలా రోజులు పడద్దట అతుక్కోటానికి. అంతవరకూ మంచం మీదే వుండాలట."

దుఃఖంనుండి తేరుకుంటూ అంది సీత.

"అయ్యో పాపం. కాలు విరిగిందా? ఆనాటి ఆయన నిబ్బరాన్ని చూసి ఏదో చిన్న దెబ్బలే అనుకున్నాడు. పాపం కాలు విరిగిందంటే ఎన్నాళ్ళు పడుతుందో తిరిగి మామూలుగా లేచి నడవడానికి?"

బాధపడ్డాడు భార్గవ.

ఓ మంచి నిర్మాతనేకాక, వ్యక్తిగతంగా ఆయన మంచితనాన్ని చూసిన తర్వాత భార్గవకి ఆయన మీద ఎడ్మిరేషన్ పెరిగింది. ఆయన్ని వెంటనే చూసి రావాలనిపించింది.

సీతతో చెప్పి బయటకి నడిచాడు భార్గవ.

* * * * *

చౌదరి భవంతి ముందు నిలబడ్డాడు భార్గవ.

తలెత్తి ఓసారి ఆ భవనాన్ని చూశాడు.

బ్రహ్మాండంగా వుందా బిల్డింగ్.

మూడంతస్తులే అయినా.... చాలా ఎత్తుగా వుంది.

తెల్లగా, పాలరాత్తో కట్టినట్టు తళతళ లాడుతోంది.

గేటు దగ్గర గూర్ఖా అడ్డగించాడతన్ని.

మామూలుగానే అనుమతి లేకుండా ఎవర్నీ లోపలికి పంపడు.

ఇప్పుడాయన అనారోగ్యంతో వుండగా పంపిస్తాడా?

ఆయన్ని చూడాలనే ఆరాటంతో పరిగెట్టుకొచ్చేశాడు. కానీ ఇక్కడి కొచ్చాక తెలుస్తోంది. లోపలికెళ్ళడం ఎంత కష్టమో!

పెద్ద పెద్ద హిరోలనే లోపలికి వదిలేట్టు లేడీ గూర్ఖా.

తనలాంటి చిన్న మనుషులు వాడికో లెఖ్ఖా?

ఏం చెయ్యాలో తోచక అక్కడే నిలబడ్డాడు అయోమయంగా.

"అరే! జావ్ రే జావ్" అంటూ అదలిస్తున్నాడు గూర్ఖా.

అంతలోనే అక్కడో కారాగింది.

వినయంగా సెల్యూట్ చేసి నిలబడ్డాడు గూర్ఖా.

ఆ కార్లోంచి మేనేజరు శర్మ దిగాడు.

ఆ సమయంలో శర్మని చూడగానే, దేవుడే దిగి వచ్చినట్టనిపించింది భార్గవకి.



'సార్' అంటూ అటు పరిగెత్తాడు.

"అరె....నువ్వా భార్గవా, ఎప్పుడొచ్చావ్?" అభిమానంగా పలకరించాడు శర్మ.

"ఇప్పుడే వచ్చానండీ, సార్ పొద్దున్నొచ్చారటగా? సీత చెప్పింది. చూసి పోదామని వచ్చాను."

లోపలికి పోనివ్వలేదంటూ గూర్ఖా మీద చాడీలు చెప్పడం తప్పనిపించింది భార్గవకి.

అది అతని ఉద్యోగ ధర్మం. ఎవరుపడితే వాళ్ళు లోపలికి రాకుండా చూడ్డానికే అతనికి జీతమిస్తున్నారు.

అతని బాధ్యతని అతను నిర్వహించాడు.

అందుకతన్ని మెచ్చుకోవాలి తప్ప, నిందించ కూడదనిపించింది

"అవునయ్యా! ఆయనకి కాలు ఫ్రాక్చరయింది. పాపం ఒక్కరూ ఈ నాలుగురోజులూ అక్కడెట్లా అవస్థపడ్డారో! మామూలుగా నడిచేందుకు మరో రెండు మూడు నెలలు పట్టచ్చు."

విచారంగా చెప్పాడు శర్మ.

"ఇప్పుడెలా ఉన్నారాయన? నేనోసారి చూడచ్చా?" మర్యాదగా అడిగాడు భార్గవ.

మామూలు పరిస్థితిలో అయితే భార్గవలాంటి వ్యక్తికి ఆయన్నీ స్థితిలో చూడ్డానికి పర్మిషన్ దొరికేది కాదు.

కానీ ఆ యాక్సిడెంటు జరిగినప్పుడు అతనూ ఉన్నందువల్లా, ఆ తర్వాత కూడా డ్రైవరు కుటుంబం విషయంలో అతను చూపిస్తున్న సాను భూతికట్లా, ముఖ్యంగా చౌదరి భార్గవ ఎలా వున్నాడంటూ ఉదయం రాగానే ప్రత్యేకంగా అడిగినందువల్లా ఒకసారి భార్గవని చౌదరి దగ్గరికి తీసుకువెళితే బాగుంటుందని అభిప్రాయపడ్డాడు శర్మ.

"రావోయ్ రా! అయ్యగారు కూడా నిన్నుగూర్చి అడిగారులే..

ఆప్యాయంగా భార్గవ భుజం మీద చెయ్యేసి లోపలికి తీసుకెళ్ళా తనతోపాటుగా.

* * * * *

హాల్లోకి ప్రవేశించారిద్దరూ.

"ఒక్కసారి సాబ్‌తో ఓ మాట చెప్పి వస్తాను నువ్వొచ్చావని.. అంటూ లోపలికెళ్ళాడు శర్మ.

ఒక్కడూ హాల్లో మిగిలిపోయాడు అతను.

తలెత్తి ఓసారి చుట్టూ చూశాడు.

సినిమాల్లో చూపిస్తున్న బిల్డింగ్స్‌నే ఎంతో గొప్పగా అనుకునే తను యిన్నాళ్లూ!

ఇప్పుడీ ఇల్లు చూస్తుంటే సూర్యుడి ముందు దివిటీల్లా అవి యనిపిస్తోంది.

ఆయిల్ కలర్స్‌తో పెయింట్ చెయ్యబడ్డ ఇళ్ళన్నీ చూశాడు త వరకూ.

కానీ ఇంత కాంతిగా ఏ ఇల్లూ లేదు.

క్రీమ్ కలర్ గోడలు మెరిసిపోతున్నాయి.

ఆ గోడల్లో మొహం చూసుకోవచ్చనిపిస్తోంది.

అందమైన ఆ గోడల మీద చక్కటి సీనరీలు పెయింట్ చే బడ్డాయి.

నిజానికి ఆ పెయింటింగ్స్ చూస్తుంటే ఎక్కడో పార్కులో న్నట్టుందే తప్ప ఓ యింట్లో హాలులో కూర్చున్నట్టు లేదు.

ఓ గోడకి మ్యూజికల్ క్లాక్....

పైన అందంగా వేలాడుతున్న షాండ్లియర్....



అలా చూస్తూ ఎంతసేపు నిలబడిపోయాడో తనకే తెలియదు-శర్మ వచ్చి పిలిచేంతవరకూ.

"రా భార్గవా! అయ్యగారు రమ్మంటున్నారు."

మేడ మెట్లెక్కి పైకి దారితీశాడు శర్మ.

అతన్ననుసరించాడు భార్గవ.

చౌదరి గదిని చూస్తూనే కొయ్యబొమ్మయిపోయాడతను.

ఇంతవరకూ హాలు సౌందర్యానికే మురిసిపోయిన అతనికి చౌదరి గదిని చూస్తుంటే మాట రావట్లేదు.

నీలి కాంతితో డిమ్‌గా కనిపిస్తున్న గోడల మధ్య ఓ ప్రత్యేక ప్రపంచంలా వుందా గది!

ఆ గదిలో విశాలమయిన మంచం....

ఆ మంచం తయారుచేసిన కార్పెంటరు ఎంత కళాకారుడో అనిపిస్తోంది.

ఆ విశాలమయిన మంచం మీద మెత్తటి పరుపు చౌదరి కదిలినప్పుడల్లా రియాక్షనిస్తున్న పరుపు మెత్తదనం.... చూస్తుంటేనే తెలిసిపోతోంది.

గులాబీ రంగు శాటిన్ దుప్పటి అందంగా మెరిసిపోతోంది.

స్వీట్ డ్రీమ్స్ అంటూ పెయింట్ చేయబడ్డ కవర్లతో ఆ పిల్లోలని చూస్తున్న వ్యక్తికే స్వీట్ డ్రీమ్స్ వచ్చేట్టున్నాయి.

గోడలకి అద్భుతమైన నిర్మల్ పెయింటింగ్స్!

ఇంత అందమైన గది ఉంటుందని కూడా తెలియదు తనకింత వరకూ.

డబ్బుండగానే సరికాదు- కళాహృదయం కూడా ఉన్నవాడికే ఇంత అందంగా అలంకరించుకోవాలనే తపన వుంటుంది.

చౌదరికంటే డబ్బుగల వాళ్ళెంతోమంది ఉండచ్చు. కానీ ఇంతకంటే అందంగా మాత్రం వాళ్ళ గదులుండవని నమ్మకంగా అనిపించింది అతనికి.

ఈ గదే ఇలా ఉంటే- ఇంక ఆయన బెడ్‌రూమ్ ఎలా ఉంటుం
ఆ ఊహకే అతనికి ఒళ్ళు జల్లుమంది.

అందులోనూ అతను అర్నెల్ల కిందటే పెళ్ళి చేసుకున్నాడని, అ
భార్య అద్భుతమయిన అందగత్తె అనీ అందరూ అనుకుంటూంటే విన్నా

అది అతనికి మొదటి పెళ్ళో కాదో తెలియదు కానీ ఆ పెళ్ళి
మాత్రం అర్నెల్లే అయ్యిందని అందరికీ తెలుసు.

ఆమె అందాన్ని ఎవరన్నా చూసి దిష్టిపెడతారనేమో, ఎంత ప
మైన ఫంక్షన్‌కయినా ఆమెను తీసుకురాడు- తనొక్కడే వస్తాడు.

"అది భార్య మీదగల అనురాగమా, అనుమానమా అని నలుగ
చెవులు కొరుక్కోవడం తనకి తెలుసు.

ఇంతటి కళాహృదయం ఉన్న ఈ వ్యక్తి అంతటి అందగ
భార్యతో స్వర్గసుఖాల ననుభవించటానికి అమర్చుకున్న ఆ పడకగది
అందంగా వుంటుందో ఊహకే అందట్లేదు భార్గవకి.

ఒక్కసారి....ఒకే ఒక్కసారి ఆ గది చూడగలిగితే....? ఆ
అదృష్టం కలిగితే....?

ఒళ్ళు పులకరించింది అతనికి.

"అలాగే ఉండిపోయావేంటి భార్గవా! కూర్చో అలా" చౌదరి గొ
వింటూనే ఉలిక్కిపడి యీ లోకంలోకొచ్చాడతను.

తన పరధ్యానానికి సిగ్గుపడుతూ "నమస్కారమండీ...." అం
బన్సీలాల్‌కి చేతులు జోడించాడు.

"కూర్చోవోయ్ అలా, మరీ అంత పరాకా?"

సరదాగా అన్నాడు చౌదరి.

నిజానికి ఆయనకీ తెలుసు... తన గది చూస్తే ఎవరయినా
మైమరిచిపోతారో!



అయితేనేం- అలా దాన్ని మామూలు విషయంగా ప్రక్కన పెట్టెయ్యడం ఆయన హాబీ.

సోఫాలో కూర్చుంటూ ఆ సోఫాలోని కుషన్లవంక చూశాడోసారి భార్గవ.

తెల్లటి కవరు మల్లెపువ్వులా మెరుస్తోంది.

తను కూర్చుంటే ఆ సోఫా దిండు మాసిపోతుందేమో అన్న వెరపు కలిగించింది అతనికి.

ఇంత తెల్లటి కవర్ల మీద కూర్చుని పాడుచేసేకంటే నేల మీద కూర్చోడం ఉత్తమం అన్న భావం కలిగిందతనికి.

ఆ ఆలోచనే హాస్యాస్పదంగా తోచింది మళ్ళీ. అయినా తనకేం తక్కువని!?

సోఫాలో కూర్చున్నాడతను.

ఆ మెత్తదనం అతన్ని ఎక్కడికో తేల్చేస్తున్నట్టయింది.

"ఎలా ఉంది సార్?"

తనొచ్చిన పని గుర్తొచ్చి అడిగాడు భార్గవ వినయంగా.

"ఈ మధ్య షూటింగులంటూ రెస్ట్ లేకుండా తిరుగుతున్నానని దేవుడికి దయపుట్టిందేమో....ఇదిగో, యిలా రెండునెల్ల విశ్రాంతిచ్చాడు. నా విషయంలో మేలే చేశాడు కానీ, పాపం ఆ డ్రయివర్‌కే అన్యాయం చేశాడోయ్!"

ఎప్పుడూ ఆజ్ఞాపించడమే తెలుసుననిపించే చౌదరి గొంతులో విషాదం ఒలుకుతోంది.

డైరెక్టుగా అంత ఫ్రీగా చౌదరితో మాట్లాడటం అదే ప్రథమం భార్గవకి.

ఏదో ముభావంగా మాట్లాడుతుంటాడనే అందరూ అంటారు.

అలాంటి వ్యక్తి యింత చక్కగా మాట్లాడుతూంటే భార్గవకి
విధమైన జంకే కలిగింది.

తనకొచ్చిన కష్టాన్ని ఖాతరు చేయకుండా, ఎదుటి వ్యక్తి గూ
ఆలోచిస్తూన్న ఆయన హృదయ వైశాల్యానికి ఎంతో అభినందించా
మనస్సులోనే.

"మేమంతా మీ డబ్బు తింటూ మిమ్మల్ని కష్టంలో అక్కడ ఒం
రిగా వదిలి వచ్చేశాము. మమ్మల్ని క్షమించండి"

చిన్నగా నవ్వాడు భార్గవ.

"ఇందులో మీరు చేసిన తప్పేముంది? నామాట మీదేగా వచ్చేశా
అయినా నా పరిస్థితి మరీ అన్యాయంగా లేదుగా. అక్కడ వాళ్ళంతా న
బాగా చూసుకున్నారే! మీరక్కడ వృథాగా నా వద్ద వుండిపోయేకం
యిక్కడ డ్రయివర్ భార్యాపిల్లలకు తోడుగా వుండటమే నాకు కా
సింది...."

ఇదంతా ఎరిగిన విషయమే అయినా ఫార్మాలిటీగా భార్గవ ఆ మా
లన్నాడు.

అంతలోనే చౌదరి సడన్‌గా గుర్తొచ్చినట్టుంది, శర్మ వంక తి
అన్నాడు—

"చూడు శర్మా! నువ్వర్జెంటుగా మన వర్కింగ్ సైటుకెళ్ళి ఇ
సీర్‌ని కలిసి మాట్లాడు, ఏమేం కావాలో, అవసరమైతే ఫోన్ చెయ్
పురమాయించాడు.

"సర్ సర్! భార్గవ...." అంటూ అర్ధోక్తిగా ఆగిపోయాడు శ

"భార్గవ కాస్సేపిక్కడ ఉంటాడులే! నాకూ తోచట్లేదు నువ్వెళ్ళి
నెమ్మదిగా అతన్ని పంపిస్తా"

తోచకపోవడం అనేదొకటుందని చౌదరికి తెలియనే తెలియదను
మేనేజరు, ఆయన కాలక్షేపానికి భార్గవని ఎన్నుకోవడం అతని అదృష్ట
తలుస్తూ, కాస్త ఈర్ష్యగా భార్గవ వంక చూశాడు.



'ఎలాగయినా నువ్వదృష్టవంతుడివోయ్' అని అభినందిస్తున్నట్టుగానూ ఉందా చూపు.

"నిన్నగాక మొన్నొచ్చి యింత ఛాన్సు కొట్టేశావా" అనే జలసీనో ప్రకటిస్తోందా చూపు.

"వస్తాను సార్" అని చౌదరితో అని వెళ్ళిపోయాడు శర్మ.

ఆ తర్వాత భార్గవతో ఏదో పిచ్చాపాటీ మాట్లాడేడు చౌదరి.

సాధారణంగా ఫిలిం యిండస్ట్రీలో యిద్దరు కలిసినప్పుడు, మూడో వ్యక్తి గూర్చి నిందించుకోవడం, విమర్శించుకోవడం మామూలు.

కానీ చౌదరి మాటల్లో మాత్రం అలాంటిదేమీ దొర్లలేదు.

ఆయన నైజం భార్గవకి బాగా నచ్చింది.

'బాగా సంస్కారం ఉన్న వ్యక్తి' అని ఆయన గూర్చి అనుకున్నాడు.

అయిదు నిమిషాల తర్వాత 'ఇక వస్తానండీ' అంటూ లేచాడు భార్గవ.

"ఒక్కసారి మా యిల్లంతా చూసి వెళ్ళు. నీకు స్విమ్మింగ్ ఇష్టమన్నావుగా....మా స్విమింగ్‌పూల్ చూసి వెళ్ళు. కావాలనుకున్నప్పుడల్లా వచ్చి నీకిష్టమైనంత సేపు స్విమ్మింగ్ చేసుకో. నీకే అభ్యంతరమూ లేదు" అన్నాడు.

'ఇష్టం' అంటూ చాలా చిన్నమాట మాట్లాడాడాయన.

నిజానికి 'స్విమ్మింగ్' అంటే ప్రాణం భార్గవకి.

ఎలాంటి సమస్యలు వున్నా, స్విమ్మింగ్ చేస్తూ మర్చిపోతాడు అతను.

ఇంటి యజమాని మంచం మీదుండగా, తోడుగా ఎవ్వరూ లేకుండా, ఒంటరిగా ఇల్లు చూడ్డం ఉచితంగా వుండదనే భావాన్ని 'స్విమ్మింగ్‌పూల్' చూడాలన్న కోరిక జయించింది.

౨)

మునుగులో పరవళ్ళు తొక్కుతూన్న ఉత్సాహాన్ని అదుముకుంటూ 'అలాగే సార్' అన్నాడు వినయంగా.

*  *  *  *

తోటలో తను దాటుకుంటూ వచ్చిన గదుల అందాన్ని తిలకిస్తూ బిల్డింగ్ వెనుక భాగానికి చేరుకున్నాడు భార్గవ.

అన్ని గదులూ చాలా నీట్‌గా, పొందికగా వున్నాయి.

ఎక్కడా ఏ సామానూ ఎక్స్ట్రాగానూ, తక్కువగానూ లేదు.

ఇల్లంటే యిలా ఉండాలనిపించింది భార్గవకి ఆ యిల్లు చూశాక.

తనకీ అలాంటి యిల్లు కావాలనిపించింది.

తక్షణం బేంకుల్లో ఉన్న తన డబ్బంతా విత్‌డ్రా చేసి అలాంటి ఇల్లు కొనుక్కోవాలన్న కోరిక పుట్టింది.

మరుక్షణంలోనే తన ఆలోచనకి తనే నవ్వుకున్నాడు.

ఆ డబ్బు కాదు, యింకో అంత డబ్బు పెట్టినా యిలాంటి యిల్లు రాదు.

అతి కష్టంమీద సమకూర్చుకున్నా, దాన్ని మెయిన్‌టైన్ చెయ్య గలగడం అసాధ్యం.

చూసి ఆనందించడమే తప్ప, కావాలని కోరుకోవడం ఆకాశగంగ కోసం ఆరాటపడటమే అనుకున్నాడు.

పెరట్లో అంతా మొక్కలే....!

అక్కడ లేని వెరైటీ లేదనిపించింది.

ఓ వైపంతా మొక్కలు....కాంపౌండ్ వాల్‌కిదగ్గరగా పెద్ద పెద్ద చెట్లు.

మండు వేసవిలో కూడా మిట్టమధ్యాహ్నం అక్కడ చెట్టుకింద హాయిగా పడుకుని నిద్రపోయేట్టుంది.



ఆ పువ్వులనుండి వస్తూన్న సువాసనలు మనసుని మత్తెక్కిస్తున్నాయి.

నెమ్మదిగా ఆ అందాలని ఆస్వాదిస్తూ నడుస్తున్నాడు భార్గవ.

స్విమ్మింగ్‌పూల్ నిర్చైన ఓ మూల ఎత్తుగా కనిపిస్తోంది.

అటుకేసి మరలాడు భార్గవ.

స్విమ్మింగ్‌పూల్ కనుచూపు మేరకి వచ్చేసింది.

అప్పుడు....సరిగ్గా అప్పుడే....ఓ అద్భుతమైన దృశ్యం భార్గవ కంటపడింది.

అతనెన్నడూ ఊహించనయినా ఊహించని దృశ్యం అది.

ఆ స్విమింగ్ పూల్లో నీరంతా కదులుతోంది.

మధ్యలో ఓ అందమైన గులాబీల ముద్ద!

అది ఓ తామర పువ్వనుకున్నాడు-

నీళ్ళలో గులాబులుండవనే విషయం మనసుకి తోచాక-

కానీ అదీ నిజం అనిపించలేదు.

ఆ వస్తువు తామరపువ్వు అయినట్టయితే ఎలా కదలగలదు? నీటి కదలిక ఆ వస్తువు కదలికని స్పష్టంగా చూపిస్తోంది!

ఆశ్చర్యంతో నిలబడిపోయాడు భార్గవ.

అంతలోనే ఆ ముద్ద ఒక్కసారిగా పైకి లేచింది.

అప్పుడు తెలిసింది భార్గవకి....అది ఏ పూలముద్దా కాదు....ముద్ద బంతిలాంటి అమ్మాయని.

ఆమె అటుకేసి తిరిగింది.

కేవలం ఆమె తల వెనకభాగం, మెడా, వీపూ మాత్రమే కనిపిస్తున్నాయి భార్గవకి.

కానీ అవే ఆమె అందాన్ని చాటి చెపుతున్నాయి.

ఆమె ఒంటి రంగుని దేంతో పోల్చాలో అర్థం కావటంలే భార్గవకి.

గులాబీరంగు ఒళ్ళు అని మామూలుగా అనటానికి లేదు.

ఇంత విచిత్రమైన గులాబీరంగు అతనెక్కడా చూడలేదు.

గులాబీరంగులో పాలూ, పాదరసం పోసి బాగా గిలకొట్టినట్లు ఉందా ఒంటి కాంతి.

ఆ శరీర కాంతికే అతని కళ్లు బైర్లు కమ్ముతున్నాయి.

జుట్టు ముడికట్టి పైకెత్తినట్టుంది.

శివుడి జటాజూటంలా వుంది.

శంఖంలాంటి మెడ....గుండ్రటి భుజాలు.

ఆ భుజాల నున్నదనం చూస్తేనే తెలుస్తోంది.

నల్లటి స్విమ్మింగ్ డ్రెస్‌లో ఆమె ఒంటి ఛాయ మరింతగా మె నట్టుంది.

చూడకూడని దృశ్యం చూస్తున్నానన్న భావన అస్పష్టంగా మ సులో మెదిలింది.

పరాయి ఆడది స్నానమాడే వేళ తొంగి చూడ్డం అనేది సంస్కా మైన పని కాదన్న విషయం అతనికి తెలుసు.

కానీ.... కానీ ....ఈ అవకాశాన్ని జారవిడుచుకుంటే ఇం అందాన్ని జీవితంలో మళ్ళీ చూడలేనేమో అన్న భయం.

కనీసం కనురెప్పలు కొట్టుకునే సమయంలో అయినా ఆ అంద రాశిని చూడ్డం మిస్ కాకూడదనే కాంక్షతో కనురెప్పవేస్తే ఆమెని 'మి అయిపోతానన్న భావం అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తోంది.

అతని శరీరంలోని ప్రతి అణువూ ఆమె అందంలో నిం తోంది.



ఆ అందం ఇంతై అంతై ఈ ప్రపంచాన్నే ఆక్రమించినట్లుగా అనిపిస్తోంది.

తను ఇంత పరీక్షగా ఆమె శరీరాకృతిని తిలకిస్తున్న ఓ పరాయి మగాడు చూపులతో తన అందాన్ని తాగేస్తున్నాడన్న సంగతి ఆమెకి తెలీదు.

ఆమె స్విమ్ చేస్తూనే వుంది.

ఆమె నీళ్ళ పైన వెల్లకిలా తేలింది.

సముద్ర గర్భంలోంచి పైకి ఉద్భవిస్తున్న జంట లింగాలా అనిపించేలా ఆమె కుంభాలు అతని కళ్ళని పోగొడుతున్నాయి.

కుచ కుంభాలు అన్న పదాన్ని కవులు ప్రయోగించగా చదివాడు భార్గవ

అసలయిన అర్థం ఇప్పుడు తెలుస్తోందతనికి.

ఆడది కొత్తకాదు తనకి.

కానీ అలాని అందరు ఆడవాళ్ళూ ఒక్కలా వుండరు.

శృంగారంలో ఎవరికి వారిదే ఓ ప్రత్యేకత.

అందంగా వున్నా పళ్ళెత్తుగా వున్న ఆడదాన్ని ముద్దుపెట్టుకోటంలో థ్రిల్ వుండదు. చిన్నినోరు, పల్చని ఎర్రని పెదిమలున్న స్త్రీని ముద్దాడితే హాయిగా వుంటుంది. సన్నగా వున్న స్త్రీ కౌగిలిలో ఇమడదు.

కేవలం పడక సుఖానికే తప్ప....

శిఖరాలు లేని స్త్రీ కరువు ప్రాంతలా తోస్తుంది.

కాస్త బొద్దుగా వుంటే వెచ్చని కౌగిలి మత్తుగా వుంటుంది.

అస్థిపంజరంలాంటి పర్సనాల్టీలు మగవాడిని ఉత్తేజపరచవు. కేవలం మొక్కుబడికి మాత్రమే. అవసరం తీర్చుకోటానికి.... అంతే!

ఎందరో ఆడవాళ్ళతో సంబంధం వుంది భార్గవకి.

కొందరు సున్నితంగా, నాజూగ్గా వ్యవహరిస్తారు శృంగార క్రీడలో. మరికొందరు మొరటుగా ప్రవర్తిస్తారు.

అప్రోచ్ ఎంత నాజూగ్గా, సున్నితంగా వుంటే ఆ ఏకాంత సమయ[...] అంత ఆనందంగా వుంటుంది.

మొరటుతనం జుగుప్సని కలిగిస్తుంది.

ఆడదాన్ని వీణని మీటినట్లు మీటి తనకి కావల్సిన రాగాన్ని పలికిం[...] గల చాతుర్యం, నేర్పు మగాడికి వుంటే....ఆ ఆడది అతనికి జీవితాంత[...] ప్రాణమిస్తుంది.

భార్గవ....సున్నని ఆమె తొడలకేసి చూశాడు.

కళ్ళు మిరుమిట్లు గొలుపుతున్నాయి.

అది కలో, నిజమో తెలీడంలేదు.

అంతా అయోమయం....

తానున్నది భూలోకమా!

స్వర్గమా?!

అంతే కంగారు....ఆ దృశ్యం చెరిగిపోతుందనే భయం.

ఆమె మానవ కాంతో!

గంధర్వ కన్యో ఎరగని మైమరపులో అతనికి సమయం తెలీ[...] లేదు.

ఒక్కసారిగా ఆమె గట్టు మీదకి చేరింది.

అక్కడెవరూ వుండరన్న ధీమాతో కాబోలు ఆమె తన అంద[...] దాచుకునే ప్రయత్నం చేయడంలేదు.

ఓసారి అటూ యిటూ చూసింది.

ఆమె చూపుకి చిక్కితే ఎంత ప్రమాదమో అతనికి తెలుసు.

అందుకే కాస్త పక్కకి నక్కి దాక్కున్నాడు.



ఆమె డ్రెస్ ఛేంజ్ చేసుకొంటోంది.

అబ్బా....ఏమి అందం!

ఆగలేని ఊపొస్తోంది.

తను తనేనా?

ఏమిటా పైత్యం తనకి?

ఇంతవరకూ ఏ ఆడదాన్నీ తను బలవంతం చేయలేదు. బలాత్కారించలేదు.

కానీ చూడగానే అనుభవించాలనే అందాన్నిప్పుడే చూస్తున్నాడు.

ఆ అందాన్ని చౌదరి పొందుతున్నాడంటే జెలసీ కలిగిందతనికి. ఆమె అందానికి భయపడే చౌదరి ఆమె నెక్కడికీ తీసుకెళ్ళట్లేదు సినీ ఫీల్డ్‌లో వున్న హీరోయిన్లు ఆమె కాలిగోటికి పోలరని అతను అనుకొన్నాడు.

ఇంటికొచ్చాడే గానీ—

మనసెక్కడా నిలవట్లేదు భార్గవకి.

తిందామంటే నోటికి పోరట్లేదు....

కంటికి కునుకు రావట్లేదు.

తను చూసిన ఆ మనోహర నగ్నసౌందర్యం అతన్ని ప్రతిక్షణం కలవర పరుస్తోంది.

కన్ను మూసినా....తెరిచినా ఆమె సుందర విగ్రహమే ఎదురుగా కదలాడుతోంది.

స్త్రీని నగ్నంగా చూడ్డం అదే మొదటిసారి కాదతనికి.

కానీ....అంత అందాన్ని చూడ్డం మాత్రం అదే తొలిసారి.

అదే చివరిసారి కూడా అనిపిస్తోంది.

ఆమె అందం....ఆ ఒంటి తళుకు....నునుపు....ఆమె కదలికల్లో ఒలికిన శృంగారం....

ఓ.కే! అద్భుతమైన అనుభవం ఆమెని చూడ్డం....!

ఆమెని తిరిగి ఒక్కసారి చూడాలనే కోరిక అతన్ని కుదిపేస్తోంది.

అవును....ఆమెని చూడాలి....ఆ అందాలరాసిని చేతుల్లోకి తీసుకుని గట్టిగా బంధించాలి....ముద్దాడాలి.

ఆ ఊహతోనే పులకరించిందతని ఒళ్ళు.

జ్వరం వచ్చినవాడిలా వేడిగా కాలిపోతోందతని శరీరం.

తీరని తాపంతో దహించుకుపోతోంది మనసు.

అంతలోనే ఆమె చౌదరి భార్య అన్న విషయం గుర్తొచ్చింది.

అంతే! క్షణాలమీద అతని వేడి దిగజారిపోయింది

పెళ్ళయిన ఓ ఆడదాని గురించి అలా ఆలోచిస్తున్నందుకు తనమీద తనకే చిరాకేసింది. 'అంత చపలత్వం దాగివుంది తనలో' అనిపించిందతనికి. కానీ మనసు ఊగిసలాటలో ఆమె ఆలోచనలు తెగటంలేదు.

కానీ ఆమెని మరోసారి చూడాలన్న వెర్రికోరిక మాత్రం అతన్ని వదల్లేదు.

అవును చూస్తే తప్పేముంది?

రోజూ ఎంతమంది తాజ్‌మహల్‌ని దర్శించట్లేదు? అపూర్వమైన ఆమె అందాన్ని అనుభవించాలన్న కోరికయితే తప్పుకానీ చూసి ఆరాధించడంలో తప్పులేదనిపించింది.

తను తప్పుదారిలో పడుతున్నాననీ అనిపిస్తోంది....

లేదనీ అనిపిస్తోంది.

ఆ ఆలోచనల్తో ఆ రాత్రంతా అతనికి నిద్రేపట్టలేదు.

* * * *

మర్నాడు లేస్తూనే... కాఫీ అయినా తాగకుండా....పబ్లిక్ ఫోన్ దగ్గరికి పరిగెత్తాడు భార్గవ.



చౌదరి నంబరు డయల్ చేశాడు.

అవతలఫోన్ రింగవుతూన్న శబ్దం వినిపిస్తోంది.

అంతకంటే గట్టిగా కొట్టుకుంటోంది భార్గవ గుండె.

ఎవరు తీస్తారు ఫోను?

చౌదరి అయితే తియ్యడు....తియ్యలేడు.

కాలు విరిగి మంచాన పడున్నాడు కనక....

ఏ వంటవాడో....పనిమనిషో వచ్చి తీస్తే ...

ఏం మాట్లాడగలడు? ఏమని అడగ్గలడు?

"ఒకవేళ ఆమే వచ్చి తీస్తే మాత్రం ఏం మాట్లాడగావ్?" అతని మనసు నిలదీస్తోంది.

అతనికేమీ తోచలేదు.

ఫోన్ పెట్టేద్దామా అనిపించింది....పెట్టెయ్యబోతున్నాడు కూడా....

అంతలోనే వినిపించింది 'హలో' అంటూ.

వెయ్యి కోయిలలు ఒక్కసారి కూసినట్టుందా గొంతు.

లక్ష తుమ్మెదలు ఒక్కసారి ఝుమ్మన్నట్టుందా గొంతు.

ఆ గొంతు వింటూంటే అతన్లోని ప్రతీ అణువూ స్తంభించిపోతున్నట్టయ్యింది

ఆమే.... ఆమే.... ఘోష పెట్టిందతని మనసు.

'హలో....'

మళ్ళీ అటువైపునుండి వినిపించింది.

ఫోన్ చేసింది తనే కనక ముందుగా తన వివరాలు చెప్పి మాట్లాడటం మర్యాదని భార్గవకీ తెలుసు.

కానీ మాట రావట్లేదు అతని నోట్లోంచి.

అవతల వ్యక్తి ఫోన్ పెట్టేసినట్టుగా 'క్లిక్'మని చప్పుడయ్యింది.

ఆ చప్పుడుతో అతనిలో తిరిగి చలనం వచ్చింది.

"అయ్యో.... పిచ్చివాడిలా ఎంత మంచి అవకాశాన్ని జారవి
చుకున్నాడు తను?

ఇప్పుడు మళ్ళీ ఫోన్ చేస్తే.... తిరిగి ఆమే ఎత్తుతుందని గ్యార
ఏంటి?" తన్ని తనే నిందించుకున్నాడు భార్గవ.

అయినా ఆశ చావక మళ్ళీ ఫోన్ చేశాడు.... ఆమే ఫోన్ ఎత్తా
వెయ్యి దేవుళ్ళకి మొక్కుకుంటూ.

అతని ప్రార్థన ఫలించినట్టుంది. తిరిగి ఆమె గొంతే వినిపిం
'హలో' అంటూ.

"నేనూ.... నేనూ.... భార్గవని...."

ఆమెకి తనకీ పూర్వ పరిచయం లేదనీ, పేరు చెప్పినంతలో
తనని గుర్తుపట్టలేదనీ ఆ క్షణంలో అతనికి తోచలేదు. ఏదో నోటికొచ్చి
చెప్పేశాడు.

"చెప్పండి.... ఎవరు కావాలి?"

మృదువుగా అడిగిందామె.

"నువ్వెవరో నాకు తెలియదు" అని డైరెక్టుగా చెప్పని
సంస్కారాన్ని మనసులోనే మెచ్చుకున్నాడు భార్గవ.

"చౌదరిగారికెలా వుంది?"

"ఆయన పైనున్నారు. ఎక్స్‌టెన్షన్ ఇమ్మంటారా?" అడిగింది

"వద్దొద్దు! నేనే వచ్చి ఆయన్తో మాట్లాడతా.... ఆయన దొ
రికారో, లేదో అని ఫోన్ చేస్తున్నా."

మధ్యలోనే అడ్డుపడ్డాడు భార్గవ. ఆయనకి ఎక్కడ కనెక్ష
న్తుందో అనే భయంతో.

నిజానికి ఫోన్‌లో చౌదరితో మాట్లాడేంత గొప్పవాడు కాదు
ఆమెతో మాట్లాడాలనే పిచ్చి కోరికతో ఆ సాహసం చేశాడే
నిజంగా ఆయన్తో ఫోన్లో మాట్లాడాలని మాత్రం కాదుకదా!



"ఆయనకి ఏక్సిడెంటయ్యింది. ఎక్కడికి వెళ్ళలేరు మరో రెండు
మూడు నెల్లదాకా! ఇంటి దగ్గరే దొరుకుతారు మీకు"

సున్నితంగా చెప్పి ఫోన్ పెట్టేసిందామె.

ఆమెతో మాట్లాడుతూ తడబాటులో అలా అడిగాడే తప్ప అతని
ఏక్సిడెంటు విషయం తనకి తెలియనిదా?

అయితే ఆ విషయం తనకి తెలుసనే విషయం ఆమెకి తెలియక
పోవడం మాత్రం తన అదృష్టం.

ఆమెకి తెలిసి వుంటే తన తడబాటుకి ఎంత వేళాకోళం చేసి
ఉండేదో.

కంపిస్తున్న చేత్తో రిసీవర్ని ముద్దు పెట్టుకొని పెట్టేశాడు భార్గవ.

ఫారెన్ విస్కీ తాగినంత మత్తు కలిగించిందామె స్వరం అతనికి.

ఆమె ఎవరయి ఉంటుంది?

ఒక్కక్షణంపాటు మళ్ళీ ఆలోచించాడు.

ఆమె వాడిన 'ఆయన' అన్న పదం మనసులో మెదిలింది.

అవును.... ఆమె తప్పకుండా చౌదరి భార్యే!

వేరే ఏ రకపు చుట్టమయినా, ఆ బంధుత్వం వరసలోనే చెప్పి
వుండేది తప్ప 'ఆయన' అనేది కాదు.

అయినా ఆమె ఎవరయితేనేం? ఓ అద్భుత సౌందర్యరాశి, ఓ
శృంగార దేవత.

ఆమెని మరోసారి చూడాలి.... ఆమెతో మాట్లాడాలన్న పిచ్చి కోరి
కతో చౌదరి ఇంటికి బయల్దేరాడు భార్గవ.

* * * * *

"రావోయ్ రా! ఏంటీ పొద్దున్నే వచ్చావ్?"

భార్గవని చూస్తూనే అన్నాడు చౌదరి.

అప్పటిక్కానీ అర్థం కాలేదు భార్గవకి తన రాక ఎంత అర్థంలేని పనో....

"నిన్న మీతో చెప్పకుండానే వెళ్ళిపోయాను. ఇల్లంతా చూసిం తర్వాత మీ దగ్గరకొచ్చి సెలవు తీసుకుని వెళదామనుకున్నాను. కానీ మీ ఇల్లు చూస్తుంటే మతిపోయినట్టయ్యింది సార్! చెప్పి వెళ్ళాలనే కనీస మర్యాదని కూడా మర్చిపోయాను."

అంత తొందరగా తిరిగి వచ్చినందుకు సంజాయిషీ ఇచ్చుకుంటూ అన్నాడు భార్గవ.

"ఫర్వాలేదు లేవోయ్! మా ఇల్లు చూసిన వాళ్ళంతా ఇలాగే తడబడి పోతూంటారు... అది మామూలేలే నాకు"

గర్వంగా నవ్వుతూ అన్నాడు చౌదరి.

"అవున్సార్.... ఇల్లు భలే ఉంది సార్."

"కానీ నేను మతి పోగొట్టుకున్నది నీ ఇల్లు చూసి కాదు.... నీ పెళ్ళాన్ని చూసి.... ఆ విషయం తెలిస్తే ముందు నీ గుండె ఆగిపోతుంది"

మనసులోనే అనుకున్నాడు భార్గవ.

"కూర్చోవోయ్.... టిఫిన్ తిన్నావా లేదా? ఈ పూట నాతో పాట మా టిఫిన్ రుచి చూడు."

చేతి దగ్గరే ఉన్న బెల్ నొక్కాడు చౌదరి.

ఆ బెల్ అర్థం తెలుసుకున్నట్టే మరో రెండు నిమిషాల్లో బట్లర్ చక్రాలబండి తోసుకుంటూ గదిలోకొచ్చాడు. ఆ గదంతా టిఫిన్ తాలూక సువాసన అలుముకుంది.

అంత పెద్ద వ్యక్తితో కలిసి టిఫిన్ చెయ్యడం అంటే కొద్దిగా భయ పడ్డాడు భార్గవ.



"వద్దు సార్! నేనిప్పుడే తిని వచ్చాను" మొహమాటపడ్డాడు.

"అంటే ఇంత పొద్దున్నే బ్రహ్మచారివి, హోటల్‌కెళ్ళి బ్రేక్‌ఫాస్టు చేసేసి వచ్చావని నమ్మమంటావు? అయినా 'ఫాస్ట్' ఓసారి 'బ్రేక్' చేసేక ఎన్నిసార్లయినా చెయ్యొచ్చులే.... రా....రా.... తొందరగా.... నాకయితే చాలా ఆకలిగా వుంది"

కంగారుపెట్టాడు చౌదరి.

'బ్రేక్‌ఫాస్ట్' అన్న మాటని విరిచి కాదు మాటలుగా సందర్భానికి తగ్గట్టు వాడిన చౌదరి చమత్కారానికి మనసులోనే మెచ్చుకుంటూ కుర్చీలో నుంచి లేచి టిఫిన్ చెయ్యడానికొచ్చాడు భార్గవ.

మరీ బెట్టు చెయ్యడం ఉచితంగా అనిపించలేదతనికి.

అయినా అక్కడ ఎంత ఎక్కువసేపుంటే ఆ స్వప్నసుందరి సాక్షాత్కరించే అవకాశం అంత ఎక్కువ అని మనసులో ఓ మూల ఎంతో నమ్మకంగా అనిపిస్తోందతనికి.

చౌదరికి బట్లర్ స్పూన్‌తో తినిపించడం మొదలెట్టాడు.

"చూడు భార్గవా! ఏ అవకరమూ లేకుండా పుట్టానని గర్వపడేవాడిని అప్పుడప్పుడు. ఆ గర్వం అణచడానికేనేమో ఈ కుంటితనం కలిగించాడు దేవుడు."

చౌదరి మాటల్లో ఓ విధమైన నిరాశ!

ఎప్పుడూ అందర్నీ అజ్ఞాపిస్తూ మాట్లాడే చౌదరి అలా నిరాశగా మాట్లాడుతూంటే భార్గవకే అదోలా అనిపించింది.

గుండెలదిరేలా గర్జించే సింహం ఎలుకపిల్లలా కిచకిచలాడుతున్నట్టు అనిపించింది.

"ఎందుకు సార్, అలా అనుకుంటారు? ఇది ఏదో తాత్కాలికంగా ఏర్పడ్డ ఇబ్బంది తప్ప శాశ్వతం కాదుకదా?"

ఓదార్పుగా అన్నాడు భార్గవ.

"ఏం చెప్పగలం చెప్పు? ఈ రెండు నెలలూ గడిచాక కూడా బోన్ అతుక్కోలేదనుకో.... తాత్కాలికం అనుకుంటూన్న ఈ అంగవైకల్యం శాశ్వతం అయిపోతుందిగా!"

ఇంకా ఎక్కువగా ఉంది నిరాశ ఆ మాటల్లో.

ఆ మాటల్లో అసత్యం లేదు.... కానీ చౌదరిని గలగలా పారే సెల యేటిలాటి చౌదరిని అలా కుంటితనంతో మంచం వదల్లేని స్థితిలో ఊహిం చుకోలేకపోతున్నాడు భార్గవ.

ఇంత మంచివాడి కలాంటి కష్టాన్ని కలిగించిన దేవుణ్ని మనసులో నిందించాడు కూడా.

"అలా అశుభం పలక్కండి సార్.... గుండె తీసి గుండె అమ ర్చుస్తున్నారు డాక్టర్లు.... ఈ కాస్త విరిగిన కాలుని అతికించలేరా? మీ మన సులో భయమే తప్ప అది జరిగేది కాదు సార్...."

చౌదరి కేసి చూస్తూ ఆప్యాయంగా అన్నాడు భార్గవ.

అతని మాటల్తో చౌదరి మొహంలోకి తిరిగి పాత కళ వచ్చింది.

"ఓ.కే....ఓ.కే....! నీలాంటి శ్రేయోభిలాషుల అభిమానమే నాకు శ్రీరామరక్ష! చూస్తూండు. కాలి కట్లూడదీయగానే ఎంతబాగా గెంతు లేస్తానో...."

చిన్నపిల్లాడిలా అమాయకంగా నవ్వుతూ అన్నాడు చౌదరి.

తను అంత ఫ్రీగా నవ్వలేకపోతున్నాడు భార్గవ.

తనతో అంత నిష్కల్మషంగా ఉంటూన్న చౌదరి భార్య పట్ల తన మనసులోని అవాంఛనీయ అభిమానానికి సిగ్గుతో ముడుచుకు పోతు న్నాడు భార్గవ.

అతని పరాకుని మరోలా అర్థం చేసుకున్నట్లున్నాడు చౌదరి.

"ఏం భార్గవా! నీకూ వంట్లో నలతగా ఉందా?"

అభిమానంగా అడిగాడు.



"అబ్బే....అదేంలేదు సార్! ఏవో ఆలోచనల్తో రాత్రి నిద్ర పట్టక.... కాస్త తలనొప్పిగా ఉందంతే....!"

తడబడుతూ జవాబిచ్చాడు భార్గవ.

"పైత్యానికి! ఇలాంటి వికారాలకి మహామంచి మందులే అల్లం పెస రట్టు....అదిగో....ఆ ఉప్మాతో కలిపి లాగించెయ్....."

"అనారోగ్యం కలిగించినా తినెయ్యాలనిపిస్తోంది సార్ ఈ పెసరట్లు ఘుమఘుమ! ఆరోగ్యానికి మంచిదని మీరు హామీ ఇస్తే ఇంక వేరే చెప్పాలా....వరసపెట్టి లాగించెయ్యనూ....!"

హుషారుగా అంటూ టిఫిన్ మీద దాడి చేశాడు భార్గవ.

తినడం పూర్తి చేశాడు భార్గవ.

"థ్యాంక్స్ సర్! లంచ్ లాంటి బ్రేక్‌ఫాస్ట్ ఇచ్చారు. ఇంత తృప్తిగా తిని ఎన్నేళ్ళయిందో...."

అభిమానంగా చౌదరివంక చూస్తూ అన్నాడు భార్గవ.

వయసులో ఉండగా నేనూ నీలాగే తినేవాడిని. అప్పట్లో తినడానికి జేబులో డబ్బులుండేవి కావు. ఇప్పుడు జేబులో దండిగా ఉన్నా....తిని అరిగించుకునే సత్తాలేదు. వయసుతో పాటు జబ్బులూ పెరుగుతాయనే వారు ఇదివరలో....కానీ డబ్బుతో పాటే జబ్బులూ పెరుగుతాయనిపిస్తోంది.

చౌదరి మాటల్లో ఓ లాంటి నిరాశ....ఓ లాంటి వైరాగ్యం.... వయసొస్తే తనూ అలాగే తయారవుతాడా? "ఒళ్ళు జల్లుమంది" ఆ ఆలో చనతో.

అలాంటి డిప్రెషను పెంచుకోకూడదని తన్ని తానే సంభాళించు కున్నాడు భార్గవ.

కడుపుతో పాటు మనసూ బరువుగా ఉంది భార్గవకి.

అక్కడకి తను తిండి కోసం రాలేదు.

ఆ సుందరిని....ఆ అతిలోక సుందరిని....ఒక్కసారి....మరో సారి తనివితీరా, కళ్లారా చూసి తరించాలని వచ్చాడు.

కానీ....ఆ అవకాశమే రాలేదు.

ఆమెని తనింక చూడలేడా?

ఆ అద్భుత సౌందర్యరాశి ఇంక తన కలల్లోనే మిగిలిపోతుం

బరువుగా నిట్టూర్చాడు భార్గవ. ఎక్కడలేని నీరసం వచ్చేసిందత అప్పటికే తనొచ్చి చాలా సేపయింది.

ఇంకా ఏ కారణంతో తనక్కడ ఉండగలడు?

నిరాశగా లేచి నిలబడ్డాడు భార్గవ.

"ఇంక వస్తాన్ సార్...."

సాధ్యమైనంత మామూలుగా ఉండడానికి ప్రయత్నిస్తూ అన్నా

"మంచిది! అప్పుడప్పుడూ వస్తూండు, నేను లేచొచ్చి మిమ్మ చూడలేను కనక మీరే వచ్చి నా కళ్ళ పడుతూండాలి...."

బలవంతాన నవ్వుతూ అన్నాడు చౌదరి.

నిజానికి అక్కడే ఉండిపొమ్మంటే సంతోషంగా ఉండిపోయేవా భార్గవ.

"రోగిపాలే కోరాడు....వైద్యుడూ పాలే ఇమ్మన్నాడు"

అన్న సామెతలా ఏ వంకన అక్కడికి రాగలనా అని చూస్తు భార్గవకి ఆ ఆహ్వానం ఎంతో ఆనందకరంగా ఉంది.

కానీ....కానీ ఈసారి తనరాక వృథా అయిపోయిందన్నదే అ దిగులయిపోయింది.

"మీరంతగా చెప్పాలా సార్? వీలయినంత తరచుగానే వస్తు టాను...." రానని మొరాయిస్తున్నా కాళ్లని బలవంతాన అదుపు తెచ్చుకుంటూ నెమ్మదిగా గది బయటికి నడవసాగాడు భార్గవ.



"అన్నట్టూ కింద మా కిచెన్‌లోకి వెళ్ళి మా వంటతను సోమయ్యని ఓసారి రమ్మని చెప్తావా భార్గవా! ఇందాక డాక్టరుగారు పత్యంగా తిన మన్నారు వాడికా విషయం చెప్పకపోతే అన్నీ మసాలా కూరలే చేస్తాడు" అన్నాడు చౌదరి.

"అలాగే సార్....అతన్ని ఇప్పుడే మీ దగ్గరికి పంపిస్తాను" బయటకి వెళ్ళిపోయాడు భార్గవ.

* * * * *

మెట్లు దిగి క్రిందికొచ్చాడు భార్గవ.

వంటగది ఎక్కడుందో తెలియదతనికి.

కానీ లోపల ఓ మూలగా ఉంటుందనే ఊహతో ఒక్కో గది నెమ్మదిగా దాటుకుంటూ లోపలికెళ్తున్నాడు.

అన్ని గదులకీ పరదాలు వేలాడుతున్నాయి.

అంతలోనే సడన్‌గా కెవ్వుమన్న కేక వినిపించింది. ఆ కేక వింటూనే తుళ్లిపడ్డాడు భార్గవ.

ఆ గొంతు....ఆ గొంతు....తనకు ఫోన్‌లో వినబడ్డ ఆమె గొంతులా అనిపించింది.

అవును ...ఆమే....! ఆమే!

భార్గవలోని ప్రతీ అణువూ గొంతెత్తి అరిచింది.

చటుక్కున ఆ కేక వినబడ్డ వైపు పరిగెత్తబోయాడు భార్గవ.

అంతలోనే ఆ గదిలోంచి మరోసారి ఆ కేక వినిపించింది మరు క్షణం ఓ యువతి ఆ గదిలోంచి రివ్వున బయటికి దూసుకొచ్చింది. భయంతో వణికిపోతోందామె శరీరం భార్గవని ఢీకొట్టి ఆగిపోయిందామె!

ఏ వ్యక్తి కోసమయితే ఇంత దూరం వచ్చాడో....ఎవర్ని చూడా లని ఇంతగా పరితపించాడో ఆమె అలా నిస్సహాయంగా అనిపిస్తూంటే ఆగలేకపోయాడు భార్గవ.

ఆమె కనిపించిందన్న ఆనందమో... ఆమె ఎందుకో భయపడుతోందన్న ఆరాటమో....కలవరపడుతున్న తన స్వప్నసుందరికి సాంత్వన పడాలన్న ఆరాటమో....ఏదీ సరిగ్గా తెలియని స్థితిలో ఆమెని దగ్గరగా తీసుకున్నాడు భార్గవ.

రావిగుడుటాకులా ఒణికిపోతోందామె.

ఒళ్లంతా చెమటతో తడిసిపోయింది.

హిస్టీరిక్‌గా అరుస్తూనే ఉందామె.

అనుకోకుండా భార్గవ కౌగిలి బిగిసింది.

ఆమెకి అండగా తనున్నాడన్న విషయాన్ని ఆమెకెలా చెప్పాలో అర్థం కావట్లేదతనికి.

ఆమెకే ఆపదా రాకుండా రక్షించుకోడానికి ఆమెని తన గుండెల్లో దాచేసుకోవడమే మార్గం అన్నట్లుగా ఆమెని మరింతగా హత్తుకున్నాడు.

తనో పరాయి మనిషి చేతుల్లో ఉన్నానన్న విషయం ఆమె గ్రహించినట్లుగా లేదు.

ప్రవాహంలో కొట్టుకుపోతున్న వ్యక్తి చేతికందిన చెట్టు మానుని బలంగా పట్టుకున్నట్టుగా ఆమె చేతులతన్ని చుట్టూ అల్లుకుపోయాయి.

ఆమె ఎంతగా భయపడుతోందో అర్థమయిందతనికి.

"ఏమయ్యింది? ఎందుకలా అరుస్తున్నావ్?"

లాలనగా భుజం తడుతూ అడిగాడతను.

"పాము ...పాము...."

కంపిస్తున్న గొంతుతో చిన్నగా అందామె.

తనున్న పరిస్థితి ఏమిటో ఆమెకి తెలిసినట్టు లేదు.

తనకి దొరికిన ఆధారాన్ని వదలలేనట్టుగా ఆమె మరింత దగ్గరగా జరిగిందతనికి



తన కౌగిట్లో నలుగుతున్న ఆమె మృదువయిన శరీరం అతనికి ఓ అద్భుతమయిన అనుభూతి నిస్తోంది.

ఆమె మరింతగా అతన్ని చుట్టుకుపోవడంతో....ఆమె గుండెలతన్ని బలంగా పొడుస్తున్నాయి.

ఆమె శరీరం మీదనుండి లేచి వస్తూన్న పరిమళం అతన్ని పరవశుడిని చేసింది.

అప్రయత్నంగా ఆమెని బలంగా హత్తుకున్నాడు.

ఓ చేత్తో ఆమె వెన్ను నిమురుతూ, మరో చేత్తో ఆమె జుట్టు సవరించాడు.

ఆమెని అలా ఎత్తుకుని ఎక్కడో ఏకాంతానికి పారిపోవాలనిపించిందతనికి

ఈ ప్రపంచమంతా శూన్యమై పోయి....ఆ మహా శూన్యంలో తనూ... ఆమే మాత్రమే సజీవంగా ఉన్నట్లనిపించింది.

అన్నిటినీ....అందర్నీ మరిచిపోయాడు భార్గవ.

"పాము ...పాము ..."

ఆమె రిపీట్ చేసిన ఆ మాటతో ఈ లోకంలోకొచ్చి పడ్డాడు.

భయంతో ఓ ఆడది తనను వాటేసుకుంటే....తన ఊహలు అలా తప్పుదారిన పరిగెట్టినందుకు తనను తానే తిట్టుకున్నాడు.

వలపుతోనో, మోహంతోనో ఆమె అలా తనను పెనవేసుకుంటే తనలా ఉద్రేకపడితే అది వేరే విషయం.

కానీ ఇప్పుడామె ఉన్న స్థితి వేరు....

పాపం! పాముని చూసి భయపడినట్టుంది.

ఆ భయంతో తనేం చేస్తున్నదీ తనకే తెలియని స్థితిలో ఉంది.

ఆమె చర్యలకు తను వేరే అర్థం తీసుకుంటే అది మానవత్వం అనిపించుకోదు.

చేతుల్లో ఉన్న ఆమెను కొద్దిగా దూరంగా తోశాడు భార్గవ.

"చూడండి! మీకేం భయం లేదు. నేనున్నాను...."

ఆమెను కుదుపుతూ అన్నాడు అతను.

అంత సమీపంలో ఓ కొత్త గొంతు చెవినపడేసరికి ఆమె లోకంలో కొచ్చిపడినట్టుంది.

నెమ్మదిగా కళ్ళు తెరిచింది.

తనెక్కడుందో తెలుసుకునేసరికి ఆమెకి ఓ రెండు క్షణాలు పట్టి

వెంటనే అతని నుండి దూరం అయిందామె.

చెదిరిన పైట సవరించుకుంటూ "పాము....నా గదిలో....మం కింద...." ముక్కలు ముక్కలుగా విషయాన్ని వివరించింది.

వెంటనే ఆమె గదిలోకి పరిగెట్టాడు భార్గవ. అతన్ననుసరిం దామె.

మంచం కిందనా, గదిలో నాలుగు మూలలా చూశాడు. ఎక్క పాము కాదుగదా....తాడు కూడా లేదు.

"పామా....ఎక్కడా లేదే...." వెనక్కి తిరిగి ఆమె వేపు చూ అన్నాడతను.

"లేదు....ఇక్కడే మంచం కింద చూశాన్నేను. నా క చూశాను. ఇంత పొడవుగా వుంది. నన్ను మీదపడి కాటేసిందనే అ న్నాను."

భయంగా అందామె.

మళ్ళీ ఓసారి గదంతా పరీక్షించాడతను.

"చూడండి! మీరేదో పరాగ్గా ఉండి భయపడినట్టున్నారు" అ ధైర్యం చెప్తున్నట్టుగా అన్నాడు.



"లేదు! నా కళ్ళతో చూశాన్నేను. అందులో సందేహం లేదు...." నొక్కిపలికిందామె. ఆమె గొంతులో వణుకు....

"ఓ.కే! మీరు చూసే ఉండొచ్చు. కానీ ఇప్పుడీ గదిలో మాత్రం మీరూ, నేనూ తప్ప వేరే ఏ ప్రాణీ...చివరికి ఈగా, దోమా కూడా లేదు. పాము బయటికి పారిపోయి వుంటుంది. మీరింక ఆ విషయాన్ని మర్చిపోయి ధైర్యంగా వుండండి" చెప్పాడు భార్గవ.

అప్పటికామె పూర్తి స్పృహలో కొచ్చినట్టుంది.

"థేంక్యూ! థేంక్యూ వెరీమచ్! మీకు చాలా శ్రమ ఇచ్చాను" మర్యాదగా అందామె.

ఆ మాట లంటూన్నప్పుడు ఆమె మొహంలో ప్రతిఫలించిన ఒంటరితనం అతని గుండెని పిండిచేసింది.

పండు వెన్నెలలో కురిపిస్తూన్న పున్నమి చంద్రుడు మబ్బుల చాటుకి వెళ్ళిపోయినట్టయ్యింది.

ఏమిటిది?

ఎందుకీ దిగులామెకి?

ఎందుకీ ఒంటరితనమామెకి?

కుబేరుడిలాంటి భర్త....కేవలం డబ్బు మాత్రమే కాదు, కళా హృదయం ఉన్న వ్యక్తి కూడా చౌదరి.

వాళ్ళిద్దరికీ మధ్య ఉన్న వయోభేదం ఎక్కువే కావచ్చు—కానీ అసలు వయసుకంటే చాలా చిన్నవాడిగా, పుష్టిగా, దారుఢ్యంగా వుంటాడు చౌదరి.

అందువల్ల ఇద్దరి మధ్యా పెద్ద తేడా కనిపించదు.

ఆమె ఎందుకో బాధపడుతోందన్న విషయం అతనికి బాధని, సంతోషాన్నీ కూడా కలిగించింది ఒకే సమయంలో.

తను అభిమానిస్తూన్న వ్యక్తి బాధపడుతోందన్న విషయం అత
బాధ కలిగిస్తూంటే, పరాయివాడి ఇల్లాలయిన ఓ ఆడది తన భర్త
హాయిగా గడపనందువల్లనేనేమో బాధపడుతోందనీ, ఆ అవకాశాన్ని సద్వి
యోగం చేసుకుంటే ఆమెని తనదానిగా మార్చుకోవడం ఏమంత కష్ట
కాదనీ అతనికి సంతోషం కలిగింది.

నిజానికి ఓ సంసారం కూలగొట్టి, ఓ ఇల్లాలిని తనవేపు లాక్కో
లనుకునే నీచత్వం లేదు అతనిలో.

కానీ....కానీ....ఆమెపట్ల అతనికేర్పడ్డ ఆకర్షణ, అనురాగం అ
నికి తెలియకుండానే అతనిలో ఆ మార్పుని తెచ్చింది.

"నేనేదో మీకు సాయపడ్డట్టుగా మీరు నాకు థాంక్స్ చెప్పనక
ర్లేదు. మీకు నిజంగా సాయపడగలిగితే, అదీ నా అదృష్టంగా భావిస్తాను

సిన్సియర్‌గా అన్నాడు భార్గవ.

అలా అంటూనే ఓసారి తన చేతుల వంక చూసుకున్నాడు.

ఆ చేతుల్లో ఇంకా ఆమె ఒదిగి ఉన్నట్టే అనిపిస్తోంది.

ఆమె నుండి తనలోకి పాకిన ఆ కరెంటు ఇంకా మత్తుగానే ఉం

మనసులో ఆ అనుభవం తియ్యగా మెదుల్తూంటే....

మాటల్లో మర్యాద కురిపించడం అతనికి కొస్త కష్టంగానే ఉం

మరొక్కసారి ఆమెను చేతుల్లోకి తీసుకోవాలని ఉంది.

కానీ తనలా చేస్తే ఆమె తనని నౌఖర్లతో బయటికి గెంటించ
ఆశ్చర్యపడనక్కర్లేదు.

"మీరా క్షణంలో నాకు తోడుగా లేకపోతే భయంతో గుండాగి చ
దాన్ని నేను. ఇంతకీ మీరెవరు? మిమ్మల్నిదివరకెప్పుడూ చూడలేదు..
అసలు మీరిక్కడెందుకున్నారు?" ప్రశ్నలవర్షం కురిపించిందామె ఒక
పారిగా.



"నా పేరు భార్గవ. ఉన్న పేషాలేపే సటుడ్ని నేను. అంతకంటేకూడా డూప్ భార్గవగానే ఈ ఫీల్డులో అందరికీ తెలుసు నేను చౌదరిగారిని చూసిపోదామని వచ్చాను. మొన్న యాక్సిడెంట్ సమయంలో నేనూ వారితోనే ఉన్నానులెండి! పోతే నేనిక్కడికి రావటానిక్కారణం అంటారా, చౌదరిగారి వంటమనిషి సోమయ్యనోసారి రమ్మని చెప్పమన్నారు. అతన్ని పిలవటం కోసం ఇటొచ్చాను"

చెప్పాడు భార్గవ.

"ఓ! అయితే మీరు ఆయన కోసం వచ్చారా?"

ఎందుకో ఆమె ముఖం నల్లబడినట్టనిపించింది భార్గవకి.

"లేదు....నేను చౌదరిగారి కోసం రాలేదు నీ కోసమే....నిన్ను చూడాలనే వచ్చాను" అని చెప్పాలనిపించిందతనికి.

కానీ....మనిషి నేర్చుకున్న నాగరికత మనసులోని భావాల్ని యథాతథంగా బయటికి రానివ్వదు.

"చూడండి....కొన్ని పరిచయాలు చాలా విచిత్రంగా జరుగుతాయి. నేను చౌదరిగారి పరిచయస్థుడిగా ఈ ఇంట్లో అడుగుపెట్టాను. కానీ అనుకోకుండా మిమ్మల్ని చూశాను. ఇలా మీతో పరిచయం జరగాలనే దేవుడు నాకు చౌదరిగారు తెలిసేలా చేశాడేమో."

"నిజమేనేమో! ఆయన కోసం ఎందరో వస్తారు. అంతా అక్కడినుంచి అటే వెళ్ళిపోతారు. మీరిలా లోపలికి రావటం నాకు సాయంగా నిలబడ్డానికేనేమో!"

ఆమె ఉపయోగించిన 'సాయంగా నిలబడ్డం' అన్న పదం కేవలం అప్పుడు జరిగిన సంఘటనని ఉద్దేశ్యంలో పెట్టుకుని అన్నట్టనిపించలేదు భార్గవకి. ఆమె అంతరంగంలోని భావాలని చదవడానికి ప్రయత్నం చేయసాగాడు.

"మీరేదో నిరాశతో మాట్లాడుతున్నట్టున్నారు. ఈ కాస్త పరిచయం తోనే హద్దులు దాటుతున్నాననుకోకపోతే, నన్ను ఆప్తుడిగా భావించి, ఇబ్బంది చెప్పండి" ఆమె కళ్ళల్లోకి ఆరాధనగా చూస్తూ అన్నా భార్గవ

అంతలోనే ఆమె ముఖకవళికలు మారిపోయాయి.

"భలేవారే! ఇబ్బందేముంటుంది చెప్పండి. ప్రఖ్యాత ఫిలిం ప్రొడ్యూసర్, చౌదరిగారు ఏరి కోరి వరించిన నాకు నేలమీద కాళ్ళుంచి నడవాల్సి అవసరంలేదు. కావాలనుకుంటే వంద రూపాయల నోట్లమీద నడవగల నేను. అలాంటి నాకు ఇబ్బందులేం వుంటాయి....?" పడిపడీ నవ్వింది ఆమె.

కానీ....ఆ నవ్వు మనస్ఫూర్తిగా నవ్వినట్టు లేదు.

తెచ్చిపెట్టుకున్నట్టుంది. మొహానికి అతికించుకున్నట్టుంది.

ఆమె పెదాలు నవ్వుతున్నా, కళ్ళు నవ్వట్లేదని అర్థమవుతో ఉంది భార్గవకి.

పోనీ! ఆమెతో ఎలాగయినా తను మాట్లాడుతూ గడిపితే చాలు.. ఆమె మనసువిప్పి తనతో ఏమీ చెప్పకపోయినాసరే....ఆమె మొహ చూస్తూ జీవితమంతా గడిపెయ్యగలననిపించింది.

"మేడమ్! ఇంతకీ మీ పేరు చెప్పనేలేదు...." నానుస్తూ అన్నా భార్గవ.

"ఓ! సారీ! మర్చిపోయాను. ముందుగా పేరుచెప్పి పరిచయం చే కోవాలన్న ప్రాథమిక మర్యాదని మర్చిపోయాను. నాపేరు లైలా... మి లైలా చౌదరి" దర్పంగా అందామె.

"లైలా...."

అనుకోకుండా ఆ పేరు రిపీట్ చేశాడతను.



"ఏం, ఆశ్చర్యంగా ఉందా? మాదీ ప్రాంతం కాదు. కలకత్తా అవతల ఉండేవాళ్ళం. మా నాన్నగారికి 'లైలా మజ్నూ'ల కథ చాలా ఇష్టం. అందుకే నాకా పేరు పెట్టారు. చౌదరిగారోసారి వ్యాపారరీత్యా అక్కడికి వచ్చినప్పుడు నన్ను చూసి వెంటనే పెళ్ళి చేసుకున్నారు"

చౌదరిలాంటి ధనికుడిని క్షణాలమీద వశం చేసుకోగలిగిన తన సౌందర్యానికి ఆమె అతిశయ పడటంలో తప్పదనిపించింది భార్గవకి.

సృష్టికర్త బ్రహ్మ కూడా కళ్ళప్పగించి చూసే అందం ఆమెది....

అందాన్ని మించిన హొయలు....వయ్యారం....

బంగారానికి తావి అబ్బినట్లుగా కోయిల కంఠం.

"అన్నట్టు భార్గవగారూ! మిమ్మల్నో స్నేహితుడిగా భావించమన్నారు కదూ! అయితే నాకో సాయం చేయగలరా?"

"అదో అదృష్టంగా అనుకుంటాను. చెప్పండి. ఏం చెయ్యను?" వెంటనే ఆత్రుతగా అడిగాడు భార్గవ.

"మరేమీ కాదు-ఇంట్లో ఒంటరిగా వుంటే ఏమీ తోచట్లేదు. సాయంత్రం అలా బయటికి వెళ్ళాలనుంది. మీరు కాస్త కంపెనీ ఇవ్వాలి" అంది ఆమె.

పైనుంచి ఇంద్రుడే దిగొచ్చి "ఈ కాస్త అమృతం తాగిపెట్టవూ" అని బతిమిలాడుతున్నట్టనిపించింది భార్గవకి.

"అంతకంటేనా మేడమ్! చెప్పండి ఎన్నింటికి రమ్మంటారు?" తొందరగా అడిగాడు భార్గవ.

"మీరిక్కడికి రావద్దు. ఇందిరా పార్కు దగ్గర వెయిట్ చేయండి. ఐదు గంటలకల్లా వస్తాను...." చిన్నగా నవ్వుతూ అందామె.

ముత్యాల్లాంటి పలువరస తళుక్కుమంటూంటే అలా చూస్తూ ఉండిపోవాలనిపించింది భార్గవకి.

అంతలోనే చటుక్కున గుర్తొచ్చిందతనికి—చౌదరి తనని లోప కెందుకు పంపించాడో.

“అయ్యో....మర్చేపోయాను....సోమయ్య కోసం చూస్తున్నా దేమ చౌదరిగారు” కంగారుగా అన్నాడు.

“అదంతా నేను చూసుకుంటానులెండి. ఆ సోమయ్యకి బ్రహ్మ చెముడు. చూశారుగా నా అరుపులు కూడా వాడి చెవిదాకా పోలేదు. వాడిక మయ్యేట్టు మీరు చెప్పలేరు. నేను చెప్పి పంపిస్తానులెండి”

ఆ మాటల్లో లీలగా ధ్వనించిందతనికి, ఇంక తన్ను వెళ్ళిపొమ్మన్న భావం....

“సాయంత్రం ఐదింటికి మీ కోసం ఇందిరా పార్కు దగ్గర ఎదుర చూస్తూంటా”

ఆమెకి చెప్పి వెళ్ళిపోయాడు భార్గవ.

అతను వెళ్ళిపోగానే లైలా వంటగదివేపు నడిచింది సోమయ్య కోసం.

* * * *

సాయంత్రం నాలుగు గంటలకే ఇందిరా పార్కు దగ్గరికి చేరుకున్నాడు భార్గవ.

లైలా చెప్పిన టైము అయిదయినా ఆమె కోసం కళ్ళు కాయలు కాచేలా ఎదురుచూడటం మొదలుపెట్టాడు.

ఏ కారులో వస్తుందామె? చౌదరిగారికి మూడో, నాలుగో కార్లున్నట్టున్నాయి.

ఆమె ఎందులో వస్తుందో ఉదయమే అడిగి తెలుసుకోనందుకు బాధ పడ్డాడు భార్గవ.

ఆమె వచ్చే కారు ఏదో తెలుసుంటే అంత దూరంలో వుండగానే ఆమె రాకని తెలుసుకోగలిగేవాడుకదా అనిపించింది.



సరిగ్గా అయిదయ్యింది.

వచ్చేపోయే కార్ల వంక ఆత్రుతగా చూస్తున్న భార్గవ దృష్టి తనకు కొంత దూరంలో ఆగిన ఆటోవంక పోలేదు.

ఆటోలోంచి వయ్యారంగా దిగింది లైలా.

అక్కడంతా వ్యాపించిన పరిమళం అతన్నామె వేపుకి తిప్పింది.

ఎర్ర చీరలో కొట్టొచ్చినట్టు కనబడుతోందామె.

ఆమె ఆటోలో వచ్చినందుకు ఆశ్చర్యపోతూనే ఆ ఆటోవేపు చరచరా నడిచాడు భార్గవ.

“వచ్చారా, మీ కోసమే ఎదురుచూస్తున్నాను” జేబులోకి చెయ్యి పోనిచ్చాడు భార్గవ.

“నో ఫార్మాలిటీస్! నా దగ్గర ఛేంజి ఉంది. నన్ను ఇవ్వనీయండి” ఆటో అతని చేతిలో డబ్బుంచుతూ అంది లైలా.

పార్కులో ఓ మూలకి నడిచారిద్దరూ.

అంతగా జనం లేనిచోటు చూసుకుని ఓ మూలగా కూర్చున్నారు.

“తిరుపతి కొండమీద లైన్లో గంటల తరబడి పడిగాపులుపడి తీరా దేవుడిని దర్శించుకునే సమయం వచ్చేసరికి కళ్ళు మూసుకుని ప్రార్థించుకోవటంలో మునిగిపోతాం. అదంతా అయి కళ్ళు విప్పి ఓసారి దేవుడిని కళ్ళారా చూసి ఆ రూపాన్ని మనసులో నింపుకోవాలనుకునే సరికి ‘కదులు, కదులు’ అంటూ నెట్టేస్తారు అలయ నిర్వాహకులు....సరిగ్గా అలాగే అయ్యింది నా పని కూడా.”

భార్గవ మాటలు అర్థంకాలేదు లైలాకి.

“అంటే....?”

ప్రశ్నించిందామె.

"ఏముందీ....నాలుగింటికల్లా వచ్చి మీ కోసం చూస్తూ ఉండిపో యాను. తీరా మీరొచ్చేసరికి గమనించనే లేకపోయాను మీరలా ఆటోలో వస్తారనుకోలేదు నేను ఏమయ్యింది. మీ కార్లన్నీ రిపేర్లో వున్నాయా? మిమ్మల్ని ఆటోలో వెళ్ళనిచ్చారా చౌదరిగారు?"

కుతూహలంగా అడుగుతున్న భార్గవని చూసి ఫకాలుమంది లైలా.

"ఎందుకలా నవ్వుతున్నారు?"

ముఖం ముడుచుకుంటూ అన్నాడు భార్గవ.

"మీరలా చిన్న పిల్లాడిలా మాట్లాడుతూంటే నవ్వు రాదా మరి! కార్లన్నీ రిపేర్లో వుంటే, అప్పటికప్పుడు క్షణాలమీద కొత్తకారు తెప్పిస్తారు కానీ చౌదరిగారు ఆటోలో నన్ను వెళ్ళనిస్తారా? నాకని ప్రత్యేకించి ఉంచారు ఓ కారు. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆ కారు నేను తప్ప మరొకరు వాడరు. చివరికి చౌదరిగారే అయినా సరే...."

"మరిప్పుడు ఆటోలో వచ్చారే?"

అయోమయంగా అడిగాడు భార్గవ.

"అయ్యో! భార్గవగారూ! ఇంటి దగ్గర్నుండి నేను నా కార్లో బయల్దేరి మా ఫ్రెండింటికి వెళ్ళి, ఆ కారక్కడ వదిలేసి ఆటోలో ఇక్కడికొచ్చేశాను."

"ఎందుకలా?"

తెల్ల మొహంతోనే అడిగాడు అతను.

"నా కారు మీద వచ్చాననుకోండి....బయట ఎవరయినా నా కారు చూసి చౌదరిగారితో చెప్తే 'ఇందిరా పార్కు కెళ్ళావా' అంటూ ఆయన ఆరాలు తియ్యరూ? అందుకే కారు తేలేదు."

"అంటే....అంటే....మీ రిక్కడికి వస్తున్నట్టు చౌదరిగారికి చెప్పలేదా?"



అర్థం కానట్టు మొహం పెడుతూ అడిగాడు అతను.

"మీకు పెళ్ళయిందా?"

సీరియస్‌గా అడిగింది ఆమె.

"లేదు....ఏం?"

సడన్‌గా ఆమె టాపిక్ ఎందుకు మార్చిందో అతని ఊహకందలేదు.

"మీకే పెళ్ళయుంటే....మీ భార్య ఎవరో ఓ పరాయి మగాడిని కలుసుకోడానికి ఇందిరా పార్కుకి వెళ్తున్నానంటే పంపిస్తారా?"

అప్పుడర్థమయ్యింది అతనికి. తనెంత తెలివితక్కువ ప్రశ్న వేశాడో!

భర్తకి తెలియకుండా తనని కలుసుకోడానికి ఆమె రిస్కు తీసుకుందన్న విషయం అతనికెంతో ఆనందాన్ని కలగచేసింది.

ఆమె అతనంటే చూపిస్తున్న ఆ అభిమానం....అతనికీ ఆమె అంటే అప్పటికే ఉన్న ఇష్టంతోపాటు ఓ రకమైన బాధ్యతలాంటి ఫీలింగుని కూడా కలిగించింది.

తన కోసం రిస్కు తీసుకుంటున్న వ్యక్తికి రక్షణ ఇవ్వడం మగాడిగా తన బాధ్యత అనిపించింది.

అయినా మనసులో ఓ మూల భయం కలిగింది.

"లైలాగారూ! ఎందుకిలా చేశారు? చౌదరిగారికి విషయం తెలిస్తే?"

"ముందుగా ఓ విషయం ...నన్నలా 'లైలాగారూ' అంటూ దూరం చెయ్యకు. నన్ను లైలా అని పిలు, చాలు! నేనూ నిన్ను 'భార్గవా' అనే పిలుస్తాను

ఈ 'గార్లూ', 'బూర్లూ' మనషుల మధ్య దూరాన్ని పెంచుతాయి. ఇంక ఆయనకి తెలుస్తుందేమో అనే కదా నీ భయం! ఎవరం సేనో ఉన్న

భయంతోనో, భక్తితోనో మనసుకి నచ్చిన పని చెయ్యకుండా మానామా? నీకూ, నాకూ మధ్య శారీరక సంబంధం ఉంటే అది తప్పు కేవలం స్నేహబంధం మాత్రమే ఉన్నప్పుడు మనం ఎవరికో ఎందుకు భయపడాలి? ఆయనకి ఎందరో స్నేహితులున్నారు....దానికి నేనేమీ అనను. అలాగే నాకు నువ్వు.

అఫ్‌కోర్స్! ఆయనకున్న స్నేహితులు మగవాళ్ళే అనుకో....నాకూ నీకూ మధ్య ఈ ఆడా, మగా తేడాలున్నాయని నాకూ తెలుసు. కానీ నువ్వే చెప్పు....ఓ స్త్రీ, ఓ పురుషుకి మధ్య పవిత్రమైన స్నేహం అనేది ఉండడం జరగదా? అది అసాధ్యమా....? అసంభవమా...." అడిగింది ఆమె ఉద్రేకంతో.

స్వచ్ఛమైన ఆమె మనసుకి కరిగిపోయాడు భార్గవ

ఆమెకి తనకీ అంతస్థులోనే కాదు....ఆలోచనల్లోనూ ఎంతో తేడా!

వయసులో వున్న ఆడదై యుండీ....వయసు మళ్ళిన మగాడికి భార్య అయి ఉండీ....ఆమె ఎంత నిర్మలంగా ఆలోచిస్తోంది?

కానీ తనో?

తను మగాడు....పైగా పెళ్ళికానివాడు.

తన అభిరుచికి అనువైన అమ్మాయిని వెతుక్కుని పెళ్ళి చేసుకోగలడు.

జీవితాన్ని నచ్చిన రీతిలో మలుచుకునే అవకాశం తన కెంతయినా వుంది.

కానీ....ఓ మగనారిలో తనో స్త్రీనే చూడగలిగాడే తప్ప ఓ స్నేహితురాలిని చూడలేకపోయాడు.

అంతవరకూ ఆమె సౌందర్యంపట్ల అతనికున్న అభిమానం....

ఆమె మానసిక సౌందర్యాన్నెరిగిన ఆ క్షణం నుండీ అనురాగపు వెల్లువ అయి అతన్ని నిలువెల్లా ముంచెత్తింది.



"లైలా !"

అస్పష్టంగా ఆమె పేరు నుచ్చరించడం తప్ప అతని నోట మాట రాలేదు.

"చెప్పు భార్గవా! నేను తప్పు చేశానా? ఆయనకి తెలియకుండా రావడంలో? ఎప్పుడయినా మన స్నేహం ఆయనకి తెలిసిపోయి, ఆయనంతట ఆయనే నన్ను అడిగితే, నేను అబద్ధం చెప్పను. నువ్వు నా ప్రియ స్నేహితుడివనే చెప్తాను. మరి ఇప్పుడెందుకు చెప్పట్లేదంటావేమో! ఆడదానికి అందం వరమే కాదు, శాపం కూడా! ఆయనకి నేనంటే ఎంత ప్రేమో అంతకు రెట్టింపు అనుమానం.

నేనెక్కడ ఎవరి వల్లో పడిపోతానో అని నన్ను ఎవరితోనూ మాట్లాడనివ్వడు.

నమ్ముతావో లేదో నా ఫ్రెండని చెప్పానుగా, ఆమె ఒక్కర్తీ తప్ప నాకు ఈ మహా నగరంలో వేరే పరిచయస్తులే లేరు...." తల దించుకుని చెప్పింది ఆమె.

అయినా ఆమె కళ్ళ నుండి కన్నీరు కారడం అతని దృష్టిని దాటిపోలేదు.

"లైలా ప్లీజ్! నువ్వలా బాధపడకు! ప్రేమ ఉన్నచోట అనుమానం తప్పకుండా వుంటుంది. నీ మీద ఎంత ప్రేమ లేకపోతే నిన్ను చౌదరిగారు కోరి పెళ్ళిచేసుకున్నారు, చెప్పు? ఏ మగాడైనా తన భార్య ఎప్పటికీ తనదిగానే ఉండిపోవాలని కోరుకుంటాడు."

ఆమె కన్నీళ్ళు తుడిచాడు భార్గవ.

ఆ చేతిని అలాగే పట్టుకుంది ఆమె.

"భార్గవా! ఈ ఒంటరి ప్రపంచంలో ఇన్నాళ్లూ స్నేహం కోసం తపించిపోయాను. ఎడారిలో ఒయాసిస్సులాగ నాకు నువ్వు దొరికావు

చివరినాకా నాకు స్నేహితుడిగా, ఆప్తుడిగా మిగిలిపోతానని మాట ఇవ్వ ఆర్తిగా అడిగింది ఆమె.

"పిచ్చి లైలా! ఎంత అమాయకంగా ఆలోచిస్తున్నావు? నా స్నేహ నీకెంత అపురూపమో, అంతకు రెట్టింపు అపురూపం నీ స్నేహం నాకు ఎదురుగా నవ్వుతూ మాట్లాడి, వెనకాల గోతులు తవ్వే ఈ సిటీ వాతావ ణంలో నీ స్నేహం నాకో మల్లె పందిరి. ఎట్టి పరిస్థితిలోనూ నీకు దూర కాను....కాలేను."

ఆమె చేతిమీద చెయ్యేసి ప్రేమగా నొక్కాడు భార్గవ.

ఒకప్పుడు ఆమెని చూస్తూనే వేడెక్కిపోయిన శరీరం....ఇప్పుడా చేతిని తన చేతుల్లోకి తీసుకున్నా చలించకపోవడం ఆశ్చర్యమనిపించి దతనికి.

వెంటనే అతనికే అనిపించింది....

అవును....! అప్పుడామె తన దృష్టిలో ఓ అందమైన యువతి...

ఇప్పుడు ఓ ప్రియస్నేహితురాలు.

ఎదుటి మనిషిని చూసే కోణమే మనసులోని ఏ కోరికకయి మూలం అవుతుందనిపించింది.

"ఒకవేళ ఆయనకి మన విషయం తెలిస్తే ...? అప్పుడు దూ అవుతావా?" బేలగా అడిగింది ఆమె.

"ఆ విషయంలో భయపడ్డం అనవసరం. చౌదరిగారు అంత సం చితంగా ఆలోచించే మనిషి కారని నా ఉద్దేశ్యం. నీకెందుకు....? ఎప్ప నేను నీ స్నేహితుడ్నే అని మాటిచ్చాగా. నమ్మకం లేదా?"

"నమ్మకంలేనిది నీ మీద కాదు. నిన్ను చూస్తేనే నువ్వు స్నే పాత్రుడివనీ మంచివాడివనీ అనిపించింది. నేను భయపడేది ఆయన డబ్బు పలుకుబడికి. నువ్వా అదే ఫీల్డులో ఉన్నావు. ఆయన నిన్నేం చేస్తాడో నా భయం."



"లైలా! ఒకే రంగంలో వున్నంతమాత్రాన ఆయన నా యజమాని కాదు, నేనాయన నౌకర్నీ కాదు. వృత్తిపరంగా....అదీ ఆయనకింద పని చేస్తున్నప్పుడే తప్ప ఆయన నన్నేవిధంగానూ శాసించలేడు. ఒకప్పుడు బ్రతుకుతెరువు కోసమే ఈ సినిమా ప్రపంచంలోకొచ్చాను నేను. ఇప్పుడా అవసరం లేదు. కూర్చుని తిన్నా నా జీవితం గడిచిపోతుంది" వివరంగా అన్నాడు భార్గవ.

"ఏం....ఏదయినా లాటరీ కొట్టావా?" అంతవరకూ వున్న సీరియస్‌నెస్ ఎటు పోయిందో నవ్వుతూ అడిగింది లైలా.

"కాదు! అకస్మాత్తుగా ఓ అర్ధరాత్రి లక్ష్మీదేవి నన్ను కరుణించి నాకు సంపదని ప్రసాదించింది" మనీష మనసులో మెదుల్తాండగా అన్నాడు భార్గవ.

"ఓ.కే బాబూ. ఆయన భయం నీకు లేదని ఒప్పుకుంటాను. సో....ఇకనుండీ మనం స్నేహితులం" అతని చేతిని తన చేతిలోకి తీసుకుంటూ అంది లైలా.

"అవును. మరి ఇంత మంచి అకేషన్ సెలబ్రేట్ చేసుకోవద్దూ? పద, ఏదయినా హోటల్‌కెళ్ళి ఐస్‌క్రీమ్ తిందాం"

"రామాయణం అంతా విని రాముడికి సీత ఏమవుతుందని అడిగాట్ట నీలాంటివాడే ఎవడో. నేను బయట తిరగటం చౌదరిగారికి ఇష్టముండదని తెలిసీ....హోటల్‌కెళదాం అంటున్నావు. మరి యింత బుద్ధులేంటబ్బా" బుంగమూతి పెట్టింది లైలా.

ఆ ఫోజులో ఆమెను చూసేసరికి ఒక్కసారిగా రక్తం పొంగింది భార్గవకి.

ఆమెని అమాంతం సందిట్లోకి తీసుకుని ఆ ఎర్రటి పెదాల్ని
మగా కొరికెయ్యాలనిపించింది.

కోరికతో అతని ఒళ్ళు వేడెక్కింది.

అంతలోనే తమాయించుకున్నాడు భార్గవ.

ఆమె తన్నో స్నేహితుడిలా చూస్తుంటే, తనలా ఛీప్‌గా ఆ
చటం కూడా తప్పే అనిపించింది.

మొరాయిస్తున్న మనసుని బలవంతాన సముదాయించాడు.

"సారీ లైలా! పోనీ యిక్కడే ఏదయినా తిందాం....ఏ పల్లీల
రాతపోతాడా?"

"ప ల్లీలూ, గిల్లీలూ అక్కరలేదుకానీ క్షణం ఓపికపట్టు" 
బ్యాగ్ తెరిచిందామె.

అందులోంచి ఓ క్యాడ్‌బరీస్ చాక్లెట్ తీసి ముక్క విరిచి 
ఇచ్చింది.

మరో ముక్కను తను తీసుకుంటూ 'లాంగ్‌విత్ అవర్ 
షిప్' అంది చిన్నగా నవ్వుతూ.

తనూ నవ్వుతూ ఆ ముక్క కొరికాడు భార్గవ.

"నీకు క్యాడ్‌బరీస్ యిష్టమా?"

"ఏం? చిన్నపిల్లలా క్యాడ్‌బరీస్ తినడం ఏమిటని నువ్వు 
క్లాసు తీసుకుంటావా?"

భయపడుతున్నట్టుగా నటిస్తూ కళ్ళు పెద్దవిచేసి అందామె.

అప్పటి ఆమె రూపం అతని మనసులో ముద్ర పడిపోయిం

ఏమిటి ఈమె అందంలోని విచిత్రం? ఏ ఏంగిల్‌లో 
అపూర్వమైన అందం ఆమెది! అనిపించిందతనికి.



"అందుక్కాదు....ఇకనుంచీ వేషాల కోసం వెదుక్కోడం మానేసి
క్యాడ్‌బరీస్ ఏజన్సీ తీసుకుందామని..."

తనూ నవ్వుతూ అన్నాడు భార్గవ.

"అప్పుడింక మూడో రోజుకే బోర్డు తిప్పెయ్యాల్సి వస్తుంది. ఉన్న
స్టాకంతా ఈ ఫ్రెండుకే అయిపోతే, బ్యాంకులో వున్న కాస్త డబ్బూ
నాలుగురోజుల్లో అయిపోతుంది"

తేలిగ్గా అంది లైలా.

"అంత తేలిగ్గా నాలుగురోజుల్లో అయిపోయేది కాదులే నా బ్యాంక్
ఎకౌంట్" గర్వంగా అన్నాడు భార్గవ.

డబ్బు కలిగి ఉండటం అన్నది మగాడికెప్పుడూ దర్పాన్నీ,
హుందాన్నీ యిచ్చే విషయమే!

"ఇంకేం....నా ఫ్రెండ్ దగ్గర అంత డబ్బు వున్నప్పుడు-నా ఇష్టం
వచ్చినట్టు నేను ఖర్చుపెట్టుకోవచ్చన్నమాట! భార్గవా! సరదాగా అన్నాను
సుమా! నిజం అనుకునేవు........మన మధ్య ఎప్పుడూ 'డబ్బు' ప్రసక్తి
రాకూడదన్నదే నా కోరిక."

"లైలా! ఒక్క విషయం మాత్రం నిజం....నాకున్న డబ్బు ఖర్చు
పెట్టి నాకు ఆనందాన్ని కలగచెయ్యగలనంటే నేను ఈ క్షణాన అందుకు
రెడీ! నువ్వు సంతోషంగా వుండటమే నాకు ఇష్టం" ఆరాధన ఉట్టిపడు
తూండగా అన్నాడు భార్గవ.

అతని మాటలలోని సిన్సియారిటీ స్పష్టంగా తెలుస్తూనే వుంది.

"మై ఫ్రెండ్! నిన్ను నాకిచ్చినందుకు ఆ దేవుడికి నేనెలా థాంక్స్
చెప్పుకోగలను?"

భార్గవకి తనపట్లగల అభిమానానికి మురిసిపోతూ అందామె.

* * * *

అక్కడికి కొద్ది దూరంలో ఓ పొద పక్కన కూర్చుని ఉన్నాడు మురళి-ఇన్‌స్పెక్టర్ మురళి.

పక్కనే ఐదు సంవత్సరాల అతని ఏకైక కుమార్తె, బేబీ కూడా వుంది-బంతితో ఏదో ఆడుకుంటూ.

సడన్‌గా ఏం తోచిందో బంతి పక్కన పడేసి తండ్రి పక్కకొచ్చి ఒళ్ళో కెక్కింది.

ఏదో ఆలోచనల్లో వున్న మురళి ఉలిక్కిపడి చూశాడు.

"డాడీ! ఎప్పుడూ మనతో మమ్మీ కూడా పార్కుకొచ్చేదిగా! ఇప్పు డెక్కడికి వెళ్ళిపోయింది డాడీ?"

మురళి గడ్డం పట్టుకుని తనవేపు తిప్పుకుంటూ అడిగింది బేబీ ముద్దుగా.

ఆ మాటలు మురళికి ముద్దుగా అనిపించలేదు.

గుండెలమీద గుద్దినట్టనిపించింది.

బేబీ అంటే అతనికి ప్రాణం.

ఆ చిన్నారి కోసం అతను ఏం చేయడానికయినా రెడీనే!

కానీ యిప్పుడా పాపకి జవాబిచ్చే స్థితిలో లేడు.

మాట్లాడలేదు మురళి.

"చెప్పు డాడీ! మమ్మీ ఎక్కడికెళ్ళింది? ఆ రోజు మీరంతా మమ్మీని ఎక్కడికో తీసుకెళ్ళారుగా! మళ్ళీ రాదేం మమ్మీ?" తండ్రిని పట్టుకుని కుదిపింది బేబీ.

గుండెకోసే ఆ ప్రశ్నకి జవాబులేదు మురళి దగ్గర.

ప్రాణానికి ప్రాణంగా మెలిగిన ఇల్లాలిని నాలుగురోజుల జ్వరం వంకతో యముడెత్తుకు పోతున్నప్పుడు అతని తెలివీ, అధికారమూ, మంచి తనమూ ఏదీ అతనికి తోడు రాలే



ముక్కుపచ్చలారని బేబీ బాధ్యత తనమీదే పెట్టి ఆ కన్నతల్లి పైలోకాలకి వెళ్ళిపోతూంటే నిస్సహాయంగా చూస్తూ ఉండిపోవటం తప్ప మరేదీ అతనికి చేతకాలేదు.

వృత్తిరీత్యా రాటుదేలిపోయిందనుకున్న గుండె ఆమె వియోగానికి రక్తాశ్రువులు కారుస్తూంటే ఆవేదనలోనే మనశ్శాంతి వెదుక్కుంటున్నాడు అతను.

'అమ్మ కావాలి' అని ఏడుస్తూన్న పాపని ఊరుకోబెట్టలేక, 'తిరిగి రాని లోకాలకి అమ్మ వెళ్ళిపోయిందన్న' నిజాన్ని ఆ పసిపాపకి చెప్పలేక నలిగిపోతున్నాడతను.

బేబీ అమ్మ కోసం మారాం చేస్తూంటే పార్కుకి తీసుకొచ్చాడు అతను.

ఆ వాతావరణంలో బేబీ కాస్సేపయినా అమ్మని మర్చిపోతుందను కున్నాడు.

ఓ పక్కగా పాప ఆడుకుంటూంటే, మరోపక్క కూర్చుని అతను ఏదో ఆలోచనల్లో మునిగిపోయాడు.

మనసెంత వ్యథాపూరితమై బరువుగా వున్నా, అతని పోలీస్ బుర్ర మాత్రం ఏదో మూల పనిచేస్తూనే వుంది.

అప్పుడప్పుడూ గాలి వాలుకి అతని చెవుల్లో పడుతూన్న వాళ్ళిద్దరి సంభాషణా అతను ఫాలో అవుతూండకపోయినా మెదడులో దానంతటదే ముద్రపడిపోయింది.

చౌదరి అంటే ఎవరో అనుకున్నాడు మొదట్లో.

కానీ భార్గవ మాటలు బట్టి అతను ది గ్రేట్ ప్రొస్క్యూటర్ చౌదరి అని అతనికి అర్థమైపోయింది. పోలీసు ఇన్స్పెక్టరుగా అతనికి మనుష్యుల్లోని మంచితనం కంటే చెడ్డతనం తోటే పరిచయం ఎక్కువ. వృత్తిపరంగా అతనికెక్కువగా ఎదురయ్యేది దానవుల్లాంటి మనుష్యులు మాత్రమే.

డబ్బు కోసమో, విలాసం కోసమో, సరదా కోసమో, ఒంటి వేడిని తీర్చుకోడానికో భర్త చాటున వ్యభిచారం చేసే ఎందరో ఆడవాళ్ళని అతను ఇన్స్పెక్టరుగా ఎరిగే వున్నాడు.

అయితే మురళిగా అతనెరిగిన ఏకైక స్త్రీ అతని భార్య మాత్రమే.. అతని కోసమే బ్రతికిన భార్య శమంత మాత్రమే.

డ్యూటీ మీదుండగా అలాంటి స్త్రీలు ఎదురైనప్పుడు వీళ్ళు శమంతలా సిన్సియర్‌గా ఉండక ఎందుకిలా తయారయారా అని ఆశ్చర్యపోయేవాడు.

ఇంటి దగ్గరుండగా వాళ్ళు గుర్తొచ్చినప్పుడు శమంత వాళ్ళలా విచ్చలవిడిగా తిరగకుండా అంత డివోటెడ్‌గా ఎలా బ్రతుకుతోందా అని ప్రశ్నించుకునేవాడు.

వాళ్ళ మాటలు వింటూనే అతని కర్థమైపోయింది.

వాళ్ళు తమని తాము ఎంతగా వంచించుకుంటున్నారో—

ఓ ఆడామగా మధ్య స్నేహం సాధారణంగా శరీరాల కలయికకే దారి తీస్తుంది.

ఇద్దరూ ఒకేలాంటి మేధావులయితే తప్ప వారద్దరి మధ్యా స్వచ్ఛమైన స్నేహం సంభవం కాదు.

వాళ్ళిద్దరి మధ్యనా ఉన్నది నిజమైన స్నేహబంధమే అయినట్లయితే వాళ్ళకి ఎదుటి వ్యక్తిది ఆపోజిట్ సెక్స్ అని కానీ, ఆ వ్యక్తి అందచందాలు కానీ లోటుపాట్లు కానీ దృష్టిలోకి రానేరావు.

ప్రకృతి సహజమైన స్త్రీ పురుష ఆకర్షణని స్నేహంగా అనుకుంటూ తమని తామే వంచించుకుంటున్నారు ఇద్దరూ అనుకున్నాడతను.

అంతలోనే బేబీ మారాం అతని ఆలోచనల్ని పక్కకి లాగింది.



ఇన్స్పెక్టరు మురళి మండి తల్లిని పోగొట్టుకున్న ఓ నిర్భాగ్యపు పాప తండ్రిగా మారిపోయాడు.

"చెప్పు డాడీ....అమ్మెప్పుడొస్తుంది?"

ఏడుస్తూ అడిగింది బేబీ.

"ఒస్తుంది తల్లీ! రేపొచ్చేస్తుంది"

పాపని దగ్గరకు తీసుకుని గుండెల కదుముకున్నాడు.

"అమ్మని మర్చిపో తల్లీ! నూటినూటికీ అమ్మని గుర్తుచేసి ఈ అభాగ్యుడి గుండె కొయ్యకు"

అతని మనసు విలవిల్లాడిపోతోంది! కళ్ళనుండి జలజలా నీళ్ళు రాలి పాప తలమీద పడ్డాయి.

"అరే! ఏంటి డాడీ ఏడుస్తున్నారా? కడుపునొప్పిగా వుందా?"

అమాయకంగా అడిగింది పాప.

కడుపునెప్పిలాంటి శారీరక బాధలవల్లే మనుష్యులేడుస్తారనుకునే పసితనం ఆమెది.

ఆ బాధలకంటే మానసిక సమస్యలు మరికొన్ని వేల రెట్లుగా మననని కోస్తాయనేది తెలియని అజ్ఞానం ఆమెది!

"పోన్లే డాడీ! ఏడవకు! అమ్మ రాగానే మందేసుకుందువుగాన్లే."

పాప సముదాయించింది తండ్రిని.

పాప దృష్టిలో అమ్మే డాక్టరు— అమ్మ మందిస్తే నెప్పులన్నీ ఎగిరిపోతాయి.

"అయ్యో పెర్రితల్లీ! ఆ అమ్మే వుంటే అసలా బాధే లేదు కదా తల్లీ!" అతని మనసు తల్లడిల్లిపోయింది.

"డాడీ! అమ్మ ఎక్కడికి వెళ్ళింది డాడీ?"

మళ్ళీ చిన్నగా అడిగింది బేబీ.

"దేవుడికి కడుపు నెప్పిగా ఉందటమ్మా! అమ్మని మందు కో రమ్మని పిలిచాడు. దేవుడికి బాగయిపోగానే అమ్మ వచ్చేస్తుంది"

పాపని బుజ్జగిస్తూ అన్నాడు మురళి.

"అవును డాడీ! మనం అప్పుడు ఇనాయకుడికి ఇన్ని కుడుప పెట్టాం కదూ డాడీ! పాపం. అవి తిని కడుపునొప్పుందేమో! బోన్లే దేవుడు కూడా మంచే కదూ. పాపం అమ్మని మందిమ్మందాం"

ఆరిందాలా చెప్పింది బేబీ.

బాధగా ఊ కొట్టాడు మురళి.

"డాడీ! ఇంటికెళ్ళిపోదాం డాడీ! అమ్మ దేవుడి దగ్గర్నించి పిందేమో! పాపం మెట్లమీద కూర్చుని మన కోసం చూస్తూంటుంది"

ఎప్పుడయినా తను స్కూలు నుండి తొందరగా వచ్చేసి, అమ్మ మీద బయటికెళ్తే తనొక్కత్తీ మెట్ల మీద కూర్చుని తల్లి కోసం ఎ చూడ్డం గుర్తొచ్చి అంది బేబీ.

పాప మాటలకి నవ్వాలో ఏడవాలో తెలియలేదు మురళికి.

"నీ అజ్ఞానమే నీకి బాధని తెలియనివ్వట్లేదు తల్లీ! నేనూ నీ పసిపిల్లాడినయిపోతే నాకి బాధ వుండేదికాదు" లోపల్లోపలే ఏ మురళి.

పాప నెత్తుకుని ముందుకొచ్చాడు మురళి.

అనుకోకుండా అతని చూపులు లైలా, భార్గవల మీద పడ్డాయి.

ఆమెని చూడగానే అతను ఉలికిపడ్డాడు.

చనిపోయిన తన భార్య శమంత గుర్తొచ్చిందతనికి.

చాలావరకూ ఆమెలాగే ఉందిమె కూడా!

బేబీ కూడా లైలాని చూసివట్టుంది.



ఒక్కుదుటున తండ్రి చేతుల్లోంచి విదిలించుకుని దిగిపోయింది.

కళ్ళింత చేసుకుని, ఆ కళ్ళ నిండా నీళ్ళతో 'మమ్మీ, మమ్మీ' అంటూ లైలాని చుట్టేసింది.

ఇటు మురళీ మాత్రమే కాదు, అటు లైలా, భార్గవలు కూడా ఆ పసిదాని చర్యకి నివ్వెరపోయారు.

ఎవరికీ నోట మాట రాలేదు.

బేబీ మాత్రం మమ్మీ అంటూ లైలాని పట్టుకుని ఒకటే ఏడుపు.

ఆ స్థితిలోంచి ముందుగా తేరుకున్నవాడు మురళియే.

"సారీ మేడమ్! మా పాప మిమ్మల్ని చూసి వాళ్ళ అమ్మనుకుంది" సంజాయిషీ ఇస్తున్నట్టుగా అని, బేబీని నెమ్మదిగా చేతుల్లోకి తీసుకున్నాడతను.

"ఉండు డాడీ! అమ్మ నన్ను ఎత్తుకుంటుంది"

పాప మురళీ చేతుల్లోంచి గింజుకుంటోంది.

"అమ్మ కాదమ్మా-ఆంటీ ఈవిడ"

బేబీకి నచ్చచెప్తూ లాలిస్తున్నాడు మురళి.

"మీ పాపకి వాళ్ళ మదర్ అంటే చాలా ఇష్టం అనుకుంటా- తిరిగి ఇంటికెళ్ళే దాకా కూడా ఆగలేకపోతోంది" చిన్నగా నవ్వుతూ అంది లైలా.

"ఇంటికెళ్ళినా ఇంతేలెండి! అక్కడా అమ్మ కోసం ఏడుపే!"

"అరే! అదేం?"

"బికాజ్ షీ ఈజ్ నో మోర్."

ఉబికొస్తున్న కన్నీళ్ళని బలవంతాన ఆపుకుంటూ మొండిగా అన్నాడు మురళి.

అతని మాటల్లోని విషాదం వాళ్ళ గుండెల్ని నొక్కి పట్టింది.

"అరరే...."

ఇద్దరూ ఒకేసారి అన్నారు.

"ఓ.కే.! లీవిటాఫ్! ఐయామ్ మురళీ....ఇన్‌స్పెక్టర్ మురళీ....షీ ఈజ్ మై డాటర్....బేబీ"

'ఇన్‌స్పెక్టర్' అన్న మాట వినగానే లైలా కళ్ళలో కురిసిన భయం అతని దృష్టిని దాటిపోలేదు.

ఎందుకిలా భయపడుతోందీమె?

నేరం చెయ్యనివాళ్ళు కూడా పోలీసులంటే భయపడ్డం తనెన్నోసార్లు చూశాడు.

ఈమె కూడా అంతేనా?

"ఐయామ్ భార్గవ, నేనో ఆర్టిస్టుని - సినిమాల్లో నటిస్తుంటా - షీ ఈజ్ మై ఫ్రెండ్ లైలా"

భార్గవ మాటలు చెవిన పడగానే అతని ఆలోచనలు చెదిరిపోయాయి.

భార్గవ లైలాని మిస్సో, మిసెస్సో చెప్పకుండా పరిచయం చేసిన తీరు చూడగానే అతని అనుమానం తొలగి పోయింది.

లైలా ఎక్కడ మిసెస్ చౌదరి అన్న విషయం తెలిసిపోతుందో అని వాళ్ళ భయం అయ్యుండచ్చు.

అయినా తనకి వృత్తిలో ప్రతీ చిన్న దానికి అనుమానపడ్డం అలవాటయిపోయింది.

నిజానికి పెళ్ళయిన ఓ ఆడది, భర్తకి తెలియకుండా పరాయి మగాడితో షికారుకొచ్చినప్పుడు, గాలి ఈలవేసినా బెదిరిపోవడం సహజం.

అలాంటిది ఓ పోలీసు ఇన్‌స్పెక్టరు పరిచయమయితే భయపడకుండా ఉంటుందా?

తనకి తనే సమాధానం ఇచ్చుకున్నాడు మురళి.

"ఓ.కే! ఐ షల్ టేక్ లీవ్! సీయూ ఎగైన్"



రావని ఏడుస్తూన్న పాపని భుజానేసుకుంటూ చకచకా నడిచి వెళ్ళిపోయాడు మురళి.

అతని ఆరడుగుల రూపం కళ్ళనుండి మాయం అయేనాకా బొమ్మల్లా అటే చూస్తూ వుండిపోయారు భార్గవా, లైలాలు.

అతను దూరం కాగానే రిలీఫ్‌గా ఇద్దరూ నిట్టూర్చారు.

* * * *

ఆ రోజు ఉదయం నిద్ర లేస్తూనే డ్రయివర్ భార్య సీత గుర్తొచ్చింది భార్గవకి.

ఆమెని చూసి వారం రోజులయిపోయింది.

ఎలాగుందో పాపం అనుకుంటూ లేచాడు.

ఎలాగయినా ఆ రోజు వెళ్లి ఆమెని చూసి రావాలనుకున్నాడు.

* * * *

భార్గవని చూడగానే ఇంత మొహమయింది సీతకి.

"రండి బాబూ .... మీరు రాక చాలా రోజులయ్యింది" చిన్నగా నవ్వుతూ పీట వాల్చింది సీత.

"అవును సీతా! ఏరోజు కారోజు రావాలనే అనుకుంటున్నాను. ఏదో పని వల్ల కుదరట్లేదు"

సిగ్గుపడుతూ జవాబిచ్చాడు.

నిజానికి సీతని కలవడానికి వీలు కానిది పన్లవల్ల కానేకాదు.

రోజూ ఏదో ఒక టైంలో లైలాని ఎక్కడో ఓ చోట కలుసుకుని కబుర్లాడుకోడం ఈ మధ్య నిత్యకృత్యమై పోయింది భార్గవకి.

ఆమెతో గడిపే ఆ కాస్త సమయం కోసమే అతను రోజంతా కళ్ళలో వత్తులేసుకుని ఎదురుచూస్తున్నాడు.

ఆమెతో ఉన్న ఆ సమయంలోనే తనో జీవమున్న వ్యక్తిగా మిగిలిన టైములో కదిలే బొమ్మగానూ ఫీలవుతున్నాడు.

లైలాకి తనెందుకిలా ఈల్డ్ అయిపోతున్నాడో, సరెండర్ అయి తున్నాడో అర్థం కావట్లేదు భార్గవకి ఎంతగా ఆలోచించినా. ఆమె సన్నిధి యుగాలు క్షణాలవుతూంటే, ఆమె విరహంలో క్షణాలు యుగాలవుతున్నా

అలాగని ఆమెతో అతను శారీరక సంబంధం ఏర్పరచుకోనూలే

ఆమె సౌందర్యాన్ని కళ్ళతో తాగేస్తూ, ఆమె మాటల మాధుర్యా చెవులతో ఆరగిస్తూ ఆ సౌందర్యరాశికి భక్తుడయిపోయాడు....ఓ ప్రే పూజారిగా మారిపోయాడు.

ఆమె మినహా ప్రపంచమే లేదన్నంత పిచ్చిలో పడిపోయాడు.

ఇప్పుడీ సీతని చూస్తూంటే తనెంత ఉన్మత్తుడిగా మారిపోయా అర్ధం అవుతోంది.

నిస్సహాయ స్థితిలో ఉన్న సీత ఓ ఆదరపూర్వకమైన చల్లటి మాట మొహం వాచిపోయి వుంది.

అన్నీ ఉన్నప్పుడు అందరూ ఉంటారు ఎవరికయినా. ఏదీ లేనప్పు 'నా' అనే తోడు కోరుకుంటారు. ఆ 'నా' అనే వాళ్ళు భర్తే కానక్కర్లే ఓ అన్నో, తమ్ముడో, అక్కో, చెల్లెలో, ఫ్రెండో, ఆప్తుడో, శ్రేయో లాషో....ఎవరో ఒకరు!

కాస్త మాట సాయం చేస్తే చాలు కొండంత ఉబ్బిపోతారు.

ఇప్పుడీ సీత కూడా అదే స్థితిలో వుంది.

ఆమెకి ఏ కాస్త ఆసరాగా నిలవగలిగినా, మనిషిగా అది తన ఉని పరమార్ధం!

ఒక్కసారిగా తల విదిలించాడు భార్గవ.



"సీతా! మరోలా అనుకోకు .... ఏవో అర్జంటు పనులు కారణంగా రాలేకపోయానిన్నాళ్ళూ, ఇప్పుడు చెప్పు-చౌదరిగారిని కలిశావా?"

"వెళ్ళాను బాబూ! మొన్న వెళ్ళాను. నాకో పదివేలు ఇచ్చారు. ఆళ్ళ గుమాస్తా అన్నాడు బాబూ, సినేమాల్లో ఏయో వేషాలుంటాయట - నాకిష్టమైతే నేనా వేషాలు కడితే నాకూ ఏదో ఆదాయమూ వుంటదీ, ఓ పనీ వుంటది అని. మీలాటోళ్ళకైతే ఆ ఏషాలు బాగుంటాయి కానీ నా బోటి పదుంకోని ఆడదానికి వేషాలేముంటాయి అని అనిపిస్తోంది బాబూ!"

అక్కడే నేలమీద కూర్చుంటూ అంది సీత.

అంతవరకూ ఎప్పుడూ సీతని పరీక్షగా చూడలేదు భార్గవ. ఇప్పుడు సినిమాలో వేషం అనేసరికి పట్టి పట్టి చూశాడు. నల్లగా వున్నా ముక్కూ, నోరూ తీరుగా వున్నాయి.

యవ్వనంతో మిసమిసలాడుతున్న ఒళ్లు.

నోరు విప్పి మాట్లాడితే ఆమె చదువుకోనిదని వెల్లడవుతుంది తప్ప ఖరీదయిన బట్టలు వేసుకుని, కాస్త ఫాషన్‌గా అలంకరించుకుంటే చాలా మందికంటే అందంగానే వుంటుంది. కానీ.... ఆ ఫీల్డులోని వెలుగు నీడలు తెలిసిన వ్యక్తిగా సీతలాంటి అమాయకురాలు అందులో కాలుపెట్టడం అత నికి సంతోషంగా అనిపించలేదు.

ఎందుకైనా మంచిదని 'చౌదరిగారినడిగావా' అని అడిగాడు సీతని.

"అయ్యగారే ఈ విషయం నాకు చెప్పమన్నారట — నాకిష్టమైతే ఆయనే ఏసాలిప్పిస్తారట"

బ్రతుకుతెరువు దొరుకుతుందన్న ఆనందంతో పాటు వెండి తెర మీద తానూ తళుక్కుమనచ్చు కదా అన్న హుషారు కూడా కనిపించింది ఆమె మాటల్లో.

"అయితే ఇంకేం....! ఫీల్డులో అసలెవరూ తెలియనప్పుడు చే కోసం అడ్డదార్లు తొక్కాల్సి వస్తుంది. నీకు సాక్షాత్తూ పరమేశ్వరుడిలా అయ్యగారి సపోర్టే వుంది కనక నిన్నెవరూ ఏమీ చెయ్యలేరు. ఇంక అ చనలొద్దు—పెళ్లి ఒప్పేసుకో - ఏమో, నీ అదృష్టం ఎలాగుందో? రే ద్దున నువ్వే ఓ ప్రఖ్యాత హీరోయినవుతావేమో" చిన్నగా నవ్వాడు భా

"పొండి బాబూ, మీకంతా పరాసికాలే!"

సిగ్గుపడింది సీత.

"వేళాకోళం కాదు సీతా! నిజంగానే చెప్తున్నా! పెద్ద తారవయ్ ఈ భార్గవని మర్చిపోకు సుమా! లేకపోతే నన్నే నీ పి. ఏ.గా పెట్టు నమ్మకంగా ఉంటా...."

ఇంకా అల్లరిగా అన్నాడు భార్గవ.

"చాల్లెండయ్యా!"

మొహానికి చేతులడ్డుపెట్టుకుని సీత సిగ్గుపడుతూంటే, ఆమె అ యకమైన మొహాన్నే చూస్తూ ఉండిపోయాడు భార్గవ.

* * * *

భార్గవ చాలా హుషారుగా ఉన్నాడు.

క్రీమ్ కలర్ సూటులో నిజంగా పెళ్ళికొడుకులాగే వెలిగిపో న్నాడు.

తలంటి పోసుకున్న జుట్టు ఎగిరి నుదుటిమీద పడుతోంది.

ఏదో సినిమా పాట పాడుకుంటూ లైలాకి ఫోన్ చేశాడు.

లక్కీగా ఆమే ఫోనెత్తింది.

"హలో!"

లైలా గొంతు వింటూనే భార్గవకి సంతోషం పొంగుకొచ్చింది.



"హాయ్ లైలా"

ఫోన్‌లో బదులు పలికాడు.

"ఏమిటీవాళ చాలా జోరుమీదున్నట్టున్నావ్?" లైలా అడిగింది.

"అవును....నువ్వన్నది రైటే.... ఈవేళ ఈ ప్రపంచాన్ని కొనేసినంత ఆనందంగా ఉంది నాకు."

"ఆ విషయం నీ గొంతు వింటూంటేనే తెలిసిపోతోంది— కారణం ఏమిటో చెప్పవూ!"

"అబ్బా! అంత సులువుగా చెప్తానా? సాయంత్రం మా ఇంట్లో పార్టీ ఉంది. అప్పుడు చెప్తా".

"వాట్? మీ ఇంట్లో పార్టీనా? ఏమిటబ్బా ఆ స్పెషలు?" నిజంగానే ఆశ్చర్యపోయింది లైలా.

ఇన్నాళ్ళ పరిచయంలోనూ ఎప్పుడో ఎక్కడో బయట కలుసుకోవడం తప్ప ఏనాడూ అతని యింటికి వెళ్ళడం జరగలేదు.

ఈరోజున అతను ప్రత్యేకించి పిలుస్తున్నాడంటే ఏదో గట్టి కారణం ఉండుండాలి అనిపించింది.

"ఏం? భయమేస్తోందా, మా యింటికి రావడానికి?"

కాస్త అలకగా అడిగాడు భార్గవ.

"నో, నో! అదేంలేదు— ఇన్ని రోజులుగా నీతో తిరుగుతున్నప్పుడు లేని భయం, ఈ రోజు నీ యింటికి రావాలంటే వస్తుందా? అదికాదు సమస్య! ఈ సాయంత్రం అయన్ని చూడ్డానికి స్పెషలిస్టు వస్తున్నాడు. నేను ఉండడం తప్పనిసరేమో అని ఆలోచిస్తున్నా."

భార్గవని శాంతపరచడానికి ప్రయత్నిస్తూ అంది లైలా.

"స్పెషలిస్టా? ఎందుకు చౌదరిగారి ఆరోగ్యం సరిగాలేదా?" ఆత్రుతగా అడిగాడు భార్గవ.

"అబ్బే! అంత ప్రమాదం ఏమీలేదనుకో. ఆయనకి నడుం దగ్గర నరాలు పట్టేసినట్టున్నాయట. ఎందుకైనా మంచిదని స్పెషలిస్టుని పిలిపిస్తున్నాను. కాళ్ళు ఒకవేళ మరీ పట్టేసి కట్టు విప్పిన తర్వాత కూడా నడవలేక పోతానేమో అని ఆయన భయం! డాక్టరొచ్చి చూసిచెప్తే ఆయనకి కాస్త ధైర్యంగా ఉంటుంది కదా!"

"ఇంకేంమరి? నా పనికీ ప్రిఫరెన్సు ఇవ్వొచ్చు. సో.... ఈ సాయంత్రం మా యింటికి నువ్వొస్తున్నావు. ఓ.కే.?"

"వస్తాననుకో.... కానీ మీ యిల్లు గుర్తుపట్టగలనా అని?"

నాన్చింది లైలా.

"అదెంతపనని? నీకు వివరంగా చెప్పాను కదా, నా ఎడ్రసు! చాలా ఈజీ యిల్లు కనుక్కోడం.... తప్పుకోవాలని మాత్రం చూడకు."

"లేదు బాబూ లేదు! ఈ సాయంత్రం వస్తున్నాన్లే! సెంట్ పర్సెంట్ ష్యూర్."

"బై టిల్ దెన్."

ఫోన్ పెట్టేశాడు భార్గవ.

* * * *

మూసివున్న తలుపులమీద సుతారంగా చెయ్యి ఆన్చింది లైలా.

దబుక్కున తలుపులు తెరుచుకున్నాయి.

లోపలికి వస్తూనే గుప్పుమంది అగరొత్తుల వాసన. వినపడీ వినపడనట్టు స్టీరియో సంగీతం! కాళ్ళకింద ఏదో మృదువైన స్పర్శ.

అదిరిపడింది లైలా.

విచ్చుకుంటూన్న మల్లెపూలు పాదాలకిందపడి నలుగుతున్నాయి.

కాలు పక్కకి జరపబోయింది.



కానీ.... ఎక్కడ చూసినా ఒత్తుగా మల్లెలు.... గులాబీ రేకలు....

వళ్ళంతా ఏదో విచిత్రమయిన కదలిక....

"స్వాగతం.... దేవిగారికి స్వాగతం...."

మృదువుగా నవ్వుతూ భార్గవ ఎదురొచ్చాడు.

అతన్ని చూడగానే ఆమెకి కాస్త అదురుపాటు తగ్గింది.

"ఏయ్ బుద్దూ! ఏమిటిదంతా? ఈ అగరొత్తులూ, పువ్వులూ.... సంగీతం.... ఇదంతా ఎందుకు ? ఇదేమన్నా శోభనం రాత్రి అనుకున్నావా?"

తనని తాను సంభాళించుకుంటూ అడిగింది లైలా.

"శోభనం అంటే ఏమిటసలు? శుభమైనది శోభనం కదా! నువ్వు యింటికి రావడం శుభకరమే కదా!" నెమ్మదిగా లైలా దగ్గరకొచ్చి ఆమె చెయ్యి తన అరచేతుల్లోకి తీసుకున్నాడు భార్గవ.

కాలికింద నలుగుతూన్న పూరెక్కలకంటే మృదువుగా ఉన్నాయామె అరచేతులు.

ఆ స్పర్శకి అతనికి ఎక్కడో స్వర్గంలో విహరిస్తున్నట్టనిపించింది.

"నిన్నే భార్గవా! మాట్లాడవేంటి?"

లైలా కుదుపుతూ అడగడంతో తృళ్ళిపడ్డాడు భార్గవ.

"ఏమిటీ? ఏం చెప్పను? అసలెందుకు నన్ను డిస్టర్బ్ చేశావు?" ఆదోలా అడిగాడు భార్గవ.

"పెద్ద ఫోజుగా దేవదాసులా మాట్లాడకు. అసలెందుకు నన్ను రమ్మన్నావో చెప్పు?"

సీరియస్‌నెస్ నటిస్తూ అడిగింది లైలా

అడుగుతూనే అతని చేతుల్లోంచి తన చేతులు విడదీసుకుంది.

"ఎందుకమ్మా ఆ కోపం....? యిప్పుడే పుట్టిన పసివాడిమీద రయినా కోపగిస్తారా?"

మారాం చేస్తున్నట్టుగా అడిగాడు భార్గవ.

"పుట్టిన పసివాడా? అంటే....?"

అడిగిన మరుక్షణంలోనే అర్థమయింది లైలాకి తనెంత పూలిష్ ఆ ప్రశ్న అడిగిందో—

"ఏయ్! ఈ రోజు నీ పుట్టినరోజా?" విస్మయంగా అడిగింది లైల

"అవును మేడమ్....! ఈ భార్గవ.... ది గ్రేట్ డూప్ భార్గవ.. ఈ రోజే పుట్టాడని సభవారికి సవినయంగా మనవి చేసుకుంటున్నాను.. విన్నవించుకుంటున్నాను.... విశదపరుస్తున్నాను...."

నడుంవంచి విన్నపం చేసుకుంటున్నట్టు నటించాడు భార్గవ.

అమాంతం అతని భుజాలమీద పడింది లైలా.

"యూ ఫూల్.... ఆ మాట యిప్పటికిప్పుడా చెప్పడం....? ఇలా అకస్మాత్తుగా నీకు నేనేం యివ్వగలను? ఆ మాటేదో ఫోన్‌లోనే చెప్పాల్సింది కదా!"

అతని భుజాలమీద అల్లరిగా గుద్దింది లైలా.

"అంత స్పెషల్ న్యూస్ ఆ తీగల ద్వారానా నీకందించేది? ఈ విషయం నేనే చెప్పాలనుకున్నాను.... చెప్పాను...."

ఆమెతో చెప్పాడు భార్గవ.

"ఏం, నిన్నా, మొన్నా.... అటుమొన్నా.... యిన్ని రోజులు కలుసుకుంటూనే ఉన్నాంగా! ఇన్ని రోజుల్నించీ ఆ పర్సనల్ ఇన్ఫర్మేషన్ ఇచ్చుండొచ్చుగా....?" ఎర్రబడ్డ మొహంతోనే అడిగింది లైల

"దేనికైనా టైము రావాలి! ఎప్పుడో నాలుగురోజుల ముందు 'ఓ నాలుగు రోజుల తర్వాత నా పుట్టినరోజు లైలా' అని నీకు చె



ననుకో....ఇప్పుడు నువ్వనుభవిస్తున్న థ్రిల్ ఉండేదా? నా పుట్టినరోజు కనుక నువ్వో గ్రీటింగో, గిఫ్టో తెచ్చి నా మొహాన పడేసి.... 'మెనీ హాపీ రిటర్న్స్ ఆఫ్ ది డే!' అంటూ చెప్పి వెళ్ళిపోయేదానివి. అంతేగా!"

"ఓ! ఐయామ్ సారీ! నీకు విషెస్ చెప్పడమే మర్చిపోయాను. భార్గవా! మెనీ మెనీ హాపీ రిటర్న్స్ ఆఫ్ ది డే! అయితే ఇది నువ్వు చెప్తున్నంత కేజువల్‌గా చెప్పట్లేదు నేను. నువ్వు నన్ను సర్‌ప్రయిజ్ చెయ్యాలని అలా చేశావు కదా! నేనూ నీకో సర్‌ప్రయిజ్ ఇస్తున్నాను .... చూసుకో...."

అతని రెండు చెంపల మీదా చటుక్కున ముద్దాడింది లైలా.

ఊహించని ఆ చర్యకి షాక్ తిన్నట్టయ్యాడు భార్గవ.

"ఏం బుద్ధూ! ఆశ్చర్యంగా ఉందా? సర్‌ప్రైజ్ చెయ్యడం నీ ఒక్కడికే తెలుసనుకున్నావా? పుట్టినరోజు బాబుకి తీపి తీపి ముద్దులకంటే తగిన ప్రజంటేషను వేరే ఏముంటుంది చెప్పు?"

ఆ మాట అంటూ తిరిగి అతన్ని ముద్దాడింది.

ఆమె ముద్దులు అతనిలో ఓ ఆవేశాన్ని రగిల్చాయి.

తన మొహానికి దగ్గరగా ఉన్న ఆమె మొహాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు.

"తీసుకుంటే సరిపోతుందా? తిరిగి ఇవ్వడం మర్యాద కదా!"

వేగంగా ఆమె బుగ్గల మీద తన పెదాలతో ముద్ర వేశాడు. అక్కడ అతనికి దొరికిన మాధుర్యం అతనిని వెర్రెక్కించింది. తేనె వాసన తగిలిన ఉడుంలా అతని పెదాలు ఆమె బుగ్గల మీదనుండి పక్కకి జరిగి ఆమె పెదాల మీద ఆగిపోయాయి.

అంతే!

ఆ నాలుగు పెదాలూ బలంగా....భిన్నధృవాల అయస్కాంతాల్లా అతుక్కుపోయాయి.

ఆమె పెదాల్లోంచి అతని పెదాల్లోకి ఆ అమృతం ప్రవహిస్తోందో అతనిలోంచి ఆమెలోకి వస్తోందో? తెలియదు.

తెలిసింకోకటే....

అదొక అద్భుతమయిన తీపి....

ఓ అపూర్వమయిన మాధుర్యం....

ఓ అనూహ్యమయిన అనుభవం....

భార్గవ చేతివేళ్ళు ఆమె జుట్టులోకి ఎప్పుడు వెళ్ళాయో తెలియదు.

కానీ అతను మాత్రం ఆమె తలని వెనక్కి వంచి.... ఆమె పెదాల్లోని మధువును తాగుతున్నాడు.

వళ్ళంతా ఏదో కరెంటు పాకినట్టయ్యింది లైలాకి.

చెప్పలేని మైకం ఆమెని నిలువుగా ఆవహించింది.

అతని పెదాల ఒత్తిడి ఆమెకి ఊపిరాడనివ్వట్లేదు.

చటుక్కున తల వెనక్కి లాక్కుంది లైలా.

తింటూన్న విస్తరినెవరో లాగిపారేసినట్టు తృళ్ళిపడ్డాడు భార్గవ.

"లైలా.... మై డియర్.... ప్లీజ్.... ప్లీజ్ డోంట్ గో అవే! డోంట్ లీవ్ మీ"

ఆమెని మరింత బలంగా దగ్గరకు లాక్కుంటూ అన్నాడు మత్తు తప్పతాగిన వాడి మాటల్లా మొద్దుగా వున్నాయి అతని మాటలు.

"అంత సులువుగా దొరుకుతానా?"

కవ్విస్తూ అంది లైలా.

"లైలా.... నీ కోసం నా ప్రాణం అయినా ఇస్తాను-నువ్వు నాక్కావాలి.... నాకెప్పటికీ కావాలి."



"డాన్ దోజ్ థింక్స్!" మనసులోనే విసుక్కున్నాడు.

అంతటి ఆనందంలోంచి ఈ మామూలు ప్రపంచంలోకి రావాలంటే మనసొప్పట్లేదు భార్గవకి.

అంతలోనే గోడకున్న గడియారం మీద పడింది అతని దృష్టి.

"మైగాడ్! పదకొండు"

అదిరిపడ్డాడు.

తనేదో ఇంకా ఏ ఎనిమిదో, తొమ్మిదో అయుంటుందనుకుంటున్నాడు.

అప్పుడే పదకొండయ్యిందా?

ఇంతదాకా లేవకపోవడం అన్నది ఇదే మొదలు తన జీవితంలో.

మంచం దిగి ప్రక్కనే ఉన్న స్లిప్పర్స్ తొడుక్కున్నారు.

అంతలోనే మూలగా పడివున్న న్యూస్ పేపర్ అతని కళ్ళబడింది.

పొద్దున్నే పేపరో బోయ్ వచ్చి, కిటికీలోంచి గిరాటేసినట్టున్నాడు.

అటుగా నడిచి పేపరందుకున్నాడతను.

హెడ్‌లైన్స్ చూస్తూ పేజీలు తిప్పసాగాడు.

పాలిటిక్స్ అంటే పెద్దగా ఇంట్రస్ట్ లేదతనికి.

ఏదో మరీ ప్రాముఖ్యత ఉన్న పొలిటికల్ న్యూస్ తప్ప మామూలు దయితే అతనికంతగా అసక్తి రేకెత్తదు.

సిటీ న్యూస్ చదవడం మొదలెట్టాడు.

"కోడల్ని వేధించిన అత్త అరెస్ట్"

"వరకట్నాల కార్చిచ్చులో మరో యువతి సజీవ దహనం"

"నగర శివార్లలో బందిపోట్ల అగడం"

"ఆటోవాలా నిజాయితీ"

ఒక్కోటే చదువుకుంటూ వెళ్తున్న అతని దృష్టి మరో న్యూస్ ఐటమ్ మీద పడింది.

"డాక్టర్ దుర్మరణం"

యథాలాపంగా ఆ వార్త వివరాలు చదివాడు-

నగరంలోని ఓ ప్రముఖ ఫైవ్‌స్టార్ హోటల్‌లో గతరాత్రి బసచేసిన ఆ డాక్టర్ ఉదయాన బాత్రూంలో శవంగా మారి దర్శనమిచ్చాడు రూమ్ బోయ్‌కి.

బాత్రూంలో కాలుజారి పడటం వల్ల, తల గోడకి కొట్టుకుని మెడ విరిగి మరణించాడని, ఇన్స్‌పెక్టర్ మురళి ఆ కేసు దర్యాప్తు చేస్తున్నారని చదివాడతను.

ఇన్స్‌పెక్టర్ మురళి.... పేరు విన్నట్టనిపించింది ఓ క్షణంపాటు.

మరుక్షణమే గుర్తొచ్చింది- ఆ రోజు తొలిసారిగా తనూ, శైల కలుసుకున్నప్పుడు తమనతడు పలకరించిన విషయం.

బోన్ స్పెషలిస్ట్ మెడ ఎముక విరిగి మరణించాడనే విషయం అతనికో ప్రక్క యింట్రస్ట్‌గా అనిపించినా, ఇన్స్‌పెక్టర్ మురళి పేరే అతిన్నెక్కువగా ఆకర్షించింది.

ఆ తర్వాత పేపర్లో మరేమీ అతన్నాకర్షించలేదు.

పేపరు ప్రక్కన పడేసి బాత్రూం వేపు నడిచాడు అతను.

* * * * *

కుర్చీలో కూర్చుని షూ లేసు బిగిస్తున్న భార్గవ ఎదురుగా ఎవరో ముసలామె వచ్చి నిలబడటంతో తల పైకెత్తి చూశాడు.

వయసు కారణంగా కంటే జీవితంలో ఎదుర్కొన్న ఆటుపోట్ల కారణంగానే ముసలితనం తొందరగా ఆవరించినట్టుందామె!



ఎవరీమె....?

ఎప్పుడూ చూసినట్టులేదే!

"నన్ను మల్లమ్మంటారు బాబూ! సీత ఇంటికి ప్రక్కనే గుడిసెలో వుంటున్నా" చెప్పిందామె.

అతని చూపుల్లోని బ్లాంక్‌నెస్‌ని గమనించి చెప్పిందామె.

'సీత' పేరామె ఎత్తగానే ఆసక్తిగా చూశాడతను.

"నిన్న పొద్దుగాల సీత పిల్లల్ని నా కొగ్గేసి అక్కయ్యగారి టూడియోకి ఏదో సినేమాలో ఏసం కట్టటానికెళ్ళింది బాబూ! ఇంతదాకా రానేదు. పిల్లలూరికే అల్లాడిపోతండారు."

నేల మీద చతికిలపడింది మల్లమ్మ.

సీత ఇంటికి తిరిగి రాలేదన్న విషయం అతనికి గాబరా కలిగించింది.

ఏమయింది సీతకి? ఎందుకు రాలేదు?

"వెళ్ళేటప్పుడు సీతో ఏమన్నా చెప్పిందా అవ్వా....?" మల్లమ్మను చూస్తూ అడిగాడు.

"లేదు బాబూ! నాకేం సెప్పలేదు. ఆ ఏసం అయిపోగానే ఏగిరం ఒచ్చేత్తానంది బాబూ! ఇంకా ఒత్తది, ఇంకా ఒత్తదని రేత్తిరంతా సూసినా. ఇప్పటికీ రాకపోయేతలికి మీ దగ్గరికొచ్చినా."

"నీకు నేనెలా తెలుసవ్వా?"

"దాని మొగుడు ఆ పెమాదంలో సచ్చినప్పుడు తమరొచ్చేరు కద బాబూ! ఆ తర్వాత కూడా మీరు సీతింటికి రాడం సూసినా. మీరు తనకో తల్లీతోడులాటోరని మా సీత అనేది. మీ ఇల్లదీ కూడా అదే ఓసారి ఇటేపెల్తాంటే సూపింసింది బాబూ!

మల్లమ్మ అబద్ధం చెప్తోందేమో అని సంశయించడానికి లేదు.....

అలా అబద్ధాలాడే తెలివీ, అవసరమూ రెండూ ఆమెకి లే చూస్తూనే క్లియర్‌గా తెలిసిపోతోంది.

ఆ విషయం ఆమె వచ్చి తనకే ఎందుకు చెప్తోందన్న విషయ అడగలేదతను.

సీతకి 'నా' అనే వారెవరూ లేరని అతనికి బాగా తెలుసు.

వయసులో వున్న ఆమె భర్త అకస్మాత్తుగా యాక్సిడెంట్‌లో మ ణించినప్పుడు ఆమె పసివాళ్ళయిన బిడ్డలతో అయోమయంలో అల్లా పోతూన్న ఆ విషాద సమయంలో కూడా ఆమెని పలకరించడానికి ఓ మ షంటూ ఎవరూ రాలేదు.

మానవతా దృక్పథంతోనే వెళ్ళినా ఒకటికి పదిసార్లు ఆమె యో క్షేమాల గూర్చి ఆరా తీసినవాడు తనొక్కడే!

ఇప్పుడామె మాయం అయి, ఆమె బిడ్డలు అల్లాడుతున్నా ఆ వి యం పట్టించుకోడానికి తను తప్ప ఎవరూ లేరని తనకే స్పష్టంగా తెలుస

సీత ఏమయ్యిందో తెలుసుకోవాల్సిన నైతిక బాధ్యత తనదేనా?

ఆ అవ్వ ఇంకే వివరాలూ తన కందించలేదు.

ఏమైనా తెలిసుంటే ముందే చెప్పి వుండేది.

సీతకి చౌదరిగారి సినిమాల్లో అఫరు దొరికిందనే విషయం సీ తనతో చెప్పింది.

అవ్వ చెప్పినట్టు ఆయన్ని కలవడానికే నిన్న వెళ్ళి వుంటుంది.

తనకి ముందుగా వెళ్ళి ఆయన్ని కలిస్తే – సీత విషయం తెలి పోతుందనిపించింది భార్గవకి.

అంతలోనే అవ్వ దగ్గరున్న సీత బిడ్డలు గుర్తొచ్చారు భార్గవకి.

జేబులోంచి వంద రూపాయల నోటు తీసి అవ్వకిచ్చాడు భార్గవ.

"అవ్వా! ఈ డబ్బుతో సీత పిల్లలకేం కావాలో చూడు. నేను చౌద గారి దగ్గరకెళ్ళి సీత విషయం తెలుసుకుంటా, సీతని తీసుకుని తొందరగా వచ్చేస్తాన్లే–పిల్లల్ని మాత్రం జాగ్రత్తగా చూస్కో" అని-



అవ్వ అటు వెళ్ళగానే తనిటు చౌదరి దగ్గరికి బయల్దేరాడు భార్గవ.

* * * *

తరచూ ఆ బంగళాకి వచ్చిపోతూనే వున్న వ్యక్తి కనక భార్గవని అడ్డగించలేదు గూర్ఖా.

కింద హాల్లోకి రాగానే అక్కడ కుర్చీల్లోనూ, సోఫాల్లోనూ కూర్చున్న యువతీయువకుల్ని చూశాడు భార్గవ. వాళ్ళలో ఆరుగురు స్త్రీలు, ఆరుగురు పురుషులు. అంతా అందంగా ఆకర్షణీయంగా వయసులో వున్నారు. ఉద్యోగాల కోసం ఇంటర్వ్యూకొచ్చిన అభ్యర్థుల్లా వున్నారు వాళ్ళు. ఎందుకోనమో ఆత్రుతగా ఎదురుచూస్తూ.

వాళ్ళని మరోసారి చూస్తూ మేడమెట్లెక్కి పైకి వెళ్ళాడు భార్గవ.

"రావోయ్! రా"

ఎప్పట్లాగానే చౌదరిగారు మంచం మీద పడుకునే వున్నారు. విరిగిన కాలు కదపడానికింకా వీలు కాదనే విషయం కట్టు చూస్తూనే తెలుస్తోంది.

అయినా ఆయన మొహంలో చెదరని ఆ చిరునవ్వు తొంగి చూస్తూనే వుంది.

"నమస్కారం సార్!"

నమస్కరిస్తూ గదిలోకొచ్చాడు భార్గవ.

"కూర్చో అలా- సరిగ్గా సమయానికొచ్చావు"

రిలీఫ్‌గా నిట్టూరుస్తూ అన్నారు చౌదరిగారు.

"చెప్పండి సార్! నాతో పనేదయినా వుందా?"

"పని అంటే అంత పెద్దదేమీ కాదనుకో. కాకపోతే చాలా ముఖ్యమైనది. నువ్వు కాస్త బాధ్యతగా ఈ పని చేస్తే చాలు" తేలిగ్గా అన్నారాయన.

"మీరు పని చెప్తే అంతకన్నానా సార్? చెప్పండి నేనేం చెయ్యాలో"

మరేం లేదోయ్! మన కొత్త సినిమాలో నటించడానికి యువ యువకులు కావాలని ప్రకటించాం కదా! ఎవరో కొంతమంది వచ్చి కి ఉన్నారట— వాళ్ళని నువ్వోసారి చూసి వాళ్ళలో మూడు జంటలని సెల చెయ్యాలి"

చౌదరిగారి మాటలకు ఆశ్చర్యపోయాడు భార్గవ.

'పని' అంటే ఏదో మామూలు పని అనుకున్నాడు కానీ యిం బాధ్యత తన మీద పెడతాడనుకోలేదు.

"సార్! ఇలాంటి విషయాలు నాకేం తెలుస్తాయి సార్? మీర సరిగ్గా సెలక్టు చేస్తారు" వినయంగా అన్నాడు.

"నేను ఇదివరకులాగా వున్నట్టయితే నేనే చేసేవాడిననుకో-ఇప్ప నా పరిస్థితి నీకూ తెలుసు కదా! ఆ హాలులోకెళ్ళి నేను వాళ్ళని ఇంటర్వ్యూ చెయ్యలేను.

అలాగని వాళ్ళనిక్కడికి పిలిపించడం నాకిష్టం లేదు.

ముక్కూ మొహం తెలియని వాళ్ళని బెడ్రూంలోకి పిలవలేం కదా!

అదీ నిజమే!

ఇటు అయినా వెళ్ళలేరు -అటు వాళ్ళని ఇక్కడికి పిలవనూ లేరు

"పోనీ మేనేజర్‌గార్ని పిలవమంటారా సార్?"

మార్గాంతరం సూచిస్తూ అన్నాడు భార్గవ.

"శర్మకి జ్వరంగా ఉందట—ఈ రోజు రానని ఫోన్ చేశాడు. అయి ఇందులో యింతగా జంకేదేముంది చెప్పు? నీకూ నటన అంటే తెలుసు- వెండి తెరమీద వెలిగిపోవాలంటే నటనతోపాటు అందం కూడా అవసరమే అన్నదీ తెలుసు నీకు. ఇంక నువ్వెళ్ళి సెలక్టు చెయ్యడంలో కష్ట ఏముంది? నిజానికి ఇలాంటి పనులు నేనే స్వయంగా చూసుకునేవనుకో.... ఈసారికి మాత్రం నిన్ను చెయ్యమంటున్నాను"



అదీ అభ్యర్థన కాదు.

ఆజ్ఞ.

ఆ పనికి ఆయన తన్ని నియమించడం ద్వారా తనంటే వున్న నమ్మకాన్నీ, తన సమర్థత-పట్ల ఆయనకున్న విశ్వాసాన్నీ తల్చుకునే సరికి కొంత గర్వంగానే అనిపించింది భార్గవకి.

"మీరంతగా చెప్తే కాదంటానా సార్? కానీ ఓ చిన్న విషయం సార్"

నాన్చాడు భార్గవ.

"చెప్పవోయ్! ఏమిటది?"

ధైర్యం ఇస్తూ అడిగాడాయన.

"మరేం లేదు సార్! పోయిన మన డ్రయివరున్నాడు కదా సార్, అతని భార్య సీత నిన్నటి నుంచీ కనిపించట్లేదట. మీరు రమ్మన్నారని చెప్పి యింటి నుండి బయుల్దేరిందట...."

కొద్దిగా నట్టు కొట్టాడు భార్గవ.

"అవునోయ్! సీత నిన్న మధ్యాహ్నం పన్నెండుంపావుకి ఇక్కడికి వచ్చింది. ఆమెకి వేషం ఇచ్చి ఎడ్వాన్సుగా పదివేలు కూడా ఇచ్చాను. ఆ డబ్బుతో ఆమె నిన్న మధ్యాహ్నమే వెళ్లిపోయిందే!" ఆశ్చర్యంగా అన్నాడాయన.

"ఆమె ఇక్కడి నుండి డబ్బుతో బయుల్దేరిందా?" మళ్ళీ రెటించాడు భార్గవ.

"నేను ఏ పిక్చర్ని బుక్ చేసుకున్నా ఎడ్వాన్సివ్వకుండా చేసుకోననే విషయం నీకూ తెలుసు కదా! అసలు సీతకి ఈ సినిమా ఫీల్డు కొత్త వేరే

ఎక్కడయినా ఉద్యోగం ఇప్పించాలనుకున్నాను. కానీ ఆమెకి చదువేలేదు. ఫోటోజెనిక్ ఫేస్ కదా అని ఆమెని తీసుకున్నాను. కుటుంబ పోషణకి ఆమెకీ ఓ దారి చూపాలి కదా!"

"కానీ సీత యింతవరకూ ఇంటికి రాలేదు సార్...."

"నువ్వు చెప్తుంటే నాకూ ఆశ్చర్యంగానే వుంది. చేతిలో డబ్బుంది కనుక ఎవడయినా ఆ డబ్బుకి ఆశపడ్డాడో, లేక ఆమే తనంత తానుగానే ఆ డబ్బుతో ఎక్కడికయినా వెళ్లిందో లేక ఈపాటికామె ఇంటికి వచ్చేసిందో మనకి తెలియదు కదా! నువ్వో పని చెయ్యి. ఈ ఇంటర్వ్యూ అయిపోగానే ఓసారి సీత యింటికి వెళ్లి చూడు. ఆమె యింకా రాకపోతే ఎందుకయినా మంచిది పోలీసు రిపోర్టియ్యి. అసలే ఈ రోజుల్లో ఆడవాళ్ళమీద అత్యాచారాలు పెరిగిపోతున్నాయి" అన్నాడు చౌదరి.

ఆ గొంతులో స్త్రీలపట్ల జాలి, సానుభూతీ నిండుగా ధ్వనిస్తోంది.

నిజానికి చౌదరి తీసే సినిమాల్లో స్త్రీల సమస్యలే ముఖ్యమైన అంశాలుగా వుంటాయి.

స్త్రీ అంటే మగాడికి విలాస వస్తువు కాదనీ, ఆమెకూడా పురుషుడితో సమంగా అన్ని రంగాల్లోనూ ముందుకొచ్చి సమాన హక్కుల్ని అనుభవించాలనీ ఆయన సినిమాలు ప్రబోధిస్తూనే వుంటాయి.

"అలాగే సార్! ఈ పని అయిపోగానే అక్కడికే వెళ్తా"

"చూడు భార్గవా! సీత అంటే మన కింద పనిచేస్తున్న ఓ అమాయకురాలు మాత్రమే కాదు, మననే నమ్ముకుని బ్రతికి, డ్యూటీచేస్తూనే మరణించిన ఓ విశ్వాసపాత్రుడి భార్య. కనక సీత బాధ్యతని మనం మొక్కుబడిగా మాత్రం అనుకోకూడదు."



"తప్పకుండా సార్! సీత ఇంటికింకా వచ్చి ఉండకపోతే తప్పకుండా పోలీసు రిపోర్టిస్తాను."

అక్కడి నుండి లేచి కిందికొచ్చాడు భార్గవ.

ఆ ఆరు జంటల్లోనూ తనకు నచ్చిన, అర్హులుగా తనకనిపించిన మూడు జంటల్ని సెలక్టు చేశాడు భార్గవ.

వాళ్ళ విషయం ఇంటర్‌కమ్‌లో చౌదరిగారితో మాట్లాడాడు.

వాళ్ళని మర్నాడు రమ్మనీ, ఎగ్రిమెంటు రాసుకోవచ్చనీ అన్నాడు చౌదరి.

అవే మాటలు వాళ్ళకి చెప్పి పంపించేసి సీత ఇంటికి దారితీశాడు భార్గవ.

*  *  *  *

సీత ఇంకా ఇంటికి రాలేదు.

దిక్కులేని పక్షుల్లా ఉన్న ఆమె బిడ్డల్ని చూసేసరికి గుండె తరుక్కుపోయింది భార్గవకి.

సీత విషయం పోలీసు రిపోర్టివ్వడానికి స్టేషనుకి వెళ్ళాడతను.

అక్కడ డ్యూటీలో వున్న ఇన్‌స్పెక్టర్ మురళిని చూస్తూనే ఆశ్చర పోయాడతను.

తనూ, లైలా పార్కులో అతని కళ్ళబడ్డారనే విషయం మనసులో మెదిలేసరికి కాస్త ఇంగుతిన్నట్టయ్యాడు.

అయితే అంతలోనే తన్ని తాను నిలదొక్కుకుంటూ మురళిని విష్ చేశాడు భార్గవ.

కేసు వివరాలు వింటూనే సీతని మిస్సింగ్ పర్సన్‌గా ట్రీట్ చేస్తూ కేసు బుక్ చేశాడు మురళి.

మురళీతో మాట్లాడుతున్న కొద్దీ అతని సమర్థత మీద నమ్మకం పెరిగింది భార్గవకి.

అ స్టేషను మెట్లు ఎక్కేటప్పుడు ఎంత వర్రీడ్‌గా ఎక్కాడో, అంతకంటే రిలీఫ్ ఫీలవుతూ మెట్లు దిగాడు భార్గవ.

సీత ఫోటో ఒకటి కావాలన్నాడు ఇన్‌స్పెక్టర్ మురళి.

సీత ఇంట్లో గోడకున్న సీత ఫోటో మురళికిచ్చి వచ్చేశాడు భార్గవ.

* * * *

"అయామ్ ఇన్‌స్పెక్టర్ మురళి. ఒక కేసు విషయంలో మీ నుంచి కొన్ని వివరాలు కావాలి...."

అర్థోక్తిగా ఆగాడు మురళి.

"చెప్పండి—మీకే వివరాలు కావాలి?"

చిరునవ్వుతో అడిగాడు చౌదరి.

"అఫ్‌కోర్స్! మీకు హెల్త్ కూడా అంతగా బాగోలేదని తెలుసు నాకు మీకు మరీ ఎక్కువ ట్రబులీయను" మళ్ళీ అన్నాడు మురళి.

"నాకు అనారోగ్యం అంటూ పెద్దగా లేదు. విరిగిన కాలు అతుక్కోవడం అనేది టైముతో కూడిన అనారోగ్యం. అది మినహాయిస్తే నేను పూర్తి ఆరోగ్యంతోనే వున్నాను. కనుక మీరు అడగాలనుకున్న ప్రశ్నలు వేయచ్చు" అన్నాడు.

చెక్కు చెదరని చిరునవ్వు చౌదరి పెదాల మీద.

"డాక్టరు నీలకంఠంగారు మీకు తెలుసా?"

సూటిగా చౌదరి కళ్ళలోకి చూశాడు ఇన్‌స్పెక్టర్.

"నీలకంఠం నాకు తెలుసు"

నిబ్బరంగా అన్నాడు చౌదరి.

"ఎలా తెలుసు?"



"ఎలా ఏముందీ, ఆయన ఓ డాక్టరుగా, నేనాయన పేషెంటుగా మా పరిచయం జరిగింది."

"కాస్త వివరంగా చెప్తారా?"

"నాకు జరిగిన యాక్సిడెంటు గురించి మీకు తెలుసనుకుంటాను" అర్థోక్తిగా ఆగాడు చౌదరి.

"మీరు అవుట్‌డోరు షూటింగు కెళ్ళి వస్తూంటే యాక్సిడెంట్ జరిగినట్టుగా చదివాను నేను పేపర్లో."

"అవును. అప్పుడు నన్ను ట్రీట్ చేసిన డాక్టర్లలో ఒకరు డా॥ నీలకంఠం."

"ఐసీ....ఆయన రెండు రోజుల క్రిందట ఓ హోటల్లో బాత్రూంలో కాలుజారి పడి మరణించారు. తెలుసా?"

"చదివాను. మొన్న అన్ని పేపర్లలోనూ ఈ విషయం రాశారుగా. చదివి చాలా బాధపడ్డాను."

చౌదరి కళ్ళలోంచి జాలి, సానుభూతి వర్షిస్తున్నాయి.

వృత్తిరీత్యా ఎందర్నో కలుస్తుంటాడు మురళి.

ఎదుటి వ్యక్తి నిజం చెప్తున్నదీ లేనిదీ అతని కళ్ళలోకి చూసి చెప్పెయ్యగలడు. అది అతనికి అభ్యాసంవల్ల వచ్చిన నేర్పు.

చౌదరి మొహంలోని భావాలని చూసి అనుకున్నాడు—ఇతనికీ విషయంలో ఏమీ తెలియకపోయి వుండాలి. లేదూ మహా అద్భుతంగా నటించేస్తూండి వుండాలి అని.

"ఆయన మిమ్మల్ని కలిశారా మొన్నటి రోజున?"

"కలిశారు. నా ఆరోగ్యం ఎలాగుందో కనుక్కోడానికొచ్చారు. అసలు నేనే ఆయనకి ఫోన్ చేసి పిలిపించాను. నా కాలి విషయంలో అడిగి తెలుసుకుందామని. ఆయన మొన్న నా కాలు చెక్ చేశారు."

"ఏమన్నారు?"

"ఇంప్రూవ్‌మెంట్ ఉందన్నారు. ఆయన నోటి నుండి ఆ మాట విన్నాకే నాకూ ధైర్యం అనిపించింది."

"అంటే ఇన్నాళ్ళూ భయపడ్డారా?"

"అవును. ఒక వయసు దాటాక విరిగిన ఎముక అతుక్కోవడం అనేది చాలా కష్టం అని మీకూ తెలుసనుకుంటాను. ఇన్ని రోజులూ నాకు అదే భయం. నీలకంఠంగారొచ్చి చెక్ చేసి అలా చెప్పాకనే నాకు భయం పోయింది."

"మీ భార్యా, పిల్లలూ కూడా బాగా భయపడి వుంటారు"

"నాకు భార్య మాత్రమే వుంది. పిల్లల్లేరు. అఫ్‌కోర్స్! నా భార్య చాలా భయపడింది. మొన్న రాత్రి నుండీ మాత్రమే ఆమె నిశ్చింతగా నిద్ర పోగలుగుతోంది."

"మీ భార్య పేరు?"

"లైలా. ఒకప్పుడామె మిస్ లైలా ముఖర్జీ. ఒకసారి నా కలకత్తా ట్రిప్పులో ఆమెని కలవడంతో ఆమె మిసెస్ లైలా చౌదరి అయి పోయింది."

"లవ్ ఎట్ ఫస్ట్ సైట్ అన్నమాట"

చిన్నగా నవ్వాడు ఇన్‌స్పెక్టర్.

ఆ నవ్వు అతని పెడల్పయిన మొహానికి కొత్త అందాన్నివ్వడమే కాదు, అంతవరకూ అతన్ని కాకీ దుస్తుల ఆఫీసరుగానే చూస్తున్న చౌదరి కూడా అతన్ని సన్నిహితుడ్ని చేసింది.

"మీ వయసులో ఆ మాట వాడ్డం సబబు. కానీ నా వయసులో కొద్దిగా అదోలా వుంటుందేమో. కానీ నిజం మాత్రం అదే. ఆమె శరీరమే



కాదు-అంతరంగమూ అందమైనదే. ఆమె సౌశీల్యం చూస్తే మీరే ఆశ్చర్య పోతారు.

భార్య ప్రసక్తి రాగానే, ఆమె తలపుల్లో మెదలగా తన్మయంగా అన్నాడు చౌదరి.

"అవును. ఆమె సౌశీల్యం చాలా చెప్పుకోదగ్గదే"

పార్కులో తాను చూసిన భార్గవ, లైలాల జంట-వాళ్ళ మాటలు మనసులో మెదుల్తూండగా అన్నాడు మురళి.

అయితే అతని మాటల్లో ఏమాత్రం వెటకారమూ ధ్వనింప నియ్య లేదు.

"ఆవిడని మీరు చూసినట్టే చెప్పేస్తున్నారే"

చమత్కారంగా నవ్వాడు మురళి.

"కావలసినంత లోకజ్ఞానం ఉన్నవారు మీరు. అలాంటి మిమ్మల్ని, మీ మనసునీ ఆకట్టుకోగలిగిన స్త్రీ గూర్చి చెప్పాలంటే ఆమెని చూడనవ సరం లేదనుకుంటాను"

"మీరు చాలా తెలివయినవాళ్ళు ఇన్‌స్పెక్టర్‌గారూ"

మెచ్చుకోలుగా అన్నాడు చౌదరి.

"మీకో ఏకీభవించినంత మాత్రాన తెలివయినవాడిగా అనుకుంటే ఎలా? మీతో డిఫరెన్సు వచ్చినప్పుడు కూడా మీరు నా తెలివిని మెచ్చుకునేలా చెయ్యగలిగితే అదీ నా ప్రత్యేకత."

"మిమ్మల్ని మాటల్లో గెలవడం కష్టం" అన్నాడు చౌదరి.

"మా పోలీసువాళ్ళని చేతల్లో గెలవడం కూడా సాధారణంగా కష్టమే" నవ్వుతూనే అన్నాడు మురళి.

"అబ్బో! అసాధ్యులండీ మీరు. చెప్పండి మీకేం వివరాలు కావాలి ఇంకా?"

"ఏం నా ప్రజెన్సు అంత కష్టంగా ఉందా? ఎప్పుడు వెళ్ళిపోతానా అని చూస్తున్నారా?"

"ఓ.కే. బాబూ! మీ ఇష్టం. మీరున్నా వెళ్ళినా మీ ఇష్టం"

"నాకిలా పన్లున్నాయి వెళ్ళిపోవాలిలెండి. డాక్టరు నీలకంఠం గూర్చి మీరింకేవన్నా వివరాలివ్వగలరా?"

"అంటే?"

"అంటే....ఆయన వ్యక్తిగత వివరాలు, ఆయనిక్కడికొచ్చిన పని విషయం, ఆయన కెవరయినా శత్రువులున్నారా? ఇలాంటివి....మీకేదయినా పనికొచ్చే సమాచారం చెప్పగలిగితే మా ఇన్వెస్టిగేషనుకి సాయపడ్డవారవుతారు."

"నేనప్పుడు జాయిన్ అయిన హాస్పిటల్ లోనే తప్ప అంతకుముందు నాకాయన్తో పరిచయంలేదు. కనుక ఆయన గూర్చి నాకెక్కువగా తెలియదు. ఆయనిక్కడికి ఎందుకొచ్చారో కూడా తెలియదు.

ఈ ఊరు రాకముందు ఆయన నాకుతెలిదు. ఇక్కడికొచ్చాకే ఫోన్ చేశారు. కనుక ఆయన యిక్కడికి ఏ పనిమీదొచ్చారో కూడా చెప్పలేను.

కేవలం నాకోసమే రాలేదని మాత్రం చెప్పగలను. పోతే ఆయన చాలా మంచి మనిషి.

పైగా వైద్య వృత్తిలో ఉన్న మనిషి. అలాంటివాడిని చంపడానికి ఎవరికయినా ఎలా చేతులొచ్చాయో!"

ఒక్కసారిగా సూటిగా చూశాడు ఇన్స్పెక్టరు.

ఆ కళ్ళు చౌదరిని చీల్చి చూస్తున్నట్టుగా ఉన్నాయి.



"చౌదరిగారూ! డాక్టరు నీలకంఠం బాత్ రూమ్ లో కాలుజారిపడి మరణించారు అని మాత్రమే అన్నాన్నేను. అది హత్యో, ఆత్మహత్యో, ప్రమాదవశాత్తు సంభవించినదో ఆ వివరాలేవీ చెప్పలేను నేను.

కానీ మీరు 'చంపడానికి చేతులెలా వచ్చాయో' అన్నారు. అంటే నీలకంఠంగారు హత్య చెయ్యబడే మరణించారంటారా?"

కానీ చౌదరిలో పీసమెత్తయినా తొట్రుపాటు కనిపించలేదు.

ఎప్పటిలాగే చిరునవ్వులు చిందిస్తూ అన్నాడు-

"మీ పోలీసుల కళ్ళకి అందరూ అనుమానితుల్లాగే కనపడ్డంలో ఆశ్చర్యం లేదు. అందుకే మీరలా అనుకుంటున్నారు. మీరిప్పుడు చెప్తున్నదే ఫస్ట్ ఇన్ఫర్మేషను కాదు నాకు. నిన్నటి నుండి అన్ని పేపర్లలోనూ ఈ వార్త ప్రముఖంగా వచ్చింది. చాలా వాటిలో ఆయనది హత్య అన్న అభిప్రాయమే ఉంది. కాకపోతే అది యాక్సిడెంటల్ డెత్ అయి ఉండాలి తప్ప ఆత్మహత్య చేసుకోవాలనుకున్న వాళ్ళెవరూ బాత్ రూమ్ లో కాలు జార్చుకుని మెడ విరగ్గొట్టుకుని చావరు కదా! మరో విషయం, ఆయన నన్ను ట్రీట్ చేసిన డాక్టరు. ఇంకా నా కోసం శ్రద్ధతీసుకుంటూన్న డాక్టరు, కాలు విరిగి మంచానపడ్డ నాలాంటివాడికి ఆయనతో ఎంతయినా అవసరం ఉంది. ఆయన చావుని కోరుకోను నేను. అలాంటిది ఆయన్ని హత్య చేశానేమో అని నన్ను అనుమానిస్తూ మాట్లాడ్డంలో పోలీసు బుద్ధి కనిపిస్తోందే తప్ప రీజనింగు లేదు."

ఆ మాటలు వింటూన్న ఇన్స్పెక్టరు మొహంలో భావాలు క్షణాల్లో మారిపోయాయి.

అవును. చౌదరి చెప్తున్నది నిజమే!

వైద్యం చేస్తూన్న డాక్టరు చావుని కోరుకోడు ఏ పేషెంటయినా.

"మీరు చెప్పినట్టు ప్రతివాడినీ అనుమానించడం మా వృత్తి లక్షణ
డ్యూటీలో ఎన్నోసార్లు అమాయకులని కూడా అనుమానించాల్సి వస్తుం
దీనికి మీరేమీ అనుకోనవసరం లేదు. వస్తాను. విష్ యు స్పీడీ రికవ

టేబిల్ మీదుంచిన క్యాప్ చేత్తో అందుకుని లేచి నిలబడ్డాడు ము

"అప్పుడప్పుడూ వస్తూండండి ఇన్స్పెక్టరుగారూ!"

చౌదరి చిరునవ్వుతో అన్నాడు.

"మురళిగా రావాలని కోరుకోండి తప్ప ఇన్స్పెక్టరుగా దూరంగ
ఉండాలని కోరుకోవడం మంచిది. ఓ.కే! బై"

నాలుగడుగులు వేసి చటుక్కున వెనుతిరిగాడు మురళి.

తిరిగి వెనక్కొచ్చి మంచానికి దగ్గరగా నిలబడ్డాడు.

"మర్చిపోయాను. సీత అని చనిపోయిన మీ డ్రైవరు భార్య
దగ్గరకొచ్చినప్పటి నుండీ కనిపించట్లేదని మాకు రిపోర్టు వచ్చింది."

"ఆమె నన్ను కల్సినమాట నిజమే! ఆమెకి ఎడ్వాన్సు ఎమౌం
యిచ్చి ఎగ్రిమెంట్ కూడా రాయించుకున్నాను. ఆ ఎగ్రిమెంట్ కాగితా
మా మేనేజర్ దగ్గరుంటాయి. మీక్కావాలంటే వెరిఫై చేసుకోవచ్చు. నే
బుక్ చేసుకున్న ఆర్టిస్టు మాయం అయిందంటే ఆ నష్టంలో నాకూ
ముంటుంది. భార్గవతో నేనెప్పుడో చెప్పాను పోలీసు రిపోర్టివ్వమని. అ
విషయమూ నాకు తిరిగి చెప్పకపోతే, ఆమే యింటికొచ్చేసి ఉంటుం
కున్నాను. అయితే ఆమె దొరకలేదన్నమాట.

ఇన్స్పెక్టరుగారూ! సీత భర్త నా దగ్గరే పనిచేస్తూ మరణించా
కనుక సీత బాధ్యత నాదే.



ఆమె వివరాలు చెప్పగలిగిన వాళ్ళకి పదివేలు బహుమానం నేని
స్తాను! దయచేసి ఈ విషయం మీరు ఎనౌన్స్ చేయండి. ముందు సీత జాడ
కనుక్కోండి."

చౌదరి మాటల్లో సీత యోగక్షేమాలపట్ల బాధ్యత, శ్రద్ధ కనిపిస్తు
న్నాయి.

"ఓ.కే! మీరు చెప్పినట్టే ఎనౌన్స్ చేయిస్తాను. మరో విషయం. మీ
యాక్సిడెంట్ మీ మీద పగతోనో, ద్వేషంతోనో ఎవరో చేయించింది కాదం
టారా?"

"ప్రతిదాన్నీ మరీ ఇలా భూతద్దంకింద చూస్తూంటే బ్రతకడం కష్టం
మురళిగారూ! జరిగిన యాక్సిడెంట్‌లో నా డ్రైవర్ ప్రాణాలు కోల్పో
యాడు. అతను నాకెంతో నమ్మకమయినవాడని నేను ముందే చెప్పాను.
ఎవరి దగ్గరో డబ్బు తీసుకుని కారుకు ఏక్సిడెంట్ చేసినా, ప్రాణాలు
పోగొట్టుకోడుగా నా డ్రైవరు. కనుక నాకిందులో ఎంతమాత్రమూ ఎవరి
మీదా అనుమానం లేదు. మీరుమాత్రం సీత జాడ వెంటనే కనుక్కోండి.
లేకపోతే ఆమె పిల్లల ఉసురు నాకు తగుల్తుంది."

"ఆ విషయంలో నిశ్చింతగా ఉండండి మీరు. అది మా డ్యూటీ.
వస్తాను. మీకు మళ్ళీ ఫోన్ చేస్తాను."

బూట్లు టకటకలాడించుకుంటూ వెళ్ళిపోయాడు ఇన్స్పెక్టర్.

ఆ వెళ్ళడం వెళ్ళడం స్టేషనుకి వెళ్ళాడు మురళి.

అతని రాక గమనిస్తూనే సిబ్బంది అంతా ఎటెన్షన్‌లో నిలబడ్డారు.

తిన్నగా లోపలి తన గదిలోకి వెళ్ళి టేబుల్ ముందు కూర్చున్నాడు
మురళి.

క్యాప్ తీసి టేబుల్ మీద పెట్టి విశ్రాంతిగా కుర్చీలో వెనక్కి వాలాడు.

గ్లాసుతో చల్లటి నీళ్ళుతెచ్చి టేబుల్ మీద పెట్టాడు హోమ్‌గార్డు.

ఆ గ్లాసందుకుని నీళ్ళు గడగడా తాగేశాడు.

ఖాళీగ్లాసు టేబుల్‌మీదుంచుతూ పిలిచాడు మురళి.

"ఏయ్ టూ నాట్ వన్" అంటూ.

"సార్" అంటూ పరిగెట్టుకొచ్చాడు టూ నాట్ వన్".

"ఆ నీలకంఠం పోస్టుమార్టం రిపోర్టు వచ్చిందా?"

"వచ్చింది సార్, బీరువాలో పెట్టాను."

గబగబా బీరువా దగ్గరకెళ్ళి ఆ రిపోర్టు తీసి ఇన్స్‌పెక్టరు ముందు టేబుల్ మీదుంచాడు టూ నాట్ వన్.

రిపోర్టు చేతుల్లోకి తీసుకుని చదవడం మొదలెట్టాడు మురళి.

మృతుడి పేరు : నీలకంఠం.

వయసు : 45, 50 సం॥ల మధ్య

మరణించిన సమయం : రాత్రి 12-1 మధ్య.

డిలే డ్యూటీ హెడ్ ఇంజరీ అండ్ హెమరేజ్.

మరణానికి కారణం : తల వెనకాల తగిలిన గాయం. విషప్రయోగం జరిగిన సూచనలేవీలేవు.

మరణించడానికి ముందు మృతుడు ఏ మత్తుపానీయాలూ సేవించలేదు. పూర్తి ఆరోగ్యంతో ఉన్నాడు.

జీర్ణాశయం తాలూకు రిపోర్టు భాగం చదివాడు మురళి.

మరణించడానికి ముందు రాత్రి మృతుడు భోజనంచేసి 2, 3 గంటలవుతోంది.

రిపోర్టు పక్కన పెట్టేశాడు.

మళ్ళీ ఓసారి మననం చేసుకోసాగాడు మురళి.



పోస్టుమార్టం రిపోర్టువల్ల కొత్తగా తెలిసిన సమాచారం ఏమీలేదు విషప్రయోగం జరగలేదన్నది తప్ప.

తల విదిలించాడు మురళి.

డ్రాయర్ తెరిచాడు.

నేర స్థలంలో తీసిన ఫోటోల కవరు ఓ పక్కగా ఉంది.

దాన్నందుకుని తెరిచాడు.

గోడ దగ్గరగా వెల్లకిలా పడున్నాడు నీలకంఠం.

తల దగ్గరంతా రక్తం మడుగులా కట్టివుంది.

కళ్ళు తెరిచే ఉన్నాడు.

బాధతో మొహం చిట్లించినట్టుగా ఉంది.

పదే పదే ఆ ఫోటోలు చూశాడు మురళి.

చివరికో ఆలోచనకి వచ్చాడు.

నీలకంఠం వృత్తిరీత్యా డాక్టరు.

అతని చేతిలో ప్రాణాలు కోల్పోయిన వ్యక్తి తాలూకా వాళ్ళెవరయినా పగబట్టి హత్య చేశారేమో అనుకునే ఛాన్సులేదు.

ఎందుకంటే అతను జనరల్ సర్జను కాదు. బోన్ స్పెషలిస్టు.

ముఖ్యంగా విరిగిన ఎముకల్ని అతికించడంలో అతని నేర్పు అద్వితీయం.

అతనేదయినా కేసులో ఫెయిలయి వున్నా, ఆ పేషెంటుకి ఎముకల విషయంలో ప్రాబ్లెమ్ ఎదురుకావచ్చు తప్ప ఏకంగా చావే వచ్చెయ్యదు.

పేషెంటుకి ప్రాణ నష్టం కలిగే ఛాన్సులు తక్కువ.

పైగా నీలకంఠానిది ఊరు కాదు.

అతనికి శత్రువులంటూ ఉన్నా, వాళ్లు ఈ పరాయి ఊళ్ళో అతన్ని చంపారనుకోడం తెలివి తక్కువగా అనిపించింది.

అసలు అతన్ని హత్య చెయ్యడమే జరిగుంటే హంతకుడు అ రాత్రివేళ అతను ఒంటరిగా దొరికినప్పుడు ఏ రివాల్వర్ పెట్టి కాల్చో, ఏ కత్తితోనో పొడిచో చంపుతాడు తప్ప ఇలా ప్రమాదవశాత్తూ జరిగిన చావేమో అనే సందేహానికి ఆస్కారం కలిగే రీతిలో చంపడు.

పైగా నీలకంఠం హంతకుడితో పెనుగులాడిన సూచనలేవీ లేవు.

నిజానికి 'అక్కడ నీలకంఠం తప్ప మరో మనిషి వున్నాడన్న సూచనలే లేవు.

సో.... ఇదీ నిజంగా ప్రమాదవశాత్తూ జరిగిన మరణమే అయ్యుంటుంది.

రాత్రివేళ నీలకంఠానికి బాత్రూం కెళ్ళాల్సిన అవసరం వచ్చుండవచ్చు.

నిద్ర కళ్ళతో నడిచొస్తూ కాలు స్లిప్పయి పడిపోయుంటారు. అ పదదంతో తల గోడకి, గోడ అంచుకి కొట్టుకుని ఉండచ్చు. వెంటనే తల పగిలి మరణం సంభవించి వుండవచ్చు.

అలాకాక నీలకంఠాన్ని చంపే అవసరం, అవకాశం ఎవరికీ కలిగి ఉండదనిపించింది.

ఈ అభిప్రాయానికి రాగానే ఇన్‌స్పెక్టర్ ఆలోచనలు చల్లబడ్డాయి.

"కానీ ... మరోసారి ఆ హోటల్‌కెళ్ళి నీలకంఠం బసచేసిన గదిని చూడాలనిపించింది.

అలా చూడటం వల్ల ఏ ప్రత్యేక ప్రయోజనమూ నెరవేరదు.



కానీ.... నేరం జరిగిన స్థలాన్నీ, ఆ పరిసరాల్నీ మరోసారి చూసి రావడంవల్ల ఏదయినా ఉపయోగం ఉండచ్చనే ఆశ అతనిలో మెదిలింది.

క్యాప్ తలమీద పెట్టుకుని జీపులో బయల్దేరాడు ఇన్‌స్పెక్టర్ మురళి.

ఎక్కడికి పోనివ్వాల్సిందీ డ్రయివర్‌కి చెప్పాడు.

హోటల్ ముందాగింది జీపు.

అంతవరకూ ఏవో ఆలోచనల్లో తేలిపోతున్న ఇన్‌స్పెక్టర్ ఒక్కసారిగా ఈ లోకంలోకొచ్చి పడ్డాడు.

రివ్వున జీపు దిగి టకటకా బూట్లు చప్పుడు చేసుకుంటూ లోపలికి నడిచాడు.

యూనిఫారమ్‌లో వస్తూన్న పోలీస్ ఆఫీసర్ని చూడగానే హోటల్ సిబ్బంది వినయంగా లేచి నిలబడ్డారు.

మురళి ఆ కేసు దర్యాప్తు చేస్తున్న పోలీసు ఆఫీసరని వాళ్ళకి తెలుసు.

నీలకంఠం మరణించిన గదిలోకి తిన్నగా నడిచాడు మురళి.

గదీ లోపలకొస్తూనే తలుపులు దగ్గరగా మూసి పెట్టాడు.

తనొక్కడూ ఆ గదిలోపల అణువణువూ గాలించడం మొదలు పెట్టాడు.

తను దేని కోసం వెతుకుతున్నాడనేది అతనికే తెలియదు.

కానీ దర్యాప్తుకి ఉపయోగించే ఏదో ఓ ఆధారం దొరుకుతుందనే ఆశ అతన్నలా వెతకమంటోంది.

గది గాలించడం పూర్తయ్యింది.

ఆ రోజున నీలకంఠం మరణించిననాటి లాగానే వున్నాయి ఆ గదిలోని వస్తువులన్నీ.

ఏదీ కదిపిన జాడ లేదు.

ఏ క్లూ కూడా దొరకలేదు.

నెమ్మదిగా బాత్రూంవైపు నడిచాడు మురళి.

ఆ బాత్రూం లోపలికి అడుగు పెడుతూండగానే అతనికా
దృశ్యం మదిలో మెదిలింది.

నీలకంఠం శవం ఇంకా అక్కడ పడివున్నట్టే అనిపిస్తోంది.

బాత్రూం తలుపు వైపు తలా, మరోవైపు కాళ్ళూ పెట్టి
పోయాడు నీలకంఠం.

బాత్రూంలోకి వస్తూనే కాలు జారి ఉంటుందతనికి.

అమట్టున జారిపడి వుంటాడు.

అందుకే వెల్లకిలా పడివున్నాడు.

ఆ పడటంలో తల గోడకి కొట్టుకుని వుంటుందన్న పాత అ
భిప్రాయమే అతనిలో క్షణ క్షణానికి బలపడసాగింది.

ప్రమాదవశాత్తు సంభవించిన ఓ మామూలు చావుకి హత్య అ
రంగు కళ్ళద్దాలతో చూస్తూ పొరబడుతున్నాననే భావం అతనికి ఎక్కువ
తోంది.

'బహుశా ఇలా వచ్చి ఉంటాడు. ఇక్కడ యిలా కాలుజారి వుం
వచ్చు.'

ఆ రాత్రి జరిగిందాన్ని కళ్ళముందు చిత్రీకరించుకుంటూ అంద
అనుగుణంగా తనూ కాలుజారి పడ్డాడు మురళి.

ఆ పడిపోవడంలో ఆసరా కోసం గోడ పట్టుకోబోయాడు.

నున్నగా జారిపోయింది చెయ్యి గోడ నునుపుకి.



అతని తల గోడకి కొట్టుకుంది. వెనకాల యింత బొప్పి కట్టింది ఆ దెబ్బతో.

అయితే బొప్పి మాత్రమే తప్ప నెత్తురు బొట్టుకూడా చిందలేదు.

తళుక్కున ఓ ఆలోచన మెరిసింది అతని బుర్రలో-

ఇప్పుడు తను కావాలనే పడ్డాడు కనక కాస్త నెమ్మదిగా పడుండవచ్చు-అనుకోకుండానే అయినా?

అయితే నీలకంఠం నిద్రమత్తులో పడ్డాడు కనక మరికాస్త బలంగా పడుంటాడు.

కానీ ఏ కాస్త నెత్తురు చిందే గాయమో అవ్వాలి తప్ప ప్రాణాంతకమైన దెబ్బ తగిలి శవంగా మారాడనుకునే ఛాన్సులేదు.

పైగా గోడల నునుపు కూడా ఇందాకనే తనకి అనుభవంలోకి వచ్చింది.

ఇంత నున్నటి గోడ తలకి కొట్టుకుని ప్రాణం తీసిందనుకొనే వీలు లేదు.

సో.... ఇది యాక్సిడెంట్ ఎంత మాత్రమూ కాదు- కానే కాదు.

ఇది హత్య....

ముమ్మాటికీ హత్యే!

రెట్టించిన ఉత్సాహంతో బాత్రూం కూడా శోధించడం మొదలుపెట్టాడు.

కానీ.... కానీ.... ఈసారి కూడా అతని శ్రమ బూడిదలో పోసిన పన్నీరే అయ్యింది.

నిరాశగా వెనుతిరగబోతూన్న మురళి కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి.

బాత్రూం తలుపుకి లోపలవేపు పడ్డ రక్తంతో తడిసిన వేలిముద్రలని చూడగానే ఒక్క అంగలో తలుపు దగ్గరికి వేసి పరిశీలనగా చూశాడు మురళి.

ఆ వేలిముద్రలు వేళ్ళ చివరి భాగాల్ని మాత్రమే చూపిస్తున్నాయి.

రక్తంతో పడ్డ చేతి ముద్రలని, ఎర్రగా ఎండిపోయి జేగురు రంగులో వున్నాయి.

ఆ ముద్రలు ఎలా పడివుంటాయా అని ఆలోచించాడు మురళి.

మరో నిమిషంలో అతనికి తట్టింది.

రక్తంతో తడిసిన చేత్తో ఆ తలుపుని పట్టుకుని వుంటారు రూంలో వుండి.

ఫలితంగా వేళ్ళ చివరి భాగాల గుర్తులు పడ్డాయి తలుపు బయట.

బహుశా ఆనాడు హత్య జరిగాక రక్తం చేత్తో ఎవరో ఆ తలుపు మీద చెయ్యి వేసి వుంటారు.

హత్య చేసిన వాళ్ళు అది గమనించి వుండరు.

వాళ్ళది గమనించి వుంటే ఎప్పుడో అక్కడ కడిగేసి వుండేవారు.

ఆ రక్తపు ముద్రల మీద వేళ్ళ గుర్తులు సులువుగా తెలుస్తూనే వున్నాయి.

హంతకుడు ఎంత తెలివిగా ప్రవర్తించినా....

ఎక్కడో ఓ చోట బురదలో కాలేస్తాడు.

అలా కానట్టయితే ఎన్నో హత్యలు అలా అన్‌సాల్వ్‌డ్‌గానే మిగిలిపోయాయి.

ఇప్పుడూ అంతే!

ప్లాన్ ప్రకారం ఎవరో ఈ హత్య చేశారు.



కాలుజారి కిందపడుతూన్నప్పుడు తల వెనకాల గాయం తగిలినట్టూ, ఆ గాయం కారణంగా నీలకంఠం మరణించినట్టూ అనుకునేలా చెయ్యడానికి వాళ్ళు కాయశక్తులా పాటుపడ్డారు.

నిజానికి వాళ్ళే గెలిచి ఉండేవారు—

ఈ ముద్రలే కనక లేకపోతే.

హంతకుడికి చేతులనిండా రక్తం అంటి ఉంటుంది.

గదిలో నిలబడి ఆ రక్తపు చేత్తో అతను బాత్రూం తలుపుని పట్టుకునుంటాడు.

ఫలితంగా వేళ్ళ చివరి భాగాల గుర్తులు పడ్డాయి తలుపు మీద.

హంతకుడు తనని పట్టించే ఆధారాలు లేకుండా చేశాడు.

కానీ ఆ మరకలతను గమనించకపోవడం వల్ల అలాగే ఉండిపోయాయి.

హంతకుడిని గుర్తించటానికి వేలిముద్రలొక అద్భుతమైన ఆధారం.

తనే విజయం సాధించానన్న ఆనందంతో మురళి కళ్ళు మెరిశాయి.

తక్షణం రూం బయటికొచ్చి, అక్కడున్న కానిస్టేబుల్‌కి వేలిముద్రల నిపుణుడిని రమ్మని ఫోన్ చెయ్యమని చెప్పాడు.

చూపులకే క్లియర్‌గా కనిపిస్తూన్న ఆ వేలిముద్రలు మరి కాస్సేపట్లో ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్ తీసిన ఫోటోల్లో కెక్కిపోయాయి.

కొద్దిసేపు ముందు ఆ గదిలోకొస్తున్నప్పుడు యాక్సిడెంటల్ డెత్‌గా అనిపించిన ఆ కేసు యిప్పుడు హత్య అని స్పష్టంగా తెలిసిపోవడమే కాక హంతకుడిని పట్టించే ఆధారాన్ని కూడా లభించేలా చేసింది.

రూమ్‌కి తాళం వేసి తనవాళ్ళందరితో కలిసి వెళ్ళిపోయాడు ఇన్స్పెక్టర్ మురళి.

ఇప్పుడతని ధ్యేయం ఒకటే....

ఆ హంతకుడిని ఎలాగయినాసరే వెదికి పట్టుకుని ఉరికంబం ఎక్కించాలన్నదే!

* * * * *

నాలుగు రోజులు గడిచాయి.

స్టేషన్‌లో కూర్చుని ఏదో పాత ఫైల్స్ చూస్తున్నాడు మురళి.

నైట్ డ్యూటీ చేస్తున్నాడేమో—

బద్ధకంగా ఉంది.

కళ్ళు మండుతున్నాయి.

అంతలోనే ఫోనొచ్చింది.

పెరేడ్ గ్రౌండ్స్ ప్రక్కనున్న సిమెట్రీ దగ్గర ఎవరో ఒక ఆడదాని శవం పడివుందని.

బద్ధకం అంతా క్షణాల మీద పోయింది.

సిబ్బందిని తీసుకుని తక్షణమే బయలుదేరాడు.

* * * * *

గుమిగూడిన జనాన్ని దూరంగా నెట్టేశారు పోలీసులు.

త్వరగా వెళ్ళి శవాన్ని సమీపించాడు మురళి.

శవం బోర్లా పడివుంది.

చెల్లాచెదురయిన జుట్టు ఆమె వీపు భాగాన్ని కప్పివేస్తోంది.

ఎర్ర చుక్కల చీర ఉందామె ఒంటిమీద.

అయితే ఆ చీర చెంగులు పైకి చెదరిపోయి పిక్కలు కనిపిస్తున్నాయి.



వెనగ్గా కనిపిస్తున్న చేతులు, కాళ్ళు, వీపు భాగం ఆమె వయసులో వున్న ఆడదని తెలియచేస్తున్నాయి.

ఆమె ఒంటి రంగు కూడా పెద్ద తెల్లగా లేదు.

చామనఛాయలోకే వస్తుందనిపిస్తోంది.

పోలీసులెంత దూరంగా తరిమేస్తున్నా జనం తోసుకుని వస్తూనే వున్నారు.

మార్నింగ్ వాక్‌కి వెళ్ళి వస్తూన్న వాళ్ళూ—

ఉదయాన్నే పాలబూత్‌కి బయలుదేరినవాళ్ళూ—

అంత చీకటినే ఏదో పని వుండి బయటికొచ్చినవాళ్లూ—

ఇలా చాలా తక్కువమంది జనమే బయట తిరుగుతూంటారా సమయంలో.

అయితేనేం....

హత్య జరిగిందనేసరికి వాళ్ళ గుంపే ఎక్కువవుతోంది.

శవం అదే తీరులో ఉండగా ఫోటోలు తీయడం పూర్తయింది.

శవాన్ని వెల్లకిలా తిప్పించాడు మురళి.

షాక్ తిన్నట్టయ్యింది.

ఆమె....ఆమె....

మిస్సింగ్ పర్సన్‌గా కేసు రిజిష్టర్ చెయ్యబడ్డ సీత....

భార్గవ ఇచ్చిన సీత ఫోటోని ఒకటికి పదిసార్లు చూశాడు మురళి.

అందుకే ఆమె రూపం అతని మెదడులో ముద్రింపబడిపోయింది.

ఆమె కోసం తనెన్నో విధాల గాలిస్తున్నాడు.

ఆమె ఈ రోజున దొరకడం అయితే దొరికిందిగానీ సజీవంగా మాత్రం కాదు.

బాధగా కళ్ళు మూసుకున్నాడు మురళి.

అల్లారుముద్దుగా పెంచే తండ్రి....

తానున్నా తన బేబీ తల్లిలేని కొరతను ఎంతగా అనుభవిస్తుందో బాగా తెలుసతనికి.

అలాంటిది తండ్రిని ముందే పోగొట్టుకున్న సీత బిడ్డలు, ఈ రోజు తల్లినీ కోల్పోయి అనాథలయ్యారనే విషయం తల్చుకునేసరికి గుండె చెరువయిపోయింది.

సీత ఉన్నప్పుడు కూడా వాళ్ళ వాళ్ళెవరూ సీతను కాని, బిడ్డల్ని కానీ చూడలేదు.

ఈ రోజు సీత కూడా పోయాక వాళ్ళ గతి వీధులపాలే!

ఈ వృత్తిలో తనెన్నో చావులు చూశాడు.

కానీ ఈ రోజెందుకో మనసు కరిగిపోతోంది.

కళ్ళ ముందు సీత బిడ్డలతోపాటు తన బేబీ కూడా కదలాడుతున్నారు.

ఒక్క క్షణంపాటు అతని కెందుకో చాలా విరక్తిగా అనిపించింది.

అంతలోనే అతనిలోని పోలీసాఫీసర్ మేల్కొన్నాడు.

సీత బిడ్డలకి అంత అన్యాయం చేసిన వాళ్ళని ఉరికంబమెక్కించకుండా వదలకూడదు.

మనసులోనే నిర్ణయించుకున్నాడు.

శవాన్ని చూస్తుంటేనే తెలిసిపోతోంది-

ఆమెనెవరో రేప్ చేసి చంపేశారని.

ఆ బుగ్గల మీద గోళ్ళ రక్కులూ, ఎదరంతా చిరిగిపోయిన జాకెట్టూ, రేగిన జుట్టూ, చెదిరిన చీరా....



అన్నీ ఆమెపట్ల జరిగిన ఘాతుకానికి సాక్ష్యాలుగా కనిపిస్తున్నాయి.

గొంతు చుట్టూ నల్లగా కమిలిపోయి ఉంది.

నాలుక వెళ్ళుకొచ్చింది.

గొంతు నొక్కి చంపివుంటారామెని.

పెనుగులాట జరిగిన సూచనలేవీ లేవక్కడ.

ఎక్కడో చంపి ఆమె శవాన్నిక్కడ పడేసి వుంటారు.

తన పశు కామానికామెను సమిధగా వాడుకుని, ఆ కోరిక చల్లార్చుకోడంతో తృప్తిపడక, ఆమె ఊపిరినే ఆపేసిన ఆ నరపశువు నిజంగా కిరాతకుడే!

"సార్! ఫోటోలు తీయడం అయిపోయింది."

ఫొటోగ్రాఫరొచ్చి చెప్పేసరికి ఉలిక్కిపడ్డాడు మురళి.

తన ఆలోచనలలో తనుండగానే సిబ్బంది వాళ్ళ పని వాళ్ళు చేసేశారన్నమాట!

ఏమైనా ఆధారాలు దొరుకుతాయేమో అని చుట్టూ గాలించి రమ్మన్నాడు కానిస్టేబుల్స్‌ని.

వాళ్ళు ఉత్తచేతుల్తో తిరిగొచ్చారు మరో పదిహేను నిమిషాల్లో.

శవాన్ని పోస్ట్‌మార్టంకి తరలించి, అక్కడ్నించి బయటకొచ్చాడు మురళి.

* * * * *

మనసంతా కల్లోలంగా ఉంది మురళికి.

జీపులో కూర్చున్నాడన్నమాటే కానీ ఆలోచనాలోకంలో మునిగి తేల్తూ ఏమీ పట్టించుకోవట్లేదు.

డ్రైవరికి అతని తీరు అలవాటే గనక మౌనంగా జీపు పోనిస్తున్నాడు.

నీలకంఠం హత్య జరిగి సుమారు వారం రోజులవుతున్నా ఆ కేసలాగే పెండింగులో వుంది.

హత్యా స్థలంలో తనకి దొరికిన ఆ రక్తపు వేలిముద్రలతో తన రికార్డులలో ఉన్న వేలిముద్రలు పోల్చి చూశాడు.

ఏవీ సరిపోలేదు.

హంతకుడికి అదే మొదటి నేరం అయినా అయివుండాలి.

లేక నేరాలు చేస్తూనే ఉన్నా పోలీసుల చేతికి అందక తప్పించుకు తిరుగుతున్నవాడయినా అయివుండాలి.

ఆ కేసులో పరిశోధన సాగక అలాగే ఆగిపోయింది.

ఇప్పుడు మళ్ళీ ఇదో కేసు.

ఏదో జేబు దొంగతనాలూ, కొట్లాటలూ లాంటి చిల్లర నేరాలెన్ని జరిగినా పెద్దగా పట్టించుకోరు జనం.

కానీ హత్యల్లాంటి గ్రేట్ క్రైమ్స్ జరిగితే మాత్రం గగ్గోలు పెడతారు.

పత్రికల్లో దుమారం చెలరేగుతుంది.

అందులోనూ ఈ కేసులో మానభంగమూ, హత్యా.

రెండు నేరాలు!

ఈ విషయం తెలియగానే ఏ.సి.పి. తప్పకుండా అతన్ని పిలిపిస్తాడు.

దీన్ని గూర్చి సీరియస్‌గా మాట్లాడతాడు.

నిజానికి పై ఆఫీసరు ఏదో అంటాడని కాదు కానీ తనకే మనసులో గిల్టీగా వుంది.

సీత హత్య ఎక్కడో జరిగింది.

ఏ ఇంట్లోనో సైలెంటుగా జరిగి ఉండచ్చు.

అందులో తను అడ్డుకోగలిగినదేదీ లేకపోవచ్చు.



కానీ ఆమె శవాన్ని తెచ్చి ఇక్కడ పడేశారు.

అదీ తను నైట్ డ్యూటీలో ఉండగా జరిగింది.

అది తనకో సవాలుగా అనిపిస్తోంది.

చిన్నవాడే అయినా గట్టి ఆఫీసరుగా తనకి డిపార్టుమెంటులో పేరు వుంది.

అందుకిన్నాళ్ళూ తనకి తృప్తిగా వుండేది.

ఇప్పుడీ సంఘటన ఆ తృప్తిని నీళ్ళు కార్చేసి అశాంతిపాలు చేస్తున్నది.

నైట్ పెట్రోలింగ్ చేస్తున్న పోలీసు కానిస్టేబుల్స్ ఎవరూ గమనించని రీతిలో ఆమె శవాన్నక్కడ పారేసి పోయారు.

వాళ్ళా పని చేస్తూండగా ఏ ఒక్క పోలీసు వ్యక్తి గమనించలేదంటే వీళ్ళంతా ఏం చేస్తున్నట్టు?

ఇలాంటి నేరాలు మరో ఒకటి, రెండు జరిగితే ప్రజలు భయపడి పోతారు

ఆడదానికి రక్షణ లేదంటూ మహిళా సంఘాలు గోలపెడతాయి.

పోలీసుల అసమర్థత అంటూ అపోజిషనువాళ్ళు అసెంబ్లీ దాకా లాక్కొస్తారీ విషయాన్ని.

కానీ ఈ అంతర్ ప్రెషర్ కంటే కూడా తన మనసు చేస్తున్న ఒత్తిడే భయంకరంగా అనిపిస్తోంది.

"బాస్టర్డ్! ఐ కాంట్ లీవ్ యూ"

ఆవేశంగా పెదాలు కొరుక్కున్నాడు మురళి

చిట్లిన పెదిమలోంచి రక్తం ఉప్పగా నాలిక్కి తగిలేసరికి అతని ఆలోచన్లాగిపోయాయి.

ఏదో ఒకటి చెయ్యాలి తనిప్పుడు.

నాలుగువేపులా రాళ్ళు విసిరితే ఏదో ఓ రాయికి తగలకపోదు హంతకుడు.

"ప్రొడ్యూసర్ చౌదరి ఇంటికి పోనీయ్"

డ్రైవరుతో చెప్పాడు మురళి.

చౌదరి ఇంటి దగ్గర జీపింకా పూర్తిగా ఆగనేలేదు, జీపులోంచి మురళి దూకి స్పీడ్‌గా లోపలికి దూసుకెళ్ళాడు.

* * * *

వేరే ఎవరయినా అయితే అంత ఉదయాన్నే లోపలికి పోనివ్వడు గూర్ఖా.

కానీ వచ్చింది పోలీసాఫీసరు కనక అడ్డగించలేదు.

"వాట్ ఇన్‌స్పెక్టర్? ఏమిటంత కంగారుగా ఉన్నారు?"

మురళిని చూస్తూనే చౌదరి పలకరించాడు.

చౌదరి అప్పటికే లేచి కూర్చుని పేపరు చదువుతున్నాడు.

"మీకున్నంత ప్రశాంతత మా పోలీసు వాళ్ళకి ఎక్కడి నుండి వస్తుంది చెప్పండి. మేము ప్రశాంతంగా ఉందామన్నా మిమ్మల్నలా ఉండనివ్వరు కదా?"

"మీ కంత ఆరాటాన్ని కలిగించే విషయం ఏం జరిగింది ఇంత పొద్దున్నే" అడిగాడు చౌదరి.

"మామూలు లోకం ప్రశాంతంగా విశ్రాంతి తీసుకుంటున్న వేళల్లోనే నేరస్తుల లోకం మెలకువగా వుంటుంది.

మీకింకా తెల్లవార లేదు. కానీ ఓ అమాయకురాలి జీవితాన్నే తెల్లారేశారప్పుడే...."



"మీరలా కవుల భాష చెప్పకండి ఇన్‌స్పెక్టరు గారూ....ఏం జరిగిందో కాస్త వివరంగా చెప్తురూ."

"మీ డ్రయివరు....అదే....మీ మాజీ డ్రయివరు భార్య సీత హత్య చెయ్యబడింది."

"వ్వాట్! ఏమిటి మీరంటున్నది?"

ఆశ్చర్యంగా అడుగుతూ పక్క మీంచి లేవబోయాడు చౌదరి.

కానీ విరిగిన కాలందుకు సహకరించకపోగా అలాగే తిరిగి మంచం మీదకి వాలిపోయాడు.

"ఒక్క దారుణం కాదు-రెండు దారుణాలు. మరణించేముందు ఆమె రేప్ చెయ్యబడింది.

'రేప్' అని ఎందుకన్నానంటే అది ఇష్టపూర్తిగా జరిగినదే అయితే ఆమె శరీరం అంత దుస్థితిలో ఉండదు."

కొయ్యబారిపోయినట్టయిపోయాడు చౌదరి.

"ఇప్పుడు చెప్పండి చౌదరిగారూ! ఇంకా తెల్లవారలేదంటూ మీలాగే నేనూ వెచ్చగా పడుకోనా?

అసలలా విశ్రాంతి తీసుకోడానికి.... వేళపాళలు పాటించడానికి ఈ క్రిమినల్సు మాకు ఛాన్సిస్తున్నారా?"

వెంటనే జవాబివ్వలేకపోయాడు.

"ఐయామ్ ఎక్స్‌ట్రీమ్లీ సారీ ఇన్‌స్పెక్టర్! విషయం తెలియక నేనేదో జోక్ వేశాను. కాస్త మీరలా కూర్చుని వివరాలు చెప్తారా?"

రిక్వెస్టింగ్‌గా అడిగాడు చౌదరి ప్రక్కనే వున్న కుర్చీ చూపిస్తూ.

నెమ్మదిగా కుర్చీ లాక్కు కూర్చున్నాడు మురళి.

"నిదానంగా వివరాలు వివరించి చెప్పడానికి ఇది కాశీమజిలీ కథ కాదు... 24 రీళ్ళ సినిమానూ కాదు. ఆ దుర్మార్గుడెవరో రెండు నూరేళ్ళ జీవితాల్ని క్షణాల మీద నాశనం చేశాడు. అదీ ఆమెని చెరిచి చంపాడు."

ఆవేశంతో కళ్ళు ఎర్రబడ్డాయి మురళికి.

"పాపం! సీత చాలా అమాయకురాలు ఇన్‌స్పెక్టర్‌గారూ! ఈ లోకం తీరు తెలియని గంగిగోవు లాంటిది."

"ఎన్నో గోముఖ వ్యాఘ్రాలు తిరుగుతూన్న ఈ జనారణ్యంలో అలాంటి గంగి గోవులకి చోటెక్కడుంది చౌదరిగారూ!

ఆమె ఆదమరచి ఉన్న క్షణాల్లో ఏ మానవ మృగమో ఆమె మీద పడి పీక్కు తినేసింది."

మనసులోని ఆవేదన జ్వాలలై చెలరేగుతూంటే, దాన్ని వెళ్ళగక్కకుండా ఆపలేకపోతున్నాను మురళి.

"ఇలాంటి అమాయకుల్ని రక్షించడానికేగా మీ పోలీసు బలగం ఉన్నది?"

సూటిగా అడిగాడు చౌదరి.

నిజమే! మీరన్నది రైటే! కానీ పబ్లిక్ మాతో సహకరిస్తేనే కదా! మా బాధ్యత మేము నెరవేర్చగలిగేది?"

"మాట్లాడితే ఇదో వంక దొరికింది మీకు. ప్రజలు సహకరించట్లేదని నిందిస్తారు. కానీ సహకరించడానికనీ, తను చూసిన ఓ నేరాన్ని చెప్పడానికనీ ఏ అమాయకుడయినా ముందుకొస్తే, వాడ్ని ఓ నేరస్తుడిలాగే ముప్పతిప్పలు పెట్టి జన్మలో పోలీసువాళ్ళ దాపుకి కూడా పోకూడదనిపించేట్టు చేస్తారు.

అలాంటప్పుడు మీకు ఎక్కడ్నించి దొరుకుతుందా సహకారం చెప్పండి?"



సీరియస్‌గానే అన్నాడు చౌదరి.

ఆ మాటల్లోని నిజం నిప్పులా తాకేసరికి మాట్లాడ లేకపోయాడు మురళి.

"నిజమే! చౌదరి అన్నదీ నిజమే. సాక్ష్యం ఇవ్వడానికి ముందుకు వచ్చిన వాళ్ళని ఒకోసారి మహా సతాయిస్తారు పోలీసువాళ్ళు.

అందుకే కళ్ళెదురుగా ఓ మనిషిని నిలువునా చంపేసినా, ఆ విషయం తాము చూడనట్టే ఆత్మవంచన చేసుకుంటూ తమ దారిన తాము పోతారు జనం.

అందరు పోలీసాఫీసర్లూ అలా చేస్తారని కాదు....

కానీ అలా చేస్తున్న కొందరివల్ల మొత్తం డిపార్ట్‌మెంటుని చూపే దూరంగా తొలగిపోతారు మామూలు జనం.

చెప్పండి మురళిగారూ! మా డ్రయివర్ భార్య కనిపించట్లేదంటూ మీకు కంప్లయింటిచ్చి వారం రోజులవుతోంది.

ఆమె వివరాలు చెప్పిన వాళ్ళకి స్పెషల్‌గా కాష్ అవార్డ్ కూడా ఎనౌన్స్ చేయించాం.

కానీ మీరు చేసిందేముంది?

ఆమె ఏమయినదీ, ఎక్కడున్నదీ ఈ వారం రోజుల్లో ఏ కాస్త అయినా ఆరా తియ్యగలిగారా?

ఇంతంత జీతాల్లూ, ఇన్నిన్ని అధికారాలూ యిచ్చి మీరేదో మమ్మల్ని ప్రొటెక్టు చేస్తారనుకున్నందుకు మీరు మాకిచ్చిన రక్షణ ఏముంది?

ఇదే ఏ రాజకీయ నాయకుడి భార్యో, ఏ మంత్రి కూతురో అయితే ఇలా యిన్నాళ్ళు నిశ్శబ్దంగా చేతులు ముడుచుక్కూర్చునేవారా మీరు?

అసలు మిమ్మల్నిలా కూర్చోనిచ్చేవాళ్ళా మీపై అధికారులు?"

శివమెత్తినోడిలా విరుచుకుపడ్డాడు చౌదరి.

తనకున్న అధికారంతో చౌదరి నోరు క్షణంలో కట్టెయ్యగలడు మురళీ.

కానీ ఆ మాటల్లోని నిజం....

చంపబడ్డ వ్యక్తి తాలూకు మనిషిగా ఆ మాటల్లో కనిపిస్తున్న కన్సర్న్.... అతన్ని మాట్లాడనివ్వలేదు.

"మీరలా ఊరికే ఆవేశపడి అరిస్తే లాభంలేదు చౌదరిగారూ!

వేలమంది.... లక్షలమంది క్రిమినల్స్‌ని అదుపు చెయ్యడానికి వందల సంఖ్యలో వున్న ఈ పోలీసు బలగం చాలదని మీకూ తెలుసు.

ఈ సమస్య కేవలం మీదీ నాదీ మాత్రమే కాదు.

దీనికి పరిష్కారం మన చేతుల్లో లేదు.

మీరలా మాటి మాటికీ మా డిపార్టుమెంటును ఉద్దేశించి వెటకారంగా మాట్లాడితే ప్రయోజనం లేదు.

నిజం చెప్పాలంటే ఆమెని చివరిసారి చూసింది మీరు....

ఆమెతో చివరగా మాట్లాడిన వ్యక్తి మీరు.

మిమ్మల్ని కలిసొస్తానని ఆమె ఇంటి దగ్గర చెప్పి బయల్దేరింది.

మిమ్మల్ని కలిసిందని మీరూ ఒప్పుకున్నారు.

ఈ కేసులో ఎవరో ఒకర్ని అనుమానించి అదుపులోకి తీసుకుని దర్యాప్తు ప్రారంభించాలంటే మిమ్మల్నే అరెస్టు చెయ్యాలి.

ఒకవేళ నేనలా చేశాననుకోండి, మీరూరుకుంటారా?

మీకున్న రాజకీయ పలుకుబడిని ఉపయోగించి, మా చేతుల్లోంచి జారుకుంటారు.



అదండీ మా పరిస్థితి. అర్థం చేసుకుంటారనుకుంటాను."

మురళీ మాటల్లోని వ్యంగ్యం సూటిగా తాకింది చౌదరిని.

"ఇన్స్‌పెక్టర్! కాస్త ఆలోచించి జాగ్రత్తగా మాట్లాడండి.

ఎవరితో మాట్లాడుతున్నారో ఆలోచించారా?

చౌదరిని....

ది గ్రేట్ ప్రొడ్యూసర్ ఫైనాన్షియర్ని.... ఆఫ్టాల్ ఓ ఆడదాని హత్య కేసులో అనుమానించడమా?

తెలివుండే మాట్లాడుతున్నారా?

నేను తలుచుకుంటే మిమ్మల్నేమయినా చెయ్యగలను."

కోపంతో మొహం ఎర్రబడిపోయింది చౌదరికి.

"అదే చౌదరిగారూ నేనూ చెప్పేది.

తల్చుకుంటే మమ్మల్నేదయినా చెయ్యగలమనుకునే మీలాంటి వాళ్ళతోనే మాకున్న ట్రబులంతా.

అదే ఆర్డినరీ క్రిమినల్స్ అనుకోండి....

వాళ్ళని లాకప్‌లో తోసి, నాలుగు వాయించి నిజం రాబట్టగలం.

కానీ చట్టంలోని లొసుగుల చాటున నక్కి దాక్కునే కొద్దిమందిని ఏమీ చెయ్యలేకపోతున్నాం.

ఓ.కే....

ఆ విషయం తర్వాత ఆర్గ్యూ చేద్దాం కానీ ముందు మీరు నేనడిగిన వివరాలు చెప్పండి.

సీత మిమ్మల్ని ఆ రోజున ఎన్నింటికి కలిసింది?

ఎప్పుడు వెళ్ళిపోయింది?

అఫ్‌కోర్స్! నాతో మీరిదివరకు ఈ వివరాలన్నీ చెప్పారనుకోండి. మళ్ళీ ఓసారి అడుగుతున్నాను."

"ఈ రోజు శనివారం కదా! సరిగ్గా క్రిందటి శనివారం సాయంత్రం 5.30–6.00 గం॥ల మధ్యలో నా దగ్గరకొచ్చింది.

నేను టి.వి.లో హిందీ పిక్చర్ చూస్తున్నానప్పుడు.

కనుక టైము అంత కరెక్టుగా గుర్తుంది. అప్పుడే మొదలయ్యింది సినిమా.

ఆమెని నాదగ్గర పిక్చర్లోకి తీసుకోవాలని నేనెప్పుడో అనుకున్నాను. కనక ఆ విషయంలో మరేమీ అడగలేదు.

మేనేజర్ని పిలిచి ఎగ్రిమెంటు రాయించి సంతకం తీసుకున్నాను. మీరు మామేనేజర్ని అడిగి ఆ ఎగ్రిమెంటు కాగితం చూడవచ్చని మీకప్పుడే చెప్పాను.

ఆమెకి ఎడ్వాన్సుగా పదివేలిచ్చాను.

పిక్చరు పూర్తయ్యాక మరో ఇరవై వేలిస్తానని చెప్పాను.

నిజానికి ఆమెకియ్యబోయే వేషానికి ముప్ఫయివేలు పెద్ద మొత్తమే!

ఆమెమీద సానుభూతితోనే ఆమెకి సాయం చెయ్యాలనే కోరికతో ఇవ్వడానికి సిద్ధపడ్డానంత మొత్తం.

పదివేలకే ఆమె మహా సంతోష పడిపోయింది.

నాకు వంగి వంగి నమస్కారం చేస్తూ వెళ్లిపోయింది.

ఆ డబ్బు ఆమె పిల్లలకి పనికొస్తుందనుకున్నాను

కానీ ఏ రౌడీ వెధవ చేతిలో పడిందో అది?

ఆమెని చివరిసారిగా చూసినవాడిని నేనే అన్నారు.

చిన్న కరెక్షను....



మనకి తెలిసినంతవరకూ ఆమెని చివరిసారిగా చూసినవాడిని, మాట్లాడినవాడినీ మాత్రమే నేను.

తెలియని వాళ్ళింకా ఎవరయినా ఉండచ్చుకదా!"

జేబులోంచి తెల్లకాగితం, పెన్నూ తీశాడు మురళి.

"చౌదరిగారూ! ఇప్పుడు మీరు చెప్పిన వివరాలిందులో రాసి సంతకము చెయ్యండి"

ఆ గొంతులో ఎంతో ప్రశాంతత!

ఏదో మామూలు విషయం చెప్తున్నట్టే వుంది.

అంటే....

"మీరు నా దగ్గర స్టేట్‌మెంట్ తీసుకుంటున్నారా?"

రెచ్చిపోతూ అడిగాడు చౌదరి.

"మీరన్నట్టు....నాకు తెలిసినంతవరకూ సీతని చివరిసారిగా చూసిన వ్యక్తి మీరు.

కనక మీనుండి రిటెన్ స్టేట్‌మెంట్ తీసుకునే అధికారం మాకుంది.

అసలు మిమ్మల్ని పిలిచి స్టేషన్‌లో తీసుకోవాలనుకోండి. కానీ మీరు కదల్లేని స్థితిలో వుండడంవల్ల నేనే వచ్చాను."

మురళి మాటలు నెమ్మదిగానే వున్నా, ఆ మాటల్లో కమేండ్ వుట్టిపడుతోంది.

అయినా చౌదరి బెదరలేదు....

తీవ్రంగా చూస్తూ కూర్చున్నాడు.

"చౌదరిగారూ! మీరలా బెట్టు చేస్తే, మిమ్మల్ని ఎలాగయినా స్టేషన్‌కి తీసికెళ్ళాల్సి వస్తుంది.

తర్వాత జరిగేవాటికి నన్ను నిందించి లాభంలేదు."

తప్పనిసరయి రాసిచ్చాడు చౌదరి.

"థాంక్స్ వెరీమచ్ చౌదరిగారూ! మళ్ళీ కలుస్తాను మిమ్మల్ని."

చిన్నగా నవ్వుతూ అని చకచకా వెళ్ళిపోయాడు ఇన్స్పెక్టర్.

పట్టరాని కోపంతో చౌదరి అతన్నలా చూస్తూ వుండిపోయాడు.

* * * * *

సీత శవం తాలూకు పోస్టుమార్టం రిపోర్టు వచ్చింది.

పెద్ద ఆతృతగా లేదు మురళికి....

అందులో ఏం వుందో తెలుసుకోవాలని.

ఏం వుంటుందో తనే ఊహించగలడు....

క్లీన్ కేస్ ఆఫ్ రేప్ అండ్ మర్డర్ అది.

రొటీన్‌గా దాన్ని తెరిచి చదవసాగాడు.

హతురాలి పేరూ, వయసూ తనకు తెలిసినవే గనక వాటి మీద నుంచి దృష్టి కిందకు మళ్ళించాడు.

డెత్ డ్యూ టు సఫొకేషన్, ఊపిరాడనందువల్ల మరణించిందామె.

గత కొద్దిరోజులుగా హతురాలు చాలాసార్లు అనుభవించబడింది.

ఆమె జననాంగం చిట్లివుంది గనక ఆ సంభోగం బలవంతంగా జరిగి వుండచ్చు.

మరణానికి ముందు కూడా ఆమె అనుభవించబడింది.

ఆమె జననాంగంలోనూ, తొడల మీదా, కట్టుకున్న లంగా మీద లభించిన వీర్యపు మరకలా విషయాన్ని నిరూపిస్తున్నాయి.

అది ఆమె ఇష్టపూర్వకంగా జరిగిందో, కాదో తెలిపే ఆధారాలు లేవు



ఆమె మడమలవద్ద చర్మం చిట్లి ఉంది. రక్తం అక్కడ గడ్డకట్టింది.

ఆమె పాదాల నెవరో తాళ్ళతో కట్టి బంధించడం వల్ల అలా జరిగుండచ్చు.

ఆమె మెడ క్రింది భాగంలో ఫారిన్ మెటీరియల్ కనిపిస్తోంది.

మేకప్ మెటీరియల్ తాలూకు అవశేషం అది.

మొహం మీద దిండు పెట్టి బలవంతాన నొక్కినందువల్ల మరణం సంభవించి వుండచ్చు.

చివరి భాగం మురళికి ఆసక్తికరంగా అనిపించడంతో మళ్ళీ మళ్ళీ చదివాడు.

తటుక్కున అతని మనసులో ఓ ఊహ మెదిలింది.

కానీ....ఏవీ? ఆధారాలేవీ నిరూపించేందుకు?

వెతకాలి....తనీక్షణం నుండి ఆ ఆధారాలు వెదికి ఆ అమాయకురాలికి ఆత్మశాంతి కలిగించాలి.

దృఢ నిశ్చయంతో లేచాడు మురళి.

ఇన్స్పెక్టర్ మురళి....

* * * *

రాత్రి పదయ్యింది.

ట్రింగ్ మంది టేబుల్ మీద ఫోన్.

దానికోసమే వెయిట్ చేస్తున్న లైలా తృళ్ళిపడి లేచింది.

వణుకుతున్న చేతులతో ఫోనందుకుంది.

"హలో" అంది కంగారుగా.

"లైలా....నేను భార్గవని మాట్లాడుతున్నాను."

"అబ్బ! నువ్వేనా భార్గవా....నిన్నంతా ఏమయ్యావు?"

గబగబా అడిగింది లైలా రిలీఫ్ ఫీలవుతూ.

"పని మీద ఊరెళ్ళాను. వెళ్ళేముందు నీకు ఫోన్ చేసి వెళదామను కున్నాను. కానీ వీలుకాలేదు."

ఎక్స్‌ప్లనేషన్ తొంగిచూస్తోందా మాటల్లో.

"ఏ ఊరెళ్ళావు? అంత అర్జంటు పని ఏమిటి?"

కోపం వచ్చినట్టుంది లైలాకి అనుకున్నాడు.

నిజానికతను చౌదరి పనిమీదే వెళ్ళాడు బొంబాయి.

ఏవో ఫిలిం బాక్స్ ఉన్న పెట్టె తనకిచ్చి అతను బొంబాయిలోని మరో ఫైనాన్షియర్‌కా పెట్టె యిచ్చిరమ్మన్నాడు.

ఎవరిదో సినిమా తాలూకు మొదటి నాలుగు రీళ్ళట ఆ డబ్బాలు.

ఆ నిర్మాత కోరినంత డబ్బు అతని దగ్గర లేదని....

అందువల్ల బాంబేలోని తన ఫ్రెండయిన ఫైనాన్షియరుకిస్తే ఆ డబ్బి స్తాడనీ చెప్పాడు.

తన దగ్గర డబ్బు లేదని చెప్పి చేతులు ముడుచుకూర్చోవచ్చు చౌదరి.

కానీ....

ఆ నిర్మాతకి సాయపడాలనే సదుద్దేశంతో అతనలా బాంబే ఫైనాన్షి యర్‌ని కొంటాక్ట్ చేశాడు.

తను ట్రెయిన్ కెళతానన్నాడు.

కానీ ఆయన తన కారిచ్చి వెళ్ళిరమ్మన్నారు.

అక్కడ బాంబేలో కూడా నాలుగుచోట్లా తిరిగి చూడ్డానికి చేతిలో కారుంటే సులువని కూడా అన్నారు.



పోతే ఆ విషయం మూడో కంటివాడికి తెలియనివ్వద్దని....

అందువల్ల ఆయనలా వేరే ఫైనాన్షియర్ నుండి డబ్బు తీసుకున్న విషయం బయటపడుతుందనీ....

అది తనకు చిన్నతనం అనీ అన్నాడు.

ఆ కారు డ్రైవర్ తనకూడా ఉండటం వల్ల తనకి ప్రయివసీ దొర కక....లైలాకి ఫోన్ చెయ్యలేదు.

అలా చెప్పకుండా వెళ్ళిపోయినందుకు ఇప్పుడు అమ్మాయిగారు అలిగారన్నమాట!

చిన్నగా నవ్వుకున్నాడు భార్గవ.

ప్రేమలో ఈ అలకలూ....

అల్లర్లూ....

ఎంత తీపిగా ఉంటుందో....

"మాట్లాడరేం....?

ఉన్నావా అసలు ఫోను దగ్గర?"

ఫోన్‌లో అరిచింది లైలా.

తృళ్ళిపడ్డాడు భార్గవ.

"ఆఁ....ఆఁ! చెప్పు....చెప్పు ...వింటున్నా"

కంగారుగా అన్నాడు.

"భార్గవా! నువ్వు వెంటనే బయల్దేరి మా ఇంటికి రావాలి.

మెయిన్ గేట్లోంచి రావద్దు.

వెనక గేట్లోంచి రా....

నువ్వొచ్చి తలుపు కొట్టేవరకూ నేనక్కడే వుంటాను."

గబగబా చెప్పింది లైలా.

అసలేమీ అర్థంకావట్లేదు భార్గవకి.

ఏం జరిగింది?

ఎందుకామె అంత కంగారుగా ఉంది?

చౌదరికి తమ విషయం తెలిసిపోయిందా?

ఒళ్ళు ఝల్లుమంది భార్గవకి.

అంతలోనే తమాయించుకున్నాడు.

"ఎనీ థింగ్ రాంగ్?"

ఎక్కడలేని ఆతృత కనిపిస్తోంది అతని స్వరంలో.

"ఎవ్విరి థింగ్ రాంగ్!

వెంటనే రా అని చెప్తుంటే ఇలా ప్రశ్నలేస్తూ కూర్చుంటావేం?

భయంతో చస్తున్నాను నేను....నిన్నటినుంచీ.

వెంటనే రా భార్గవా ప్లీజ్!"

అతనింకా ఏమయినా ప్రశ్నలేసి టైము వృథా చేస్తాడన్న భయంతో ఫోన్ పెట్టేసిందామె.

* * * * *

మోటార్ సైకిల్ మీద శరవేగంతో దూసుకొస్తున్నాడు భార్గవ.

ఏం జరిగిందీ....?

అసలేం జరిగుంటుందీ....?

ఎంత ఆలోచించినా అతని ఊహ కందట్లేదు.

చౌదరికి తమ విషయం తెలిసిపోయి ఉండటం తప్ప మరే అపాయమూ కనుచూపుమేరలో కనబడట్లేదు.

అదే అయితే లైలా ఇంట్లోంచి బయటికొచ్చి తనను ఎక్కడయినా కలుసుకునేది కానీ యింటికి రమ్మని పిలవదుగా?



తర్కానికి నిలవట్లేదు ఏదీ.

అసలేమీ తెలియకపోతే కంగారే లేదు.

ఏదో ప్రమాదం జరిగిందని తెలిసి, ఆ వివరాలు తెలియకపోతే మాత్రం యమ యాతనగా వుంటుంది మనిషికి.

కాసేపట్లో ఆ వివరాలు ఎలాగూ తెలుస్తాయి.

కానీ అప్పుడు తెలియనందుకు మాత్రం గుండె గుబగుబలాడుతుంది.

చౌదరి ఇంటికి వెనక సందులోకి పోనిచ్చాడు మోటార్ సైకిల్.

చౌదరి ఒకటి రెండుసార్లు గర్వంగా అన్నాడు—

తన ఇంటికి మెయిన్ గేటు ఓ సందులోకి....

వెనక గేటు మరో సందులోకి తెరుచుకుంటాయని.

సిటీలో అలాంటి ఇల్లున్నందుకు అతనికి గొప్పగా వుంటుంది.

అదే ఇప్పుడు తనకి వుపయోగపడింది.

చిన్నగా నవ్వొచ్చింది భార్గవకి.

గేటుకి కాస్త దూరంలోనే వెహికిల్ని ఆపాడు భార్గవ.

మరునిమిషంలో స్కూటర్ లాక్ చేసి గేటు దగ్గరికి నడిచాడు.

అనుకోకుండా వాచీ చూసుకున్నాడు.

రేడియం డయల్ వాచీ పదీ నలభై సూచిస్తోంది.

పగటి వేళలోనే ఆ సందులో సంచారం తక్కువ ఉండేట్టుంది.

రాత్రి కనక అసలు మనిషన్న వాడెవడూ లేడు దరిదాపుల్లో.

గేటు తీశాడు నెమ్మదిగా.

ఆ చప్పుడు వింటూనే లోపలున్న తలుపు తియ్యబడింది నిశ్శబ్దంగా.

అతన్ని చూస్తూనే అల్లుకుపోయింది లైలా.

అప్రయత్నంగా ఆమెని గుండెలకదుముకున్నాడు భార్గవ.

మరుక్షణంలోనే తెలిసింది. ఆమె ఎందుకో ఏడుస్తోందని.

ఆమె వెక్కిళ్ళ చప్పుడూ, అతని గుండెల మీద తడీ అతనికా విషయాన్ని చెప్తున్నాయి.

"అరే! ఏంటిది శైలా? ఎందుకా కన్నీళ్ళు? చెప్పు ఏమయ్యింది నేనొచ్చేశానుగా!"

ఆమెకి ధైర్యాన్ని చెప్తూ మరింతగా హత్తుకున్నాడు.

అతని ఓదార్పు వింటూనే ఆమె గుండెలు పగిలేలా ఏడవసాగింది.

"ఏంటమ్మా! ఇది?

నేనున్నానుగా నీకేం ఫర్వాలేదు. నేను చూసుకుంటా. అసలేం జరిగిందో చెప్పు చాలు.

ఏమయ్యింది?

చౌదరికి మన విషయం ఎవరన్నా చెప్పారా?

నిన్నేమన్నా అడిగాడా ఆయన?

అలా జరిగినా నీకు నేనున్నాను. నువ్వు కంగారు పడకు.

ఇదీ ఒకందుకు మంచిదే !

ఈ దొంగ బతుక్కి స్వస్తి చెప్పి నలుగుర్లోనూ పెళ్ళి చేసుకుందాం.

సరేనా! మరి ఏడవకు, చెప్తున్నాగా, నీకు నేనున్నాను"

ఆమె తల పైకెత్తి కన్నీళ్ళు తుడిచాడు భార్గవ.

"అవును భార్గవా!

నువ్వున్నావన్న ధైర్యంతోనే బ్రతికున్నాను. లేకపోతే ఎప్పుడో నేనూ ఆత్మహత్య చేసుకునేదాన్ని"

బొంగురు పోయిన గొంతుతో అంది శైలా.



"ఏయ్ పిచ్చీ!

ఏంటా మాటలు?

చావయినా, బ్రతుకయినా నాతోపాటే నువ్వూను.

నేనుండగా నీ మీద ఈగ వాలనివ్వను.

చెప్పు! ఆ చౌదరి నిన్నేమన్నా అన్నాడా, బాధ పెట్టాడా?"

ఆత్రుతగా అడిగాడు భార్గవ.

"అసలాయనకి మన విషయమేమీ తెలియదు"

తల అడ్డంగా తిప్పుతూ అంది శైలా.

గుండెల మీంచి పెద్ద బరువేదో దిగినట్టయ్యిందతనికి.

శైలా కోసం ఏం చెయ్యాలన్నా తను సిద్ధమే.

ఆమె మీద తనకంత ప్రేమ ఉంది.

కానీ ఆమె మీద ధర్మపరంగా, చట్టబద్ధంగా హక్కులున్న చౌదరికా విషయం తెలిసి, తనని నిలదీసేటప్పుడు తను తల దించుకోక తప్పదు.

అంతకంటే ముందుగా అతనికా విషయం తనే చెప్పి శైలాకి విడాకులిచ్చి స్వతంత్రురాల్ని చెయ్యమని అడిగితే అందులో ఓ ఠీవి ఉంది.

ఫలితం ఒకటే అయినా!

చౌదరికి వేరే విధంగా ఆ విషయం తెలిసినప్పుడు తను దొరికిన దొంగలా తల దించుకోక తప్పదు.

ఇప్పుడా ఆత్మన్యూనత సహించాల్సిన అవసరం లేదని తెలిసింది.

చాలు....

ఇప్పుడీ ఆపదేదో తెలుసుకుని, ఒడ్డెక్కిపోతే, ఆ తర్వాత తనే చౌదరితో తామిద్దరి ప్రేమగూర్చి చెప్పేస్తాడు.

తన ప్రాణాలిచ్చయినా లైలాని దక్కించుకుంటాడు.

"ఇంకేముంది లైలా? నువ్వంతగా భయపడాల్సిన అవసరం ఇంకేముంది చెప్పు.

ఏ విషయం నాకు చెప్పకుండా నువ్విలా ఏడుస్తూ కూర్చుంటే ఎలా!

చెప్పు లైలా? ఏమయ్యింది?"

ఆమెకి ధైర్యాన్ని చెప్తూ లాలనగా అడిగాడు.

"నేను.... నేను...."

"ఊఁ! నువ్వు....?"

"నేనో మనిషిని చంపేశాను"

అకస్మాత్తుగా అక్కడో పిడుగు పడ్డట్టయ్యింది.

"నువ్వు ఓ మనిషిని చంపావా?

ఎందుకు?

ఎందుకు చంపావు?

ఎక్కడ చంపావు?

అసలెలా చంపావు?"

క్షణాల్లో ప్రశ్నల వర్షం కురిపించాడు భార్గవ.

అలా అడుగుతూ ఆమెని కాస్త దూరం చేసి, తల పైకెత్తాడు.

"చూశావా! నేనంటే నీ కసహ్యం వేసి నన్ను దూరం చేస్తున్నావ్ కదూ!

నేనో హంతకురాల్నని నీకు నా మీద చిరాగ్గా వుంది కదూ!"

ఆమె మాటల్లోనే అర్ధమవుతోంది.

ఆమె అనుభవిస్తూన్న బాధ.

"పిచ్చి! నువ్వంటే నాకసహ్యమా?



అదెప్పటికీ జరగదు.

పిల్లిని చూస్తే భయపడే నువ్వు, ఓ మనిషిని చంపావంటే నమ్మలేకపోతున్నాను.

జోక్ చేస్తున్నావా?

ఈవేళ ఏప్రిల్ ఫస్టు కాదుగా!" ఆత్రుతగా అడిగాడు.

"నిజంగానే చెప్తున్నాను. జోక్ కాదు....

నేనో మనిషిని చంపేశాను భార్గవా. నిన్న చంపాను"

మునుపటంత దుఃఖం ఇప్పుడా గొంతులో లేదు.

"రా! ముందెక్కడయినా కూర్చుందాం! ఆ తర్వాత వివరాలు చెప్పవుగాని"

ఆమె చెయ్యి మృదువుగా నొక్కాడు భార్గవ.

"ఈ పక్కనే సిమెంటు చప్టా వుంది అక్కడ కూర్చుందాం, రా"

అతన్ని చెయ్యి పట్టి తీస్కెళ్ళింది.

ఆ చప్టా మీద కూర్చోగానే అతని ఒళ్ళోకి వాలిపోయింది లైలా.

"భార్గవా! నాకు నిజంగా భయమేస్తోంది.

హత్య చేసినందుకు నన్ను ఉరి తీస్తారు కదూ!

చావనేది తప్పదనుకో మనిషికి.

కానీ అలా మొహానికి ముసుగేసి, గొంతుక్కి తాడు చుట్టి ఉరేస్తే మెడ విరిగి చస్తాను కదూ!

ఊపిరాడదు కదూ అప్పుడు?

నాకు తల్చుకుంటేనే భయంగా ఉంది భార్గవా!" ఆమె ఏడుస్తోంది.

"లైలా! ఒక్క విషయం మర్చిపోకు.

నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు.

నేనంటూ ఉన్నన్నాళ్ళూ నీకే హానీ జరగదు, జరగనివ్వను.

ముందా వివరాలు చెప్పు— తర్వాత ఆలోచిద్దాం!"

"నీకు నామీదెంత ప్రేమ వున్నా, ఓ హంతకురాల్ని నువ్వెలా రక్షించగలవు భార్గవా?"

అతని గుండెల మీద వాలిపోయి కుమిలి కుమిలి ఏడ్చింది లైలా.

"తప్పనిసరయితే ఆ నేరం నా నెత్తి మీద వేసుకుని నేను శిక్ష అనుభవిస్తాను కానీ నీకు ఏ హానీ జరగనివ్వను. నా మాట నమ్ము."

"నేనిక్కడ నిన్నటి నుంచీ ఇలా భయంతో చస్తూంటే, నువ్వక్కడ బొంబేలో ఏ ఫైవ్‌స్టార్ హోటల్లోనో విశ్రాంతి తీసుకుంటూ గడిపేశావు కదూ!

నా మనసుపడే బాధ నీకు తెలియలేదా?

మనిద్దరి మనసులకీ మధ్య ఓ లింకు ఉందంటావుగా నువ్వు-

ఇప్పుడా లింకు ఏమయ్యింది?"

ఏడుస్తోందింకా లైలా,

"పిచ్చీ! నీకు దూరంగా నేను మాత్రం సుఖంగా ఉండగలనా?

ఎప్పుడు నిన్ను చూస్తానా అని ప్రతీక్షణం ఎదురుచూస్తూనే ఉన్నాను.

అదిసరే కానీ ముందా విషయం నాకు వివరంగా చెప్పు."

"నిన్న పొద్దున ఒకతనొచ్చాడు నా దగ్గరికి.

నేనప్పుడు ఈ గార్డెన్‌లో సరదాగా ఫోటోలు తీసుకుంటున్నాను.

నీకు తెలుసుగా ఫోటోగ్రఫీ నా హాబీ అని.

నాతో ప్రయివేటుగా మాట్లాడాలన్నాడు.

నాకంత అవసరం లేదన్నాను.

'భార్గవ విషయం' అన్నాడతను.



"మన విషయం ఎక్కడ లీకయిందో అనే భయంతో అతన్ని తీసుకుని స్విమ్మింగ్‌పూల్ దగ్గరకొచ్చాను.

ఇద్దరం ఆ గట్టున కూర్చున్నాం.

అతనో ఫోటో జేబులోంచి తీసి చూపించాడు.

అందులో నువ్వూ, నేనూ క్లోజ్‌గా వున్నాం.

ఆ ఫోటో చూడగానే భయంవేసింది నాకు.

అతనడిగిందివ్వకపోతే ఆ ఫోటో ఆయనకి చూపిస్తానన్నాడు.

ఏం కావాలో చెప్పాడు కూడా.

అంతే....!

నాకు పిచ్చికోపం వచ్చింది.

అతన్ని స్విమ్మింగ్‌పూల్లోకి తోసేశాను.

ఈత రాదనీ, సేవ్ చెయ్యమనీ అరిచాడతను.

నేను పట్టించుకోలేదు.

నా కళ్ళెదురుగానే అతను నీట్లో మునిగిపోయాడు.

మరి పైకి రాలేదు.

స్విమ్మింగ్ నాకిష్టమని ఆయనింత లోతుగా, వెడల్పుగా కట్టించిన ఆ స్విమ్మింగ్‌పూల్ అలా వుపయోగపడింది."

ఏకబిగిన చెప్పిందేమో....కొద్దిగా ఒగురుస్తోంది లైలా. ఆమెలో ఎక్కడలేని భయం, కంగారు.

"పోనీ వాడడిగిందిచ్చేస్తే అప్పటికా గండం గడిచేదిగా! నే నొచ్చాక ఆలోచించేవాళ్ళం— వేరే మార్గం ఏదయినా వుందేమో అని. అంత డేరింగ్ స్టెప్ తీసుకోకుండా వుండాల్సింది."

ఆమె జుట్టు సవరిస్తూ అన్నాడు భార్గవ.

చివ్వున తలెత్తింది లైలా.

"వాడడిగింది యిచ్చేయాలా?

వాడేమడిగాడో తెల్సా?

కనీసం ఊహించగలవా?

నేనంటే వాడికెంతో ఇష్టమట....

వాడికి లొంగిపోయి, వాడి మోజు తీర్చాలట....

చెప్పు భార్గవా! నేనా పని చెయ్యగలనా? ఆ పని చెయ్యమంటావా నువ్వు?

నీ కోసం దాచిన నా వయసుని, నీ కర్పించిన ఈ శరీరాన్ని వేరేట డర్టీ బ్లాక్‌మెయిలర్ అనుభవిస్తానంటే నేనొప్పుకోగలనా....? నువ్వొప్పుకుంటావా?"

తీవ్రంగా అడిగింది లైలా.

వాడి కోరిక వినగానే గుండాగినట్టయ్యింది భార్గవకి.

వాడికి తగిన శిక్షే పడిందనుకున్నాడు.

ఆమెకి తనపట్లగల సిన్సియారిటీకి కళ్ళు చెమర్చాయి భార్గవకి.

"డార్లింగ్! నా కోసం, నాదానిగా మిగిలిపోవడం కోసం ఒక హత్య చెయ్యడానిక్కూడా సిద్ధపడ్డావా?

ఇంత ప్రేమ నా కోసం దాచుకున్న నీకేం ఇవ్వగలను?

మళ్ళీ చెప్తున్నాను— వీలయినంతవరకూ ఈ నేరం జరిగిన ఆధారాలు లేకుండా చేద్దాం.

కాస్త చల్లబడ్డాక మనం పెళ్ళి చేసేసుకుని మరెన్నడూ ఇలాంటి బ్లాక్‌మెయిలింగ్‌కి ఛాన్స్ లేకుండా చేద్దాం.



ఖర్మవశాత్తూ నేరం బయటపడితే మాత్రం నీకు హాని కలగనివ్వను.

కోసం యింతగా తెగించావు నువ్వు.

ఆ శిక్షేదో నేనే అనుభవిస్తాను.

నీకు నామీదున్న ప్రేమకి ఇంతకంటే ఏమివ్వగలను చెప్పు?"

"భార్గవా! నిజంగానా? నువ్వు నిజంగా ఆ మాటంటున్నావా?

నీకు నా మీద అంత ప్రేమ ఉందా?

నా కోసం శిక్ష అనుభవించడానికి రెడీ అవుతున్నావా?

నిన్న అతనలా మునిగిపోతూ ఊపిరందక ఉక్కిరిబిక్కిరవడం సినప్పటినుండి నాకు నేను ఎదుర్కోబోయే ఉరిశిక్ష గుర్తొచ్చి గుండె గిపోతున్నాయి.

అయినా ఫర్వాలేదు. ఆ శిక్షేదో నేనే అనుభవిస్తాను.

నేనంటే ఇంత ఇష్టపడే నిన్ను ఉత్తిపుణ్యానికి ఆ ఉరికంబంపాలు నిస్తానా?

నిజానికి ఆ ఉరి అమలు జరక్కముందే భయంతో నా గుండాగి తుంది. అప్పుడు ఉరి భయమే ఉండదుగా?"

ప్రేమగా, ఆర్తిగా భార్గవ ఒళ్ళంతా తడుముతోంది లైలా.

"లైలా! నా నిర్ణయానికి తిరుగులేదు.

ఈ గండంలోంచి ఇద్దరం బయటపడదాం!

లేదంటే ఇందులో శిక్ష పడేది నాకే! ఇది మాత్రం ఖాయం...."

ఇంక ఆ మాటకి తిరుగులేదన్న నిర్ణయం ఉందా గొంతులో.

ఆ కమాండింగ్ వాయిస్ ముందు లైలా గొంతు పెగల్లేదు.

"ముందా శవం ఏమయిందో చూడాలి.

నిన్నటినుండీ ఇంతవరకూ ఆ స్విమ్మింగ్‌పూల్ దగ్గరికి ఎవరూ పోలేదా?

ఆ బాడీ ఎప్పుడో నీటి పైకి తేలిపోయి వుండాలే?"

ఆలోచిస్తూ అడిగాడు భార్గవ.

"ఆ స్విమ్మింగ్‌పూల్ దగ్గరికి నేనూ, ఆయనా తప్ప వేరెవ్వరూ పోరు.

నేను ఈత కొడుతూండగా ఎవరు నన్ను చూస్తారో అని ఆయన ఆ ఆర్డర్స్ పాస్ చేశారు.

నీళ్ళు మార్చడానికొచ్చే ఆ మనిషి తప్ప ఇంకే నౌఖర్లూ స్విమ్మింగ్ పూల్ దరిదాపుల్లోకి కూడా రారు.

ఆ నీళ్ళు మార్చే అతను నిన్ననే ఫోన్ చేశాడు.

మరో మూడు రోజుల తర్వాత రమ్మన్నాను.

ఆయన నా అందాన్నెవడు చాటుగా చూసేస్తాడో అని తీసుకున్న జాగ్రత్తలవి.

కానీ నువ్వు నన్ను అక్కడే మొదట చూడ్డం, మనిద్దరి మధ్య ఈ ప్రేమ బలపడ్డం జరిగిపోయింది కదూ! చూడెంత విచిత్రమో!"

ఒక్కక్షణం అతని కానాటి సంఘటన గుర్తొచ్చింది.

అనాడు తాను చూసిన ఆమె అందాలు, బొంకాలూ గుర్తొచ్చాయి. మరుక్షణంలో అతని కామెమీద వ్యామోహం రెట్టింపయ్యింది.

మనసిచ్చిన ఆడదాని కోసం మహాసంగ్రామాలు చేసి, వేల సైనికుల్ని బలిచ్చి రక్తపుటేరులు పారించిన మహారాజులున్నారు చరిత్రలో.

ప్రేమ కోసం జీవితాల్ని అవలీలగా చిరునవ్వుతో త్యాగం చేసిన అమర ప్రేమికులున్నారు చరిత్రలో.



అలాంటిది తను మాత్రం ఆపాటి త్యాగం చెయ్యలేడా?

దేవుడనుకూలిస్తే జరిగిన దానికి ఆధారాలు లేకుండా చేసి ఇద్దరూ బయటపడే అవకాశాలున్నాయి.

అలా కాని పక్షంలోకదా, తను ఉరికంబమెక్కేది?

తన కోసం హత్యని సైతం చేసిన అమాయకురాల్ని ఆ నేరం నుండి కాపాడ్డానికి తను వెనుదీయడు.

అసలు తనామె జీవితంలోకి ప్రవేశించకుంటే ఆమెకే బాధా లేక పోయేది.

దీనికంతా కారణం తనే!

కనక ఫలితం అనుభవించేదీ తనే!

స్థిర నిశ్చయానికొచ్చాడు భార్గవ.

"లైలా! నేనీ విషయంలో ఇరుక్కుని కోర్టుకెళ్ళినా బయటపడే అవకాశం కూడా వుంది.

మగాడ్ని కనక కోర్టు నుండి బయటకొచ్చినా, ఉరిశిక్ష కాక యావజ్జీవ కారాగార శిక్ష అనుభవించి బయటికొచ్చినా, లోకం నన్నేం చేయలేదు.

కానీ నువ్వు ఆడదానివి!

పరువున్న ఆడది ఒక్కసారి అనుమానం మీద జైలుకెళ్ళినా, తిరిగొచ్చి నలుగుర్లో తలెత్తుకు తిరగలేదు.

ఎలా ఆలోచించినా ఈ విషయంలో నేరం నా మీద వేసుకోవటమే ఉత్తమం లైలా!

మరో మాట అనవసరం....

ప్రస్తుతం మనం చెయ్యాల్సిందల్లా ఈ శవాన్ని మాయం చేసి వున్న ఆధారాల్ని నాశనం చెయ్యాలి.

టైమ్ లేదు. కమాన్....క్విక్...."

తొందరపెట్టాడు భార్గవ.

"నీ ఋణం ఎలా తీర్చుకోవాలి భార్గవా?"

కన్నీళ్ళతో అడిగింది లైలా.

"ఆ ఋణం ఎలా తీర్చుకోవాలో నేను తర్వాత చెప్తాలే! ముందు పని కానియ్యి.

అన్నట్టు చౌదరిగారు నిద్రపోయారా?"

"ఆ!....రోజూ రాత్రి ఆయన పాలు తాగుతారు.

నేనే ఇస్తాగా పాలు. ఈ రాత్రి పాలలో నిద్రమాత్రలు పొడిచేసి కలిపాను.

ఏనుగు చేత తొక్కించినా లేవరు."

"ఓ.కే. ఆ ప్రాబ్లమ్ లేదు. పద మనం స్విమ్మింగ్‌పూల్ దగ్గరకి వెళ్దాం".

బలవంతాన లైలాని లేవదీశాడు.

"భార్గవా! ఆ శవం నీటి మీద తేలి ఉంది. నేనిందాక చూశాను నాకు భయమేస్తోంది "

చిన్నపిల్లలా అతని చేతులు పట్టుకుంది.

ఒణుకుతూన్న ఆమె చేతులే చెప్తున్నాయి, ఆమె ఎంతగా భయపడుతున్నదీ.

"నువ్వు కాస్త ధైర్యం తెచ్చుకోవాలి లైలా!

ఒక్క అరగంట నాకు సహకరించావంటే చాలు.



ఇంక ఈ నీడ శాశ్వతంగా మనకి విరగడయి పోతుంది."

అతన్ని ఆసరాగా చేసుకుని భయం భయంగా స్విమింగ్‌పూల్ దాకా వచ్చింది.

"అసలు మనం చెయ్యాల్సిన పన్లు ఆలోచిద్దాం.

శవాన్ని ముందు బయటికి తియ్యాలి.

అఫ్‌కోర్స్! నాకు ఈత వచ్చు కనక నేనా పని చేస్తాననుకో.

ఆ శవాన్ని మాయం చెయ్యాలంటే కార్లో కేసి తీసికెళ్ళాలి.

ఉన్నదున్నట్లుగా శవాన్ని డిక్కీలోనో, వెనక సీటులోనో వేసికెళ్ళలేను కదా. శవాన్ని చుట్టడానికి ఓ గోనె సంచీ కానీ, ఓ తివాసీ కానీ కావాలి.

కారూ, తివాసీ రెడీగా ఉన్నాయా?"

"కారు గేరేజిలో వుంది.

కారు నేను వేసుకుని మెయిన్ గేట్లోంచి వెళ్ళి ఇటువైపు వస్తాను.

తివాసీ లేదు కాశీ జంబుఖానా ఉంది. అదీ దళసరిదేలే.

నా బెడ్ కింద ఉంటుంది."

"ఓ.కే.....తివాసీ లేకపోయినా ఫర్వాలేదులే జంబుఖానా చుట్టేద్దాం.

ఇంత రాత్రివేళ నువ్వు కారు వేసుకెళ్తాంటే గూర్ఖాకి అనుమానం రాదూ?"

"ఆయనకి అర్జంటుగా మందు కావాలనీ, డాక్టరు దగ్గర కెళ్తున్నాననీ ఇల్లు జాగ్రత్తనీ చెప్పి వెళ్తాను.

వాడు రేపాయన్ని అడుగుతాడా ఏమన్నానా? వాడికంత ధైర్యం కూడానా?"

"నిజమే. అలా చెయ్యి.

అన్నట్టు ఆ ఫోటో ఏమయింది?

అది వేరే వాళ్ళెవరి చేతుల్లో అయినా పడితే మన శ్రమ అంతా వృథా."

"ఆ ఫోటో అతని జేబులోనే పెట్టేసుకున్నాడు.

జేబులోనే ఉంటుంది."

"ఓ.కే. గుర్తుచెయ్యి. ఆ ఫోటో మనం తీసేసుకోకపోతే, మన నేరాన్ని మన నోటితో ఒప్పుకున్నట్టే.

శవం జేబులో ఆ ఫోటో దొరగ్గానే, పోలీసులు అనుమానించేది మననే.

అరెస్టు చేసి నేరం మోపేదీ మన మీదే"

"అవును. నేనంత దూరం ఆలోచించనే లేదు.

ముందా ఫోటో తీసెయ్యాలి మనం."

"లైలా! ఎంత తెలివయినవాడయినా హత్య చేశాక ఎక్కడో ఓ చోట పప్పులో కాలేస్తాడు.

మనం ఈ కంగారులో ఏం చేశామో మనకి గుర్తుండకపోవచ్చు.

ఓ పని చెయ్యి! నీ దగ్గర కెమేరా ఉంది కదా?"

"ఉంది. ఆటోమేటిక్ కెమేరా.

నిన్న అతనొచ్చాక ఆ కెమేరా విషయమే మర్చిపోయాను.

ఇక్కడే ఓ మూల పెట్టాను. చూస్తానుండు.

నీ దగ్గర టార్చి లైటుందా?"

జేబులోంచి అగ్గిపెట్టె తీసిచ్చాడు భార్గవ.

ఓ పుల్లగీసి వెలిగించి, ఆ వెలుగులో చూశారిద్దరూ.



స్విమింగ్‌పూల్‌కి దగ్గరగానే ఆ కెమేరా పెట్టినది పెట్టినట్టే ఉంది.

"ఆ రీలులో ఎన్ని ఫోటోలుంటాయి?

ఓ పదయినా ఉంటాయా?"

"నేను ఏవో రెండు మూడు సీనరీలు తీశానంతే. ముప్పయ్ పైనే వుంటాయి."

కెమేరాని చేత్తో తిప్పుతూ అంది లైలా.

"మోర్ దేన్ ఎనఫ్! ముందు శవం ఉన్నదున్నట్టు ఓ ఫోటో తియ్యి.

తర్వాత నేనా శవాన్ని తీస్తున్నప్పుడూ-తీశాకా-

ఇలా ముఖ్యమైనవన్నీ తియ్యి.

నీకే తెలుసుగా ఏవి తీస్తే పనికొస్తాయో."

"భార్గవా! మనం చేస్తున్నదే ఓ నేరం.

దాన్నిలా కెమేరాలో బంధించి మన నేరానికి ఋజువులూ, సాక్ష్యాలూ మనమే ఏర్పరచుకుంటున్నామేమో ఆలోచించు."

"లైలా! ఈ ఫోటోలు మనిద్దరి మధ్యనే కదా ఉండేది.

మనమే చేసిన నేరాన్ని మనం తీసిన ఫోటోలతో మనమే బయట పెట్టుకోం కదా.

జస్ట్! మనమే పొరబాట్లూ చెయ్యలేదని నిశ్చయించుకున్నాక వాటిని నాశనం చేసేద్దాం.

నేను నీకూ, నువ్వు నాకూ ద్రోహం చేసుకోం కదా."

"సరే నీ ఇష్టం"

అయిష్టం ధ్వనిస్తోందా అంగీకారంలో.

కానీ దాన్నంత సీరియస్‌గా తీసుకోలేదు భార్గవ.

అతను చెప్పినట్టే ముందుగా శవాన్ని ఫోటో తీసింది లైలా.

బట్టలు విప్పి గట్టున పెట్టి స్విమ్మింగ్‌పూల్లోకి దూకాడు భార్గవ.

శవం బోర్లా తేలి ఉంది.

దాన్ని సమీపించి ఆ శవం రెండు చేతులూ పట్టుకుని తన వీపు మీద వేసుకున్నాడు భార్గవ.

కింద నుంచి నీరు ఎత్తేస్తోంది కనక బరువు తెలియట్లేదతనికి.

చనిపోయిన మనిషి బరువెక్కువ.

అదీ నీళ్ళలో చనిపోతే మరీ బరువుగా వుంటుంది శవం.

అలాగే ఈదుకుంటూ ఒడ్డు చేరాడు.

శవాన్ని బలం అంతా ఉపయోగించి పైకి లాగాడు భార్గవ.

అప్పటికే శవం ఉబ్బింది.

అప్పుడో ఫోటో—

జేబులు వెతికి ఫోటో బయటికి లాగాడు భార్గవ.

చిన్న ప్లాస్టిక్ కవర్లో ఉంచినందువల్ల ఆ ఫోటో ఏమీ పాడవలేదు.

"లైలా! ఒక్కసారి మళ్ళీ అగ్గిపుల్ల గియ్యి"

"ఈ మాటు ఆ పెల్తురులో ఫోటో చూసిన భార్గవకి ఆ ఫోటో చింప బుద్ధి కాలేదు."

"లైలా! ఈ ఫోటో నా దగ్గరే ఉంచుతాను.

పాపం! బ్లాక్‌మెయిలింగ్ కనే తీసినా చాలా చక్కటి ఫోటో తీశాడు.

తృప్తిగా చూసుకున్న తర్వాత మనం ఆ ఫోటోలు కాల్చేసేప్పుడిదీ కాల్చేద్దాం."



"ఆ ఫోటో నా దగ్గరుంచుతా" లైలా అడిగింది.

"నీ దగ్గరుంటే నేనెలా చూసుకోగలను? నా దగ్గరే ఉండనీలే.

అయినా ఈ ఫోటో చూస్తే నీకు మళ్ళీ ఈ కథంతా గుర్తొస్తుంది" అన్నాడతను.

మాట్లాడలేదు లైలా.

ఆ కవర్ని జేబులో పెట్టేసుకున్నాడు భార్గవ.

లోపల నుండి లైలా జంబుఖానా తెచ్చేలోగా మరోసారి జేబులన్నీ వెదికాడు-ఒకవేళ నెగిటివ్ కనిపిస్తుందేమో అని.

పెన్నూ, కొద్దిగా డబ్బూ తప్ప పనికొచ్చేవేమీ దొరకలేదు.

శవాన్ని జంబుఖానాలో వేసి చుట్టారిద్దరూ కలిసి.

ఎంత బరువుందో చూద్దామని ఓసారి భుజాన వేసుకున్నాడు భార్గవ.

పర్వాలేదు.... మొయ్యగలడు తను.

"లైలా! వీడెవడో కిందటి జన్మలో నా తండ్రయి ఉంటాడు.

ఈ జన్మలో వీడ్నిలా మోసి ఆ ఋణం తీర్చుకుంటున్నా" చిన్నగా నవ్వాడు భార్గవ.

అలాంటి పరిస్థితిలో కూడా జోక్స్ కట్ చేస్తున్నందుకు అతని సెన్సాఫ్ హ్యూమర్‌కి మెచ్చుకుంది లైలా.

కారు తేవడానికని బిల్డింగులోంచి గేరేజికి వెళ్ళింది.

ఆమె కారు చుట్టూ తిప్పి తెచ్చేలోగా శవాన్ని పెరటి గేటు దగ్గరకి మోసుకొచ్చాడు భార్గవ.

కారు పక్కనే ఆగగానే వెనక డోర్ తీసి వెనక సీటుకి ముందు సీటు వెనక భాగానికీ మధ్య గల ఖాళీలో పడుకోబెట్టాడు.

పొట్టి మనిషేమో అతను-శవం ఆ ఖాళీలో చక్కగా సరిపోయింది.

"బై! లైలా, రేపుదయం ఫోన్ చేస్తా"

స్పీడందుకున్న కారు క్షణాల్లో కనుమరుగయ్యింది.

* * * *

టాంక్‌బండ్ వేపు కారు పోనిస్తున్నాడు భార్గవ.

రాజ్‌భవన్ దాటి ఎదరకొచ్చాడు.

కనుచూపుమేరలో ఎవరూ లేరు.

అసలే విశాలమైన రోడ్డేమో శరవేగంతో కారుపోనిస్తున్నాడు.

ఎదురుగా ఓ కారు రావడం కనిపిస్తోంది.

ఆ కారు దగ్గరవుతూన్నకొద్దీ అర్ధమయిపోతోంది భార్గవకి.

ఆ కారు డ్రైవర్ గుర్రం ఎక్కి వున్నాడని.

మామూలు పరిస్థితిలో అయితే భయపడేవాడు కాదు భార్గవ.

కానీ ఇప్పుడు తనున్నది అతి సున్నితమైన పరిస్థితి.

ఈ స్థితిలో ఏ యాక్సిడెంట్‌లోనో ఇన్‌వాల్వ్ అయి, పోలీసుల చేతులలో తను యిరుక్కున్నాడంటే, తన పని అఖరే అని తెలుసు అతనికి.

అందుకే అతి జాగ్రత్తగా పోనిస్తున్నాడు కారుని.

కారు వేగం తగ్గిపోయింది.

చాలా నెమ్మదిగా పోతోంది కారు.

అసలా పరిస్థితిలో యాక్సిడెంటయ్యే అవకాశమే లేదు.

కానీ....

కానీ....



సడన్‌గా ఎదుటి కారొచ్చి ఢీ కొట్టింది అతని కారుని.

కారు హెడ్‌లైట్లు భళ్ళున పగిలిపోయాయి.

రెండు కార్లూ ఆగిపోయాయి.

అవతలి కారు డోరు భళ్ళున తెరుచుకుని కారు దిగాడా డ్రయివింగ్ ట్లోని వ్యక్తి.

సరిగ్గా నిలబడ్డం కూడా చేతకావట్లేదతనికి.

ఫుల్ డోస్‌లో ఉన్నాడు.

"అరే! ఎవడ్రా అది? తాగి నడుపుతున్నావా కారు?

ఎవడ్రా నీకు లైసెన్సిచ్చింది?

నడు పోలీస్ స్టేషన్‌కి"

కార్లో కూర్చున్న భార్గవని బయటికి లాగాడా వ్యక్తి.

భార్గవకి గుండాగినంత పనయ్యింది.

తను భయపడినట్టే అయ్యింది.

ఇప్పుడు ఈ తాగుబోతు చేతుల్లోంచి తప్పుకోకపోతే ఇక్కడితో తన ఛాప్టర్ క్లోజే!

తాగిన వాడితో తగువులాడి లాభంలేదు.

తప్పు తనదే అని ఒప్పుకుని తప్పుకోవడమే సరయిన పని అనిపించింది.

"సారీ భాయ్! అనుకోకుండా కాస్త ఎక్కువేసుకున్నాను.

ఫారిన్ సరుకు దొరికేసరికి ఒళ్ళు తెలియలేదు.

ఏమీ అనుకోవద్దు భాయ్."

తాగినట్టే అభినయిస్తూ అవతలి వ్యక్తి గడ్డం పట్టుకు బ్రతిమాలాడు భార్గవ.

"నాన్సెన్స్! తాగి కారు డ్రయివ్ చేస్తున్నావా?

ఎంత ధైర్యంరా నీకు?

ఇప్పుడే పెద్ద యాక్సిడెంటయి, నా ప్రాణాలు పోతే నా పెళ్ళాం బిడ్డల కెవర్రా దిక్కు?

మనిషి ప్రాణాలంటే నీకు గడ్డిపరకలా ఉందట్రా?

రాస్కెల్....

పద స్టేషన్‌కి...."

ఇష్టమొచ్చినట్టు తిడుతున్నాడవతలి వ్యక్తి మత్తులో.

ఒళ్ళు మండిపోతోంది భార్గవకి.

కారులో ఆ శవం లేకపోయినట్టయితే వాడి అంతు చూసి వుండే వాడే.

ఆ శవం అతన్ని కట్టిపడేస్తోంది.

మొగుడ్ని కొట్టి మొగసాలెక్కి ఏడ్చిందట వెనకటి కెవరో ఒకా విడ....

అలాగ తప్పు తనదై ఉండీ దబాయిస్తున్నాడా వ్యక్తి.

చేతకానివాడిలా వాడి తిట్లు పడుతున్నాడు తను.

"ఏంటి భాయ్! మరీ అంత ఎగుర్తున్నావ్?

శాంతం ఉండాలి భాయ్!

కావాలంటే నాతో రా!

పోయి ఓ పెగ్గు వేసుకొద్దాం."

ఆహ్వానిస్తూ అన్నాడు భార్గవ.

అంత మత్తులో కూడా అవతలతనికి ఆ పిలుపు సంతోషంగా ఉన్న ట్టుంది.



"సరే రా పోదాం!

అది సరే కానీ నువ్వొక్కడివేనా కార్లో?

మందు కొట్టావ్!

అడదెక్కడ....?"

అంటూ వెనక సీట్లోకి తొంగిచూశాడు.

స్ట్రీట్ లైట్ల వెలుగులో శవాన్ని చుట్టిన జంబుఖానాకున్న రం... ...దస్తూ కనిపించాయి.

"అర్నీ! నువ్వు ఘటికుడివయ్యా!

ఆ పిల్ల నెక్కడ ఎవరు చూస్తారో అని కిందన పడుకోబెట్టావా.

తెలివంటే నీదే బాబూ!

రాత్రంతా పిల్లతో మజా చేస్తావ్!

ప్రొద్దున్నే పెద్దమనిషిలా మారిపోతావు"

ఏం చెప్పాలో అర్థం కాలేదు భార్గవకి.

అవతల తను మందుమీదున్నాడు కనక శవాన్ని ఆడపిల్లగా భ్రమ ...డుతున్నాడు.

అదీ ఒకందుకు మంచిదే!

ఇంకా ఇక్కడే ఉంటే ఎవరన్నా వచ్చి చూసినా కష్టమే!

క్షణాల మీద కారు బేక్ చేసుకుని వెళ్ళిపోబోయాడు భార్గవ.

కానీ తనో విషవలయంలో చిక్కుకున్నానని ఆ క్షణంలో అతనికి ...లేదు.

"దొంగనాయాల! మందు కొడదాం రమ్మని పిలిచి అలాగే జారుకుం ...నా?

కొడద్దిరా....

నీకు నా ఉసురు తప్పకుండా కొడద్ది."

అతనికి వినబడేలా అరిచాడతను.

ఆ నిశ్శబ్దంలో అతని అరుపులు గట్టిగా ప్రతిధ్వనించాయి.

పట్టించుకోనట్టే మాయమయ్యాడు భార్గవ.

అప్పటివరకూ తాగుడు మత్తులో తూలిపోతున్నట్టు నటించిన ఆ అకస్మాత్తుగా నిటారుగా నిలబడ్డాడు.

వెళ్ళిపోతున్న భార్గవ కారుకేసి చూసి వికృతంగా నవ్వాడతను.

అది తాగుబోతు నవ్వులా లేదు!

కుట్రలూ, కుతంత్రాలూ చేసే ఓ క్రూక్ నవ్వులా ఉంది.

* * * * *

ట్యాంక్‌బండ్ పైన కారాపాడు భార్గవ.

అంతా నిర్మానుష్యంగా వుంది.

రెండువేపులనుంచి ఏవిధమైన వాహనం రావడంలేదు.

పోలీసులు గస్తీకొస్తారేమోనని భయంగా వుంది.

మొహానికి పడుతున్న చెమటని తుడిచేసుకొని మొండి ధైర్యంతో కారు దిగాడు భార్గవ.

లైలా పైన ఉన్న ప్రేమకొద్దీ ఈ సాహసానికతను ఒడిగట్టాడు.

తననెవరూ గమనించలేదని అతననుకుంటున్నాడే తప్ప తనో రకంగా సాలెగూటిలో చిక్కుకున్నానని మాత్రం అతను గ్రహించలేదు.

వెనక డోర్ తెరిచి శవాన్ని బయటికి లాగాడు.

దాన్ని భుజాన వేసుకుని రెయిలింగ్ దగ్గరగా నడిచి, జంబుఖానా తీసేసి శవాన్ని నీళ్ళలోకి విసిరాడు.



అప్పటికే నీళ్ళలో నాని ఉండటంచేత శవం చాలా బరువుగా అనిపించింది.

కానీ అవసరం కనక అదేమీ అతను లక్ష్యం చేయలేదు.

ఎన్నో కథల్లో, నవలల్లో, యదార్థగాథల్లో కూడా చాకలి గుర్తుల ద్వారా హంతకుడ్ని పోలీసులు పట్టుకున్న సంఘటనలు తెలుసతనికి.

ముందు జాగ్రత్తగా జంబుఖానా తీసేశాడు.

దాన్ని కారులో పడేసి....

నిట్టూర్చి కారెక్కాడు.

దూరంగా ఏదో వ్యాన్ లాంటిది వస్తోంది.

అది పోలీస్ పెట్రోలింగ్ వ్యాన్‌గా గుర్తించి గభాల్న కారెక్కి స్టార్ట్ చేశాడు భార్గవ.

* * * * *

ఇంటికెళ్తూనే లైలాకి ఫోన్ చేశాడు భార్గవ.

అవతల ఫోన్ రింగవగానే ఎత్తింది లైలా.

పాపం.... తన ఫోన్ కోసమే ఎదురు చూస్తున్నట్టుంది అనుకున్నాడు భార్గవ.

"లైలా! అంతా పూర్తయిపోయింది. నువ్వేం వర్రీ కాకు."

అతని మాటలు వినగానే తేలిగ్గా నిట్టూర్చింది లైలా.

"భార్గవా! భయంతో చచ్చిపోతున్నాను నేను.

పొద్దున్నే కనిపిస్తావు కదూ!"

ఆత్రుతగా అడిగింది లైలా.

"వీలయినంతవరకూ నేనక్కడికి రాను....

ఆ ఫోటోలు ఎక్కడ డెవలప్ చేయిస్తావు?"

"ఇంట్లో నేనే కడిగేస్తాను. ఈ రాత్రే ఆ పని చేస్తాను."

"ఓ.కే. ఆ ఫోటోలు తీసుకుని రేపు మధ్యాహ్నం పన్నెండింటికల్లా "ఇందూ డీలక్స్'కి రా!"

అక్కడ మనం లంచ్ చేస్తూ మాట్లాడుకుందాం!

ఇంక ఏమీ ఆలోచించకుండా ప్రశాంతంగా నిద్రపో!

నేనున్నాను. భయపడకు....

"ఎవ్విరిథింగ్ విల్ బి ఆల్‌రైట్! గుడ్‌నైట్"

లైలా నోట కూడా 'గుడ్‌నైట్' అన్న మాట రాగానే ఫోన్ పెట్టేశాడు భార్గవ.

పడుకోబోతూ మరోసారి ఆలోచించాడు భార్గవ.

తనేదన్నా పొరబాటు చేశానా అని.

ఆ తాగుబోతెవడో కానీ ఎదురయి వుండకపోతే అసలు తన విషయము ఎవరికీ తెలిసేది కాదనిపించింది.

అంతలోనే అనిపించిందతనికి.

ఆఫ్టారాల్ వాడేం చెయ్యగలడు?

చేస్తున్నదీ, చూస్తున్నదీ క్లియర్‌గా తెలుసుకోలేని అసక్తిలో ఉన్న వ్యక్తి కాడు....

వాడివల్ల తనకొచ్చే నష్టం ఏదీ ఉండదు అనుకొన్నాడు.

శవాన్ని హుస్సేన్‌సాగర్‌లో పడేసి మంచిపనే చేశాననుకున్నాడు.

ఎలాగూ నీళ్ళలోనే పడి చచ్చాడు వాడు....

తిరిగి దాన్ని నీళ్ళలోనే పడేశాడు తను



చావడానికి కారణం నీళ్ళలో పడటం వల్లనే అని పోలీసులనుకుంటారు.

తన అదృష్టం బాగుండి వాడి వివరాలు దొరక్కపోతే, అన్ ఐడెంటిఫైడ్ బాడీగా కేసు క్లోజయిపోతుంది కూడా.

కాస్త రిలీఫ్‌గా అనిపించిందతనికి.

ఆలోచిస్తూ అలాగే నిద్రలోకి జారుకున్నాడు భార్గవ.

* * * * *

మామూలుగానే తెల్లవారింది.

కానీ భార్గవకి మాత్రం చెప్పలేనంత టెన్షన్‌గా వుంది.

ఆలోచనలతో ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు.

తను హుస్సేన్‌సాగర్ నీటిలో విసిరిన శవం ఈ పాటికి పైకి తేలి వుంటుంది.

తన ఆలోచనకి తనే నవ్వుకున్నాడు పిచ్చిగా.

స్విమ్మింగ్‌పూల్లోనే తేలిన శవం హుస్సేన్‌సాగర్‌లో ఎందుకు తేలదు?

అసలు నిజంగా తనెంతో పొరపాటు చేసినట్లుగా అనిపిస్తోంది అతనికి.

శవానికి ఓ రాయి కట్టి పడేయాల్సింది.

శవం అలాగే నీళ్ళ అడుగున కుళ్ళిపోయేది.

ఆ కంగారులో తనకా ఆలోచన రాలేదు.

రాయికట్టి కారులోంచి శవాన్ని తీసి అంత పబ్లిక్ ప్రదేశంలోంచి నీళ్ళలో విసరగలగడం ఒక్క మనిషివల్ల అయ్యే పనికాదు.

అసలు శవమే బరువు.

దానికి రాయి కట్టడం....

ఎంత పిచ్చి ఆలోచన?

కానీ....

ఇప్పుడా శవాన్ని ఎవరయినా గుర్తు పడితేనే రిస్క్.

తీగ లాగితే డొంకంతా కదుల్తుంది.

ఇలాంటి తప్పులు మళ్ళీ చేయకుండా జాగ్రత్త పడాలనుకొన్నాడు.

ఆత్రుతగా పేపరు చూశాడు.

ఆ హత్య గురించి ఏమైనా రాశారేమోనని.

క్రైమ్ కార్నర్‌లో గుర్తు తెలీని శవం అంటూ రాసి వుంది.

ఖచ్చితంగా శవం బయట పడుతూంది.

అయితే అది హత్యో, ఆత్మహత్యో తేలాలి.

కానీ అతను నీళ్ళల్లో పడి చనిపోయాడు కనక అది ఆత్మహత్యగా భావిస్తారు.

ప్రస్తుతానికి ప్రమాదం లేదనిపించింది భార్గవకి.

* * * * *

ఇన్స్‌పెక్టర్ మురళి కుర్చీలో ఇబ్బందిగా కదిలాడు.

హుస్సేన్‌సాగర్‌లో తేలిన ఆ శవం గురించి వృత్తిపరమైన కుతూహలంతో తెలిసిన ఆ విషయాన్నే ఓసారి చదివాడు మురళి.

ఆ వార్త పేపర్‌కిచ్చింది అతనే.

అది అతని జూరిస్‌డిక్షన్లోకే వస్తుంది.



హుస్సేన్‌సాగర్‌లో శవాలు తేలడం అన్నది చాలా మామూలైన విషయం.

ఏదన్నా శవం తేలకపోతేనే న్యూస్ అవుతుంది.

అయితే అవి ఆత్మహత్యలో, హత్యలో నెమ్మదిగా దర్యాప్తులో తేలుతుంది.

అయితే ఈమధ్యలో పోలీస్ ఆఫీసర్లు చస్తుంటారు ఆ శవాల గొడవలో.

శవాన్ని బయటకి తీయించడం....

పోస్ట్‌మార్టం చేయించడం....

ఆ శవాన్ని గురించిన ప్రకటన లివ్వడం....

దర్యాప్తు....

ఇలా చాలా తతంగం....

అసలు బ్రతుకు అనేది రానురానూ మరీ తేలికై పోతుంది.

ఎక్కడ చూసినా చావడాలు....

చంపుకోడాలు....

విసుగ్గా పేపర్‌ని పక్కన పడేశాడు మురళి.

* * * * *

పని అనుకున్నట్టుగానే జరిగిందని లైలాకి ఫోన్‌లో చెప్పాడు భార్గవ.

"నిన్నెవరయినా చూశారా?"

ఆత్రుతగా అడిగింది లైలా.

"ప్చ్! అవన్నీ పర్సనల్‌గా మాట్లాడుకొందాం.

ఫోన్లో వద్దు....

నువ్వు కంగారు పడుతుంటావని చెప్పాను"

అన్నాడు భార్గవ.

"భలేవాడివి. కంగారని చిన్నమాట వాడావు చచ్చిపోతున్నాను.

ఏమో! నాకనిపిస్తుంది.

నేను పీకలవరకూ మునిగిపోయాను.

లైలా గొంతులో వణుకుని భార్గవ గమనించాడు.

భయపడుతోన్న ఆమెకి ధైర్యం చెప్పాల్సిన బాధ్యత తనదిగా అనుకొన్నాడు భార్గవ.

అందుకే ఆమె కోసం మధ్యాహ్నం ఇంటికొచ్చేయాలనుకొంటూనే.

"భయపడకు!" అన్నాడు.

"నీ గదికొస్తాను" అందామె.

"అలాగే" అన్నాడు భార్గవ.

* * * *

ఆమె లోపల అడుగు పెడుతూనే అతన్ని తీగలా అల్లుకుపోయి....

"నేను ఇరుక్కొన్నాను.

నన్నెవరూ రక్షించలేరు....

నాకు చావే గతి!"

ఏడవడం మొదలు పెట్టింది లైలా.

అతను ఆమె వీపుపైన చేత్తో నిమురుతూ....

"పిచ్చి లైలా! జరిగిన పొరపాటుని కప్పి పుచ్చుకోడానికి, తప్పించుకోడానికి మనం చేయవలసింది చేశాం.



ఇది రహస్యంగా వుంటుందని నా నమ్మకం.

ఒకవేళ కేసు బయటపడి, అనుమానం మనమీద కొస్తే-

నీకిదివరకే చెప్పాను.

నీ కోసం అవసరం అయితే నా ప్రాణాలిస్తానని.

నువ్విలా బెంబేలు పడిపోయి చేతులెత్తేస్తే మొత్తానికే ప్రమాదం"

అన్నాడు భార్గవ.

లైలా అతనికేసి అయోమయంగా చూసింది.

"ఏమో? నాకు కళ్ళు మూసినా తెరిచినా ఆ శవమే కనిపిస్తోంది ర్గవా!

వాడు దెయ్యం అయి నన్ను పట్టుకొంటాడేమో ననిపిస్తోంది"

ఆమెకి ఏడుపొస్తోంది.

అప్రయత్నంగా ఆమె నుదుటిపైన ముద్దు పెట్టుకొని అన్నాడు.

"నేను ఎంత మగాడ్ని అయినా, లోకల్ కేసులో ఎక్కడ ఇరుక్కుంటామోనని నాకూ భయంగానే వుంది లైలా.

అలాగని తెలివితక్కువగా ప్రవర్తిస్తే మనిద్దరికీ కష్టమే!

చెప్తున్నాగా! నీకే కష్టమూ రానివ్వనని ఇంతగా చెప్తున్నా, నువ్వు సపడ్తున్నావంటే నా మీద నీకు నమ్మకం లేదనిపిస్తోంది"

లైలా అతని గుండెలపైన వాలిపోయి తలెత్తి అతని ముఖంలోకి స్తూ అంది.

"నీ మీద నమ్మకం వుండడం చేతనే కదా భార్గవా, నా బాధ నీకు ప్పుకొంది.

కానీ ఈ నేరంలో ఇరుక్కుని నువ్వెక్కడ జైలుకెళ్తావోనని నా యం.

అలా జరిగితే నేనేమై పోవాలి?" ఆమె దిగులుగా అంది.

"అలా ఏం జరగదులే" అన్నాడతను.

"ఇంతకీ నిన్నెవరలా చూడలేదా?" అడిగింది.

భార్గవ కళ్ళముందు ఆ తాగుబోతు మసిలాడు.

"చూడలేదా అంటే చూశాడు ఓ తాగుబోతు.

చూశాడా అంటే చూడలేదు అని చెప్పాల్సి వస్తుంది."

అతని రూపం మనసులో మెదులుతోంది భార్గవకి.

"అంటే?" ఉలిక్కిపడింది లైలా.

భార్గవ రాత్రి ఏం జరిగిందో వివరించి చెప్పాడామెకి.

"వాడా సమయంలో తాగిన మత్తులో వున్నాడు కనక సరిపోయింది.

అందుకే వెనక శవాన్ని చూసినా వాడికే అనుమానమూ రాదన్నది మాత్రం ఖచ్చితంగా చెప్పచ్చు.

ఆ విషయాన్ని మనం మరచిపోవచ్చు."

ఓ రకమైన ధీమాతో అన్నాడు భార్గవ.

లైలా అతని భుజంపైన చెయ్యి వేసింది.

"నువ్వంత నమ్మకంగా చెప్తున్నావంటే ఇంక ఆ విషయంలో భయం అనవసరమేలే! అయినా నాకనిపిస్తుంది—

వాడా మాత్రం కూడా చూడకుండా వుంటే బాగుండేదని" అందామె.

అతను ఆమె చెక్కిళ్ళని నవరదీస్తూ అన్నాడు-

"అవును లైలా! అసలీ చెడ్డ సంఘటన జరక్కుండా వుంటే బాగుండేదని.

కానీ అది జరగకుండా ఆపడం మన చేతుల్లో వుందా?"



మృతుడి పేరు సదాశివం అని తెలిసింది.

మురళి సర్వీసులో ఎన్నో క్లిష్టతరమైన కేసులు పరిశోధించి హంతకుల్ని పట్టుకున్నాడు.

కానీ ఒకేసారి మూడు కేసులు తగలడం ఇదే ప్రథమం.

పైగా ఏ కేసూ ఓ కొలిక్కి రావడం లేదు.

మళ్ళీ ఓసారి డాక్టర్ నీలకంఠం కేసుని సింహావలోకనం చేసుకోసాగాడు.

నిజానికి అతనిది హత్య అనేదాని కన్నా ప్రమాదవశాత్తు మరణించాడనుకోడానికే అవకాశాలెక్కువగా వున్నాయి.

కాలు జారి పడిపోయి వుంటాడేమో!

"కానీ హత్యే అయితే ఆ హంతకుడెలా దొరుకుతాడు?

ఆ రోజు హోటల్ టాయ్‌లెట్లో చేతి ప్రింట్సు దొరికాయి.

అవి రక్తపు మరకలతో.

దాన్ని బట్టి హత్య అనుకోవాల్సి వస్తుంది.

అయితే మరోలా జరిగి వుండాలి.

ఏ తెలిసిన వ్యక్తో వస్తే, మాట్లాడుతూ మధ్యలో బాత్రూం కెళ్ళి వుండచ్చు నీలకంఠం.

అతను కాలుజారి పడుతూ అరిచి వుండాలి.

అతనితో మాట్లాడానికొచ్చినతను డాక్టరు మరణించడం చూసి వుండాలి.

అనుకోని సంఘటనకి ఆ మనిషి కంగారులో ఆ రక్తాన్ని తాకి వుండచ్చు.

అది అతని చేతి ముద్రే అయి వుంటుంది.

ప్రమాదం జరిగిన సమయంలో అతనక్కడే వున్నా ఎక్కడ తన పైన నేరం పడుతుందోనని అతను పారిపోయి వుండచ్చు

అన్నీ ప్రాబబిలిటీస్ మాత్రమే!

ఖచ్చితంగా ఓ నిశ్చయంలోకి రాలేకపోతున్నాడు.

మరోమాట నీలకంఠం అర్ధరాత్రి మరణించాడు.

కనుక ఎవరో వ్యక్తి ఆ వేళ కాని వేళలో డాక్టరుతో మాట్లాడానికి వచ్చాడనుకోవడం అసంబద్ధంగా అనిపించింది.

ఒకవేళ ఆ రాత్రి అతను కూడా నీలకంఠంతోపాటే ఆ గదిలో వున్నాడనుకోడానికి లాజిక్ ఒప్పుకోవడం లేదు

గెస్ట్ ఎవరైనా వస్తే హోటల్ వాళ్ళకి తెలుస్తుంది.

అదీకాక ఆ ఊరు నీలకంఠానికి కొత్త.

ఇక్కడతనికి పెద్దగా సన్నిహితులు లేరని దర్యాప్తులో తేలింది.

అతనేదో పని మీద ఇక్కడికొచ్చాడని తెలిసింది.

కొద్దిపాటి పరిచయం వున్న ఏ వ్యక్తినీ రాత్రి తనకి తోడుగా పడుకోమని ఎవ్వరూ అడగరు.

ఆ రాత్రి అతనితో వేరే వ్యక్తి ఉండే వుంటే, అతను తప్పకుండా డాక్టరుకి సన్నిహితుడై వుండాలి

చదువూ, సంస్కారం వుండి, పవిత్రమైన వైద్య వృత్తిలో ఉన్న నీలకంఠం, అవతల వ్యక్తి కూడా తనలాంటివాడే అయితే తప్ప అతన్ని సన్నిహితుడిగా సర్కిల్లోకి రానివ్వడు.



తన ఆప్తుడైనవాడు అనుకోకుండా కాలుజారిపడితే, ప్రాణాలు కోల్పోతే ఆ వ్యక్తి అంత బాధ్యతారహితంగా తనకేమీ పట్టనట్టు వెళ్ళిపోతాడా?

నీలకంఠంలాంటి వ్యక్తికి ఆప్తుడైన ఆ మనిషి ఓ మామూలు చదువుకోనివాడిలా పోలీసులకి, వాళ్ళ ప్రశ్నలకి భయపడి అలా తెరచాటుకి వెళ్ళిపోతాడా?

ఆ ఆలోచన అంతగా నచ్చలేదు మురళికి.

అంతలోనే మరో విషయం స్ఫురించిందతనికి.

ఆ వేలిముద్ర ఆ ఒక్క ప్రదేశంలో మాత్రమే దొరికింది.

గదిలో మరెక్కడా మరో వ్యక్తి వేలిముద్రలు లేవు.

అంటే....కావాలనే వాటిని తుడిచేసి వుండాలి.

అవతలి వ్యక్తి అమాయకుడే అయితే అతనికా అవసరం లేదు.

కళ్ళెదురుగా ఓ స్నేహితుడు అనుకోని రీతిలో మరణిస్తే, అంత షాకులోనూ తన వేలిముద్రల్ని తుడిచెయ్యాలనే ఆలోచన మామూలు మనిషికి రాదు-క్రిమినలు బుర్రున్న వ్యక్తికి తప్ప.

అంతలోనే అతనికి ఆ రోజున అనుకోకుండా తన చెయ్యి బాత్రూం గోడ మీద పడి జారిపోడం గుర్తొచ్చింది.

అంటే....అంత నున్నగా ఉన్నాయన్నమాట ఆ గోడలు.

నిజంగా నీలకంఠం కాలుజారి కిందపడ్డా ప్రాణాలు పోయేంత గాయం కావడానికి గోడలకి ఏ వంపులూ లేవు. ఏ మూలలూ లేవు.

అంటే....అతనిది హత్య అయి ఉండడానికే అవకాశాలున్నాయి.

మళ్ళీ ఓసారి ఆ హోటలుకెళ్ళి ఏదయినా పనికొచ్చే సమాచారం లభిస్తుందేమో ప్రయత్నించాలని ఎందుకో అతనికి అనిపించింది.

తక్షణం జీపెక్కి బయల్దేరాడు ఇన్‌స్పెక్టరు మురళి.

నిజానికి మురళిగా అతను విశ్రాంతి కోరుకున్నా, ఇన్‌స్పెక్టరుగా అతనికి నిద్రాహారాల అవసరం లేదు.

వ్యక్తిగత సుఖాలు అతన్ని విద్యుక్త ధర్మం నించి మళ్ళించలేవు.
అందుకే డిపార్టుమెంట్‌లో అతనికి అంత మంచి పేరు.

* * * *

"నమస్తే సాబ్"

ఇన్‌స్పెక్టర్ రాకని గమనించగానే పలకరించాడు హోటల్ మేనేజర్.

తల పంకిస్తూ ఠీవిగా లోపలికి నడిచాడు మురళి.

"కూర్చోండి సాబ్! సార్‌కి చల్లగా ఓ కూల్‌డ్రింక్ తీసుకురా"అని బోయ్‌కి పురమాయించాడు మేనేజర్.

"అవేం అక్కర్లేదు. నాకో ఇన్ఫర్మేషను కావాలి"
కూల్‌డ్రింకుకి వెళ్ళబోతూన్న బోయ్‌ని వారించి పంపేశాడు మురళి.
"చెప్పండి సార్"

"డాక్టరు నీలకంఠం మీ హోటల్లో దిగినప్పుడు అతని రూమ్ సర్వీసింగ్ బోయ్‌ని పిలిపించండి."

"ఇప్పుడే పిలిపిస్తా సార్....
శేషూ! నువ్వెళ్ళి చంద్రాన్ని పిలుచుకురా"
కూల్‌డ్రింక్ కోసం పిలిచిన బోయ్‌కి చెప్పాడు మేనేజర్.
గబగబా లోపలికి నడిచాడు శేషు.

మరో రెండు నిమిషాలకి అక్కడికో కుర్రాడొచ్చాడు.



"ఇతనే సార్! 'చంద్రం' అని నీలకంఠంగారికి రూమ్ సర్వీసింగ్ చేసినతను."

మురళితో అన్నాడు మేనేజర్.

ఆ కుర్రాడ్నోసారి పరికించి చూశాడు మురళి.

సన్నగా పొడుగ్గా ఉన్నాడతను.

చురుకయిన చూపులు, హొందగ్గా బుద్ధిమంతుడిలాగే వున్నాడు.

"అః చూడూ! నీ పేరేమిటన్నావ్? చంద్రమా?"

ప్రశ్నించాడు మురళి.
"అవున్సార్"
నెమ్మదిగా జవాబిచ్చాడతను.

అతని వినయం తెచ్చిపెట్టుకున్నదాన్లా లేదు.

నిజానికి ఇంతకుముందే చంద్రాన్నెప్పుడో ప్రశ్నించి ఉండాల్సింది.

కానీ....ఆ మరణం హత్యగా అనిపించక యాక్సిడెంటల్ డెత్‌గా అనిపించినందువల్ల ఆ విషయంలో పెద్దగా శ్రద్ధ చూపించ లేదు ఇన్‌స్పెక్టర్.

కానీ ఇప్పుడు ఈ హత్యా రహస్యాన్ని ఛేదించాలంటే ప్రతీ చిన్న విషయాన్నీ తరచి చూడ్డం తప్పనిసరి.

"చంద్రం! అలా కూర్చో!"

చంద్రానికి ధైర్యాన్నిస్తున్నట్టుగా చనువుగా అన్నాడు మురళి.

అతనికి తన దగ్గర బెరుకుని, భయాన్నీ పోగొట్టినప్పుడే అతన్నించి కావలసిన సమాచారాన్ని రాబట్టుకోగలడన్నది అతనికి బాగా తెలుసు.

"చెప్పండి సార్! ఫర్వాలేదు"

"చూడు—నువ్వే నేరమూ చెయ్యలేదు. జరిగిన నేరాన్ని కనుక్కోవ డంలో మాకు సహాయం చేస్తున్నావంతే.

ఇందుకు నువ్వు చాలా గర్వపడాలి. మా దగ్గర భయపడక్కర్లేదు.

ఏమో! నువ్వు చెప్పే చిన్న విషయమే నాకెంతో ఉపయోగపడచ్చు, కూర్చోమరి."

ఆత్మీయంగా అంటూ మరోసారి పక్కనే ఉన్న చిన్నబల్లని చూపిం చాడు.

"థేంక్స్ సార్"

తప్పనిసరిగా కూర్చుంటూ వినయంగా అన్నాడు చంద్రం.

"చంద్రం! డాక్టరు నీలకంఠంగారు గుర్తున్నారా?"

తను అడగబోతున్న దానికి నాందిగా అడిగాడు మురళీ.

"ఎందుకు గుర్తులేదు సార్!

అంత సడన్‌గా పాపం కాలు జారిపడి మా హోటల్లో చనిపోయారు.

ఆయన్నెలా మర్చిపోతాను సార్!"

నీలకంఠం జ్ఞాపకంతో చంద్రం కళ్ళలో దైన్యత స్పష్టంగా కనిపిం చింది మురళీకి.

అతనన్నదీ నిజమే అనిపించింది.

"అవునూ....ఆ నీలకంఠంగారి స్వభావం ఎలాంటిదో చెప్పగలవా?"

"ఆయన నాతో మాట్లాడినప్పుడు మాత్రం చాలా మంచిగా మాట్లా డారు సార్!

ఏదో పని కుర్రాడిలా కాకుండా, నా కుటుంబ వివరాలు, నా చదువు విషయాలూ అడిగారు సార్.



ఆయనకి టిఫిన్ పెట్టినా, భోజనం పెట్టినా నాకు అదో పనిలా అని పించేది కాదు.

తింటూన్నంతసేపూ ఏదో ఒకటి నాతో మాట్లాడుతూనే వుండే వారు."

నీలకంఠం మీద ఏర్పడ్డ అభిమానంతో కాస్త ఎక్కువగానే మాట్లా డాడు చంద్రం.

"ఆయన ఇక్కడికెందు కొచ్చారో ఏమన్నా అన్నారా నీతో మాటల్లో?"

"లేదు సార్! ఆయనడిగిన దానికి నేను చెప్పేవాడినంతే. అలాంటి వేమీ నాతో చెప్పలేదు."

"పోనీ, నువ్వేమన్నా ఊహించగలవా?

అంటే ఆయన ఇక్కడికి ఏదన్నా ప్రత్యేకమైన పనిమీద అంటే ప్రత్యేకంగా ఎవర్నయినా కలవాలనో, మాట్లాడాలనో వచ్చారా?

లేక మామూలుగా హాస్పిటలు పనిమీద వచ్చారా?

ఆ వివరాలేమన్నా నీతో ఆయన అనకపోయినా, ఆయన మాటల వల్ల కానీ, ఆయన మాట్లాడిన ఫోన్ల వల్ల కానీ మరేదన్నా ఆధారాలవల్ల కానీ నువ్వేమన్నా ఊహించావా?"

మరింత వివరంగా అర్థం అయ్యేలా అడిగాడు మురళీ.

మాట్లాడేది తక్కువే అయినా హోటల్లో దిగిన వ్యక్తుల గూర్చి రూమ్ సర్వీసింగ్ బోయ్స్ బాగానే అంచనాలు వేస్తారనే విషయం అతను ఎరిగినదే.

అందుకే మళ్ళీ అడిగాడు చంద్రాన్ని.

కొంచెం ఆలోచించాడు చంద్రం.

"ఆయనకి నాలుగయిదుసార్లు ఫోన్లు వచ్చాయి సార్!

మాట్లాడిన వాళ్ళు డాక్టర్లేనేమో ఏవో హాస్పిటలు విషయాలే తప్ప నా కర్థమయ్యేవేవీ మాట్లాడుకోలేదు వాళ్ళు."

"అంతేనంటావా? బాగా గుర్తుచేసుకో. ఏదన్నా మాకు పనికొచ్చేది చెప్పడం మర్చిపోయావేమో."

ప్రోత్సహిస్తున్నట్టుగా అన్నాడు మురళి.

"గుర్తుకొస్తోంది సార్!

అన్నట్టు ఒకసారి ఆయనే ఫోన్ చేసి మాట్లాడారు సార్.

ప్రొడ్యూసర్ చౌదరిగారితో అటువైపు నుండి ఆయనేం చెప్పారో తెలియదు కానీ నీలకంఠంగారు మాత్రం ఆయనన్నదానికి ఆశ్చర్యపోతున్నట్టు మాట్లాడేరు సార్!"

"ఏమన్నారాయన?"

"అదంతా నాకు సరిగ్గా గుర్తులేదు సార్!

నాకు జ్ఞాపకం ఉన్నది మాత్రం- ఆయన ఆశ్చర్యపోయారన్నదే!

'వాట్' 'వాట్' అంటూ రెండు మూడుసార్లు రెట్టించి అన్నారు సార్. ఫోన్ పెట్టేశాక మాత్రం—

"హౌ కెన్ ఇట్ బి పాజిబుల్? సర్‌ప్రయిజింగ్!" అనుకున్నారు సార్ తనలో తనే—

అది బాగా గుర్తుంది నాకు".

మెరుస్తున్న కళ్ళతో అన్నాడు చంద్రం—

తనతో అంత మంచిగా మాట్లాడిన పోలీసాఫీసరుకి తనూ ఓ విషయాన్ని చెప్పగలిగేనన్న సంతోషం కనిపిస్తోందని మాటల్లో.

మురళికి కూడా ఆ విషయం ఇంట్రస్టింగ్‌గానే ఉంది.



కానీ చంద్రం సరిగ్గానే చెప్పాడో, పొరబాటున చెప్పాడో తెలియదు అందుకే రెట్టించి అడిగాడు.

"ఆయన ప్రొడ్యూసర్ చౌదరితోనే మాట్లాడినట్టు నీకెలా తెలుసు?"

"మా బావ కూడా చౌదరిగారి దగ్గరే డ్రైవరుగా పనిచేస్తున్నాడు సార్! ఎప్పుడయినా అవసరం పడితే ఫోన్ చెయ్యమని చౌదరిగారి ఫోన్ నంబరిచ్చాడు నాకు.

అందుకే ఆయన గురించి నాకు బాగా గుర్తుంది—

తను సరిగ్గానే చెప్పానన్న విశ్వాసంతో గట్టిగా అన్నాడు చంద్రం.

నీలకంఠం తనని కలిసినట్టు కూడా చెప్పాడు చౌదరి.

ఆ విషయం అతన్నుండే తెలిసింది తనకి.

కనుక నీలకంఠం చౌదరికి ఫోన్ చెయ్యడంలో ఆశ్చర్యం లేదు.

అతను చేసి ఉండొచ్చు.

చౌదరితో మాట్లాడుతూ నీలకంఠం ఎందుక ఆశ్చర్యపోయాడు?

పైగా ఫోన్ పెట్టేసి 'హౌ కెన్ ఇట్ బి పాజిబుల్?' అంటూ తికమక పడ్డట్టు చెప్తున్నాడు చంద్రం.

అంత సర్‌ప్రయిజింగ్ విషయం ఏముంది- చౌదరితో సంభాషణలో?

మరోసారి ఆలోచించాడు మురళి.

ఎంత ఆలోచించినా చౌదరి తనకి నీలకంఠానికి మధ్య ఉన్న పరిచయం జరిగిన సంభాషణ వగైరాలు మామూలుగా ఓ పేషెంటుకి డాక్టరుకి మధ్యవుండేవిగానే చెప్పినట్టే తప్ప ప్రత్యేకంగా అందులో చెప్పినట్టుగా గుర్తురావట్లేదు.

అంత విచిత్రమయిన విషయం నీలకంఠానికి ఏం తెలిసింది?

చౌదరితో మాట్లాడిన తర్వాత?

చౌదరినే అడిగి తెలుసుకోవాలి?

మరుక్షణమే అనిపించింది—

ఇదివరకు తనకా విషయం చెప్పనివాడు ఇప్పుడు మాత్రం చెప్తాడా?

అడిగి లాభం ఉండదు.

తనే తెలుసుకోవాలి—

తనే ప్రయత్నించాలి.

ఎందుకయినా మంచిదని హోటల్ రిజిష్టర్ తెప్పించి చూశాడు మురళి.

నీలకంఠం ఫోన్ చేసింది ఒక్క చౌదరికే- మిగిలినవన్నీ అతని కొచ్చిన ఫోన్లే అయుండొచ్చు.

కానీ తనుగా ఫోన్ చేసింది మాత్రం చౌదరి ఒక్కడికే!

నీలకంఠం యింకా వేరే ఎవరికయినా ఫోన్లు చేసివుంటే చంద్రం పొరబడ్డాడేమో అనుకోడానికయినా వీలుంది. కానీ అతను చేసింది ఒకే ఒక్క ఫోనయినప్పుడు చంద్రం తప్పుగా చెప్పే అవకాశమే లేదు.

చంద్రం అన్నదీ నిజమే అయి ఉండాలి.

ఆ విచిత్రమయిన విషయం ఏదో ముఖ్యమైనదే అయ్యుంటుంది.

అది తెలుసుకోగలిగితే తన పరిశోధనకి ఖచ్చితంగా ఉపయోగ పడొచ్చు.

ఎలా? ఆ విషయం తెలుసుకోవడం ఎలా?

ఇద్దరి మధ్య జరిగిన సంభాషణ వివరాలు—



అందులో ఓ వ్యక్తి చనిపోయి, మరో వ్యక్తి వెల్లడించదనుకున్నప్పుడు తెలుసుకోవడం ఎలా?

ఆ విషయం గుర్చి ఆలోచిస్తూనే హోటల్ బయటికి నడిచాడు మురళి.

* * * *

స్టూడియోలో చౌదరి సినిమా షూటింగ్ జరుగుతోంది.

సినిమా తాలూకు తెరముందు, తెరవెనక వ్యక్తులే కాకుండా షూటింగ్ చూడ్డానికొచ్చిన అభిమానులతో అక్కడంతా రద్దీగా ఉంది.

మధ్యాహ్నామైపోయింది.

లంచ్ బ్రేకిచ్చారు.ఉదయం నుండి హీరో పెళ్ళి సీను షూటింగవుతోంది.

అప్పటికో నలభై నిమిషాల ముందొచ్చి, నాలుగు వాక్యాల డైలాగ్సు చెప్పిన ప్రఖ్యాత హీరో అలిసిపోయి, ఈజీ ఛెయిర్‌తో కూర్చుని విశ్రాంతి తీసుకుంటూంటే, పెళ్ళి పందిట్లోని ఆహ్వానితుల వేషాలకి ప్రొద్దున్నేవచ్చి, హీరో కోసం ఎదురుచూపుల్లో అలిసి సొలిసి, మంచినీళ్ళిచ్చే వాళ్ళయినా లేక ఆ మండుటెండలో ఒడిలిపోయి నిలబడ్డ ఎక్స్‌ట్రాలు ఓ వారగా కూర్చుని ఊపిరి పీల్చుకుంటున్నారు.

ఓ వారగా కుర్చీలో కూర్చుని వాళ్ళవంకే చూస్తున్నాడు భార్గవ.

ఈ సినిమాలో అతను డూప్‌కాదు— సైడు హీరో.

చౌదరి అభిమానాన్ని పొందగలిగాడు కనుక అతనికి ప్రత్యేక మర్యాదలు కాకపోయినా, అతన్ని జాగ్రత్తగానే చూసుకుంటున్నారు వాళ్ళు.

అప్పుడే అతనికి భోజనం వచ్చింది.

అప్పుడే గుంపులా వచ్చారు అభిమానులు కొందరు.

"అడుగోరా! హీరో రాం కుమార్"

వాళ్ళలో ఒకడు హీరోవంక వేలెత్తి చూపిస్తూ అన్నాడు.

అంతే! అంతా అక్కడికి గుంపుగా పరిగెట్టారు.

"అబ్బ! మొన్న 'రౌడీ' సినిమాలో మీరు చేసిన ఫైట్లు అద్భుతంగా ఉన్నాయి సార్ ! అసలా ఫైట్లు కోసమే నేను ఆ సినిమా పదిసార్లు చూశాను."

వారిలో ఒకతను హీరో వైపు ఆరాధనగా చూసి అంటున్నాడు.

"అవున్సార్! నిజంగా మీ ఫైట్లంటే మాకు బలే పిచ్చనుకోండి!"

మిగిలినవాళ్ళు వంతపాడుతున్నారు.

హీరో వాళ్ళవైపు ఠీవిగా చూస్తున్నాడు.

భార్గవ చెవిన పడుతున్నాయి వాళ్ళ మాటలన్నీ.

ఒక్కసారిగా అతనికి పగలబడి నవ్వాలనిపించింది.

ఆ హీరోకి ఎన్నో ఏళ్ళుగా తనే డూప్!

ఏం ప్రపంచం! ఈ సినిమా ప్రపంచం?

నిజ జీవితంలో ఎలక కీచుమంటే అదిరిపడే ఆ హీరో మహాను భావుడు—

సినీ ప్రపంచంలో తనవి కాని ఫైట్లకి ప్రజల్నుండి నీరాజనాలందు కుంటున్నాడు.

అదీ తన డూప్ ఎదురుగానే!

దానికతను సిగ్గుపడ్డంలేదు సరికదా, అదంతా తన ప్రతిభే అన్నట్టుగా ఫోజు కొడుతున్నాడు.



అసలలాంటి పొజిషన్లో తనక్కడ ఉన్నందుకు తనకే సిగ్గుగా వుంది.

తల పక్కకి తిప్పుకున్నాడు భార్గవ.

ప్రక్కనే ఎవరో నిలబడ్డట్టయ్యింది.

తలతిప్పి చూశాడు భార్గవ.

ఎవరో అపరిచితుడు!

తనలాంటి డూప్‌లకి కూడా అభిమానులా?

ఆశ్చర్యంగా చూశాడు భార్గవ.

"నీతో మాట్లాడాలి"

సూటిగా అన్నాడతను.

ముక్కూ మొహం తెలియని మనిషొకడు వచ్చి 'నీతో' అంటూ ఏకవచన ప్రయోగం చేసేసరికి ఒళ్ళు మండింది భార్గవకి.

"మర్యాద ఇచ్చి పుచ్చుకో...."

సీరియస్‌గా చూస్తూ అన్నాడు భార్గవ.

"మనం ఇచ్చి పుచ్చుకోవలసింది మర్యాదకాదు." చిన్నగా నవ్వాడా మనిషి.

ఆ నవ్వు మామూలు చిరునవ్వులా లేదు.

వెటకారం చేస్తున్నట్టుగా వుంది.

"అసలెవర్నువ్వు ?"

కోపంగా అడిగాడు భార్గవ.

ఆ మనిషి తీరు చూస్తుంటే అతనికి ఒళ్ళంతా కంపరం ఎత్తుతోంది.

"ఆ వివరాలన్నీ మాట్లాడ్డానికి ఇదీ చోటు కాదు.... బయటికి రా."

భార్గవ వచ్చితీరతాడన్న ధీమా కనిపిస్తోందా మాటల్లో.

అ ధీమా చూసేసరికి భార్గవ కెందుకో అనుమానం వచ్చింది.

"ఏమిటితని ధైర్యం? ఏదో దన్ను లేకపోతే పరిచయంలేని మనిషి దగ్గరకొచ్చి ఇతనింత నిర్లక్ష్యంగా మాట్లాడగలడా?"

అదేదో తేల్చుకోవాలనిపించింది.

చెయ్యి కడుక్కుని బయటికి నడిచాడు భార్గవ.

అతన్ని అనుసరించాడా కొత్త మనిషి.

బయట దూరంగా ఉందో చింతచెట్టు.

దానికింద ఎవరూ లేరు.

అక్కడికి నడిచారిద్దరూ.

"చెప్పు....నాతో ఏం పని? ఏం మాట్లాడాలి?" చిరాగ్గా అడిగాడు భార్గవ.

"అర్జంటుగా నాకో పదివేలు కావాలి అన్నాడా వ్యక్తి సిగరెట్ వెలిగిస్తూ.

ఫకాల్న నవ్వాడు భార్గవ.

"నాకూ కావాలి ఇరవై వేలు....నువ్విస్తావా?" వెక్కిరింతగా అడిగాడు.

"నాకు పదివేలు కావాలి...." అవతలి వ్యక్తి మళ్ళీ అడిగాడు సిగరెట్ పొగని గాలిలో వదులుతూ.

రాత్రికి నాతోరా! రిజర్వుబ్యాంకికి కన్నం వేద్దాం" ఎగతాళిగా నవ్వాడు భార్గవ.

"నువ్వు కన్నాలే వేస్తావో, హత్యలే చేస్తావో నాకు అనవసరం.... నాకు మాత్రం పదివేలు కావాలి."



'హత్యలే చేస్తావో' అన్న మాటని నొక్కి చెపుతూ అన్నాడు అతను.

ఆ మాట కొరడా దెబ్బలా తగిలింది భార్గవకి.

మాటవరసగానే అన్నాడా ఆ మాటల్ని?

తొలిసారిగా అనుమానం వచ్చింది భార్గవకి.

"అంటే నీ ఉద్దేశ్యం?"

సూటిగా అడిగాడు.

"ఉద్దేశ్యం సదుద్దేశ్యమే! నీ దగ్గరో పదివేలు తీసుకొని నీకు సాయం చేద్దామని."

"నువ్వు నాకు చేసే సాయం ఏమిటి?"

"పోలీసులకి నీ విషయం చెప్పకుండా వుంటే నీకు సాయం చేసినట్టు కాదా?"

అదిరిపడ్డాడు భార్గవ.

"పోలీసులకి చెప్తావా నా విషయం? ఏముంది అంత చెప్పాల్సినది....?"

"చట్ట విరుద్ధమైన పనులు ఎవరు చేస్తూ కనిపించినా, పోలీసులకి చెప్పాలి కదా?

మరి నేనిప్పుడు చెప్పకుండా ఊరుకున్నానంటే అది నా మంచితనం కాదూ?"

ఒళ్ళు మండింది భార్గవకి.

అతన్ని గొంతు పిసికి చంపాలన్నంత కోపం వచ్చేస్తోంది.

తను ఒక్క దెబ్బకొడితే నేల కరుస్తాడు వాడు.

"చూడూ....నువ్వెవరో, ఎంత మంచివాడివోలాంటి వివరాలతో నాకేం పనిలేదు.

నువ్వేదన్నా చెప్పాలనుకుంటే దొంకతిరుగుడుగా కాకుండా సూటిగా చెప్పు."

కోపంతో మొహం ఎర్రబడింది భార్గవకి.

"అవున్లే....నాలాంటి వాళ్ళతో నీకు పనేముంటుంది? హత్యలు చెయ్యడానికే సైము చాలని నీకు, నాబోటి వాళ్ళతో మాట్లాడే సైము కూడా వుందా?"

కరెంటుషాకు కొట్టినట్టు అదిరిపడ్డాడు భార్గవ ఈసారి.

"ఏయ్....ఏం మాట్లాడుతున్నావో తెలిసే మాటాడుతున్నావా? నేను హత్యలు చేస్తానా?"

పళ్ళూడిపోతాయి.

కీచుమంది అతని గొంతు.

నువ్వు నన్నేదో బుకాయిద్దామనుకోకు బ్రదర్!

ఈ నారాయణ ఏదీ అబద్ధం కానీ, గాలిమాటలు కానీ చెప్పడు.... రుజువులూ, సాక్ష్యాలూ లేకుండా ఏ మాటా అనడు."

కాలరు సర్దుకున్నాడతను.

అప్పటికి స్ఫురించింది భార్గవకి....

తనేదో ఉచ్చులో ఇరుక్కుంటున్నానని.

ఎదుటి మనిషి....అదే, ఆ నారాయణ కూడా దేవాంతకుడిలాగే వున్నాడు.

అతనేదో గాల్లో రాయేసినట్టు మాట్లాడ్డం లేదనిపించింది.



విషయమేమిటో తెలుసుకోకుండా అలా చెలరేగిపోవడం తనకే ప్రమాదం తెచ్చిపెట్టేట్టుంది.

"నువ్వేం చెప్దామనుకుంటున్నావో చెప్పు."

కొండంత శాంతాన్ని తెచ్చిపెట్టుకున్నాడు భార్గవ.

"చెప్పేదేమీలేదు బ్రదర్! అసలు చెప్పేంత సైముకూడా లేదు కు....

అవతల పేకాటకి సైమవుతోంది నాకు.

నాకు అర్జంటుగా ఓ పదివేలివ్వు....

ఉత్తినే తీసుకోనులే....

అలా తీసుకున్నందుకు ప్రతిగా నువ్వు చేసిన హత్య విషయం లోనే దాచుకుంటాను.

ఉరితాడులో చిక్కుకుని గిలగిలా కొట్టుకుని చావడం కంటేనో, తమంతా రాళ్ళు కొట్టుకుంటూ బ్రతకడం కంటేనో, ఇలా రహస్యాన్ని ప్పుచ్చుకోవడమే తెలివయిన పని—

కాదంటావా?"

జేబులోంచి ఓ బీడీ తీసి చేత్తో పట్టుకున్నాడు నారాయణ.

సగం ముక్క తుంచి బయటపడేసి మిగిలిన సగాన్ని నోట్లో పెట్టి బీడీ వెలిగించాడు.

ఎర్రగా మండుతోంది బీడీ చివర.

అంతకంటే ఎర్రగా మండుతోంది భార్గవ మనసు.

జరిగినది పోలీసులకి ఎక్కడ తెలుస్తుందో అని తను ప్రతిక్షణం భయపడి చస్తుంటే....వీడెవడో వచ్చి ఈ బ్లాక్ మెయిలింగ్ చేస్తున్నాడు.

అవును....

ఇది బ్లాక్ మెయిలింగే....

వీడు బ్లాక్ మెయిలరే!

కానీ ఒకటే అర్థం కావట్లేదు....

ఆ రాత్రి తనూ శైలా తప్ప మూడో మనిషి లేడక్కడ.

ఆ విషయం వీడికెలా తెలిసింది?

అసలు వీడికింతవరకూ తెలుసా విషయం?

అది ముందుగా తెలుసుకోవడం తెలివయిన పని అనిపించింది.

"నారాయణా! నువ్వేదో తొందర్లో అలా అంటున్నావు....

నాలాంటి ఓ డూప్‌కి పదివేలు క్షణాల మీద ఇచ్చెయ్యడం అన్నది చాలా కష్టం అని నీకూ తెలుసు.

ఏదో పది రూపాయలు అడిగినంత సులువుగా అడుగుతున్నావు నువ్వు.

అది నీ తప్పు కాదు.

నీ అవసరాలు నీచేత అలా అడిగిస్తూండచ్చు.

కానీ నా దగ్గర మాత్రం అంత పెద్ద ఎమవుంట్ లేదు."

నీ దగ్గర వుందో లేదో తెలుసుకోవాల్సిన అవసరం నాకు లేదు.

కానీ....

నాకా డబ్బివ్వకపోతే మాత్రం ఈ ఫోటో పోలీసుల చేతికెళ్తుందని నువ్వు తెలుసుకుంటే నాకంతే చాలు...."

చేతిని షర్టు లోపలికి పోనిచ్చాడు నారాయణ.



లోపలేదో పాకెట్ వున్నట్టుంది బనీనుకి.

ఆ బనీను జేబులోంచి ఓ కవరు తీశాడు.

వెకిలిగా నవ్వుతూ ఆ కవరు విప్పి ఓ ఫోటో బయటికి తీశా నారాయణ.

ఆ ఫోటోని భార్గవ చేతుల్లో పెట్టి బీడీ నుసి విదిలించాడు రాదు యణ.

ఫోటో చూస్తూనే తృళ్ళిపడ్డాడు భార్గవ.

అదీ....

ఆ ఫోటో....

తను సదాశివంగాడి శవాన్ని మోస్తుండగా తీసినది.

వాడి మొహం కనిపించట్లేదు కానీ, వాడి ప్యాంటూ, షర్టూ క్లియ ర్‌గా వున్నాయి.

అవి నీటిలో తడిసినవని వాటినుంచి కారుతున్న నీరే తెలియ చెపు తోంది.

తన మొహం చాలా క్లియర్‌గా వుంది.

"ఇది.... ఇది నీకెక్కడిది?"

తడబడుతూ అడిగాడు భార్గవ.

"ఏదో రోడ్డుమీద దొరకడానికి ఇదేమన్నా అల్లాటప్పా వస్తువను కున్నారా?

ఇది నా కష్టార్జితం....

చెమటోడ్చి తీశానా ఫోటో....

బొమ్మ బాగా వచ్చింది కదూ?"

నారాయణ స్వరంలో వ్యంగ్యం యింకా ఎక్కువవుతోంది.

అబ్సర్డ్! వీడా సమయంలో అక్కడున్నాడా ఆ ఫోటో తియ్యడానికి?

"నువ్వేదో వాగితే నమ్మడానికి నేను పిచ్చివాడిననుకోకు. అసలు అప్పుడు ఎవరూ లేరక్కడ."

ఆవేశంగా అన్నాడు భార్గవ.

"అంటే.... ఈ హత్య చేశానని ఒప్పుకుంటున్నట్టే కదా? దొంగని పట్టుకున్నట్టుగా ఫీలవుతున్నాడు నారాయణ.

ఆ ఉద్రేకంలో తనెంత నోరు జారిందీ అప్పుడర్థం అయ్యింది భార్గవకి.

ఇప్పుడు ఆ మాటని వెనక్కి లాక్కోలేడు.

ఉడుకుమోత్తనం వచ్చింది భార్గవకి. తననా వ్యక్తి అంత సులువుగా ఫూల్ని చేసినందుకు.

చేతకాని ఉక్రోషం ఆవరించిందతన్ని.

తటాల్న చేతిలోని ఫోటోని పరపరా చింపేశాడు.

"చూడు బాబూ! ఈ ఫోటో చింపేసినంతట్లో నీ రహస్యం సమాధి అయిపోయిందనుకోకు.

నెగెటివ్ నా దగ్గరే వుంది. నేను కావాలనుకుంటే కొన్నివేల ఫోటోలని తీసి వీధుల్లో పంచిపెట్టగలను."

అవును. అతననేదీ నిజమే!

కేవలం ఓ ఫోటో కాపీని చింపినంత మాత్రాన తన రహస్యం దాగిపోదు.



ఇతన్నేదో విధంగా మంచి చేసుకోక తప్పదు. వెధవది ఓ పదివేలు పోయింది. ఇప్పటికి గండం దాటితే చాలు.

"పదివేలు అంటే నాకు చాలా పెద్ద మొత్తమని నీకు ముందే ను. నా దగ్గర వెయ్యి రూపాయలున్నాయి. అవి తీసుకుని వెళ్ళిపో."

జేబులోంచి డబ్బులు తీసిస్తూ అన్నాడు భార్గవ.

ఆ మొత్తాన్ని జేబులో పెట్టుకున్నాడు నారాయణ.

"నాకు రెడీ కేషే అక్కర్లేదు. చెక్ అయినా ఫర్వాలేదు. మిగిలిన దివేలకి చెక్ రాసియ్యి."

వలలో పడ్డ చేప ఎక్కడికీ పోదనే నమ్మకం అతని మాటల్లో ధ్వని ది.

తప్పదనిపించింది భార్గవకి కూడా.

అంతలోనే అతనికి మరో అనుమానం వచ్చింది.

"ఈ డబ్బు తీసుకుని నువ్వు పోలీసుల దగ్గరికెళ్తే నో?" ఆ అనుమా బయట పెట్టాడు.

"అందుకే అన్నాను. నువ్వు పిచ్చివాడివని. ఈ డీలింగులో బేరాలు స్థితిలో లేవు నువ్వు.

కండిషన్లు పెట్టే అవకాశం లేదు నీకు.

నేను చెప్పేది నువ్వు నమ్మడం తప్ప నీకు మరో దారి లేదు.

అయినా నేనెందుకు పోలీసులకి చెప్తాను?

అది వృత్తి ధర్మానికి ద్రోహం కాదూ?"

ఏదో నిజాయితీగల వ్యక్తిలా అతనలా మాట్లాడుతూంటే ఒళ్ళు రమెత్తుతోంది భార్గవకి.

"నువ్వు చేసే వెధవ పనికి మళ్ళీ ఈ ఉపదేశాలెందుకు?"

"నేనిక్కడ వుండడం నీకంత బోరుగా వుంటే ఆ చెక్కు నీ మొహాన పడెయ్యి.

అయినా నేనెక్కువసేపుంటే నీకే నష్టం!

నన్ను నీతో పోలీసులు చూసినా, నా పాత కష్టమర్లు చూసినా నా మీద వాళ్ళకి అనుమానం తప్పకుండా వస్తుంది.

ముందు నన్ను తొందరగా పంపించెయ్యడం నీకే మంచిది" తల తడుముకుంటూ అన్నాడు నారాయణ.

భార్గవకి మరో దారి కనిపించలేదు.

జేబులోంచి చెక్కు పుస్తకం తీసి గబగబా తొమ్మిదివేలకి చెక్కు రాశాడు.

ఆ కాగితాన్ని చింపి నారాయణ చేతిలో పెట్టాడు భార్గవ.

"థాంక్యూ బ్రదర్! ఇంకా నీలాంటి పరోపకారులుండడం వల్లే ఈ భూమిలా నిలబడింది వస్తా.

నీకో ప్రామిస్ చేస్తున్నా. నిశ్చింతగా వుండు. మళ్ళీ నేను నీకు కన పడను ఈ డబ్బయిపోయేదాకా"

"అశ్వత్థామ హతః హతః" అని గట్టిగానూ "కుంజరః" అని నెమ్మదిగానూ అన్న ధర్మరాజులా ఆ మాటలంటూ వెళ్ళిపోయాడు నారాయణ.

భార్గవకి నెత్తిమీద మండుతున్న నిప్పుల కుంపటి బోర్లించినట్టుగా వుంది.

ఒళ్ళంతా కుతకుతలాడిపోతోంది.

తనో బ్లాక్ మెయిలర్ చేతిలో ఇరుక్కుపోయాడు.

ఈ పదివేలతో వీడు తనని వదలడనేది తనకూ తెలుసు.

కానీ తప్పనిసరయి ఆ డబ్బు ఇవ్వాల్సొచ్చింది.

ఏం చేయాలి తనిప్పుడు?

వీడి బారినుంచి తప్పించుకోడానికి తను పోలీసుల్ని సాయం అడగ

ఈ సమస్యని తనే పరిష్కరించుకోవాలి.

మనసులో మథన పడుతున్నాడు భార్గవ.

*  *  *  *  *

యూనిఫామ్ సరిగ్గా వుందో లేదో అద్దంలో చూసుకుంటున్నాడు

"డాడీ!"

సన్నగా వినిపించింది బేబీ గొంతు.

వెనక్కి తిరిగి చూశాడు.

గుమ్మం దగ్గర రెండు చేతులూ ద్వార బంధానికి రెండువైపులా వేసి ంది బేబీ.

పాపని ఆ ఫోజులో చూడగానే అతనికి చనిపోయిన భార్య గుర్తుకు ది.

ఆమె కూడా అలాగే.... సరిగ్గా అదే ఫోజులో నిలబడి చూసేది హడావిడి.

"ఆ యూనిఫామ్‌లో మిమ్మల్ని చూస్తూంటే నాకు భయం వేస్తుంది. నుండో మిమ్మల్నా డ్రెస్‌లో చూస్తూనే వున్నా మీరెవరో కొత్త మని ంటారు" అనేది.

బేబీ కూడా అచ్చు అదే భంగిమలో నిలబడేసరికి అతనికి భార్య బు అతని గుండెని గుచ్చినట్టయ్యింది.

"డాడీ!"

మళ్ళీ బేబీ గొంతు వినిపించేసరికి ఆలోచనల్లోంచి దిగివచ్చాడు మురళి.

"వాట్ బేబీ! ఏం కావాలట మా అమ్మకి?"

కూతుర్ని లాలనగా ఎత్తుకుని అడిగాడు బుజ్జగిస్తూ.

"అమ్మ కావాలి డాడీ! అమ్మని ఇప్పుడు తీసుకురా"

ఏడుపు గొంతుతో అడిగింది బేబీ.

తన మాటలే ఆ చిన్నారికి 'అమ్మ'ని గుర్తు చేసేసరికి తనని తను నిందించుకున్నాడు మురళి.

"ఓ! అదా బేబీ! వస్తుందమ్మా, అమ్మ తొందర్లోనే వచ్చేస్తుంది."

పాపని ముద్దాడుతూ మొహం దాచుకున్నాడు మురళి.

అప్పుడు గమనించాడు- ఆయా ఓ పక్కగా నిలబడి ఉండడం.

"ఏం ఆయా? ఏమయినా కావాలా?"

ఆమెని అడిగాడు మురళి.

"కొంచెం మాట్లాడాలి బాబూ."

ఆమె నసగడంతో అర్థం కాలేదతనికి.

"చెప్పు ఆయా"

"పాప...."

అర్ధోక్తిగా ఆగిపోయిందామె.

అప్పుడు అర్థం అయింది మురళికి. పాప విషయమే ఆమె ఏదో చెప్పాలనుకుంటోందని.



"బేబీ! డైనింగ్ టేబులుమీద నా పెన్ను పెట్టానేమో, చూసి తెచ్చి పెట్టు తల్లీ"

అలాంటి చిన్న చిన్న వస్తువులందించడం బేబీకి సరదా అని మురళికి తెలుసు.

"ఒన్ మినిట్ డాడీ" అంటూ తూనీగలా పరిగెత్తింది బేబీ.

"బాబూ! పాప మరీ అమ్మగారికోసం బెంగెట్టుకుంది. పొద్దున్నించీ ఈ రోజు పాలు కూడా తాగలేదు. ఒళ్ళు కూడా కాస్త వెచ్చబడింది. పోనీ నెల్లాళ్ళపాటు పాపని వాళ్ళ నాయనమ్మ దగ్గరకో, అమ్మమ్మ దగ్గరకో పంపిస్తే బాగుంటుందేమో అని...."

మాట్లాడ్డం ఆపు చేసింది ఆయా.

ఆ విషయం ఎప్పుడో వచ్చింది.

భార్య కర్మలకి వచ్చిన తన తల్లీ, ఆమె తల్లీ పాపని తమతో పంపమనీ, కళ్ళలో పెట్టుకు చూస్తామనీ అడిగారు.

కానీ తనే ఒప్పుకోలేదు.

బేబీకి తన దగ్గరే బాగా అలవాటు. ఇప్పుడు అమ్మమ్మ దగ్గరికి పంపినా, నాయనమ్మ దగ్గరికి పంపినా తన కోసం బెంగపెట్టుకోవచ్చని చెప్పి వాళ్ళని పంపేశాడు.

నిజానికి బేబీ తను దూరమయినా భరించగలదేమో కానీ తనే బేబీ వియోగాన్ని సహించలేడు. ఒకేసారి భార్యా బిడ్డా దూరమయితే ఆ బాధని భరించే శక్తి లేదు తనకి.

నెమ్మదిమీద పాప తల్లిని మరిచిపోతుందని అనుకున్నాడు. కానీ పాప మర్చిపోవట్లేదు సరికదా ఒకరోజుకంటే ఒకరోజు తల్లిని మరింతగా గుర్తు చేసుకుంటోంది. ఏం చేయాలో తెలియట్లేదు.

"బాబూ! పెద్దదాన్ని. మీకు తల్లిలాంటి దాన్ని.

మీరు మరోలా అనుకోకపోతే నేనో మాట చెప్తాను."

చిన్నగా అంది ఆయా తల వంచుకుని.

"చెప్పు ఆయా. నువ్వేం జంకనక్కర్లేదు"

"బాబూ! పాపకి తల్లిని ఇప్పించడానికయినా మీరు మరో పెళ్ళి చేసుకుంటే...."

సగంలోనే ఆగిపోయింది ఆయా—ఎర్రబడ్డ మురళి కళ్ళు చూసి.

ఆయా! ఇంకోసారి ఆ మాట రానియ్యకు.

"సవతి తల్లి చేతుల్లో పెరగాల్సిన ఖర్మ నా బేబీకి లేదు.

తండ్రిని నేనున్నాను- నేను చూసుకోగలను."

అంతలోనే బేబీ పరిగెట్టుకొచ్చింది.

'డాడీ, నీ పెన్ను' అంటూ పెన్నందించింది.

"మా తల్లి బంగారు తల్లి.

మై స్వీట్ బేబి" పాపత్తునెకుని గట్టిగా గుండెలకి హత్తుకున్నాడు.

నిజానికి పాపని అలా దగ్గరకి తీసుకుని ఆమె స్పర్శతో తన మనసులోని దుఃఖాన్ని చల్లార్చుకుంటున్నాడు మురళి.

అంతలోనే అతనికి గుర్తొచ్చింది. పాపకి వళ్ళు వెచ్చబడిందని ఆయా చెప్పిన విషయం.

పాప చెయ్యి పట్టి చూశాడు.

నిజంగానే పాప ఒళ్ళు వేడిగా ఉంది.

అంతవరకూ ఆ విషయమే గమనించని తన నిర్లక్ష్యానికి తనమీద తనకే చిరాకేసింది.



"ఆయా! బేబీని డాక్టరు దగ్గరికి తీసికెళ్ళు

ఆయన మధ్యాహ్నం రెండింటికి తెరుస్తాడు డిస్పెన్సరీ.

ఆ టైముకి బేబీని తీసికెళ్ళు.

స్టేషన్నుంచి నేను ఫోను చేసి చెప్తానాయనకి."

పాపని ఆయా కందించాడు మురళి.

అలాగేనంటూ తలూపింది ఆయా.

పాపని మరోసారి ముద్దు పెట్టుకుని, ఆయాతో పాపని జాగ్రత్తగా మని చెప్పి బయల్దేరాడు మురళి.

* * * *

స్టేషను బయట జీపు దిగుతూండగానే ఎదురొచ్చాడు కానిస్టేబిల్

ఇన్స్పెక్టరుకి వినయంగా శాల్యూట్ చేసి "సార్, మీ కోసం ఓ ముసలాయనొచ్చి ఇందాకట్నుండి కూర్చున్నాడు సార్."

అన్నాడు రాజు.

"ఎవరతను, ఏమయినా చెప్పాడా?" ప్రశ్నించాడు మురళి.

"అది నేను వినలేదు సార్."

చకచకా లోపలికి నడిచాడు మురళి.

తన టేబిల్‌కి ఎదురుగా రాజు చెప్పినట్టుగానే ముసలాయనొకడు ర్చుని ఉన్నాడు.

బూట్ల శబ్దం వింటూనే తలతిప్పి చూశాడాయన.

స్టేషన్లోని మిగిలిన సిబ్బంది మురళి రాకతో ఎటెన్షనులో నిలబడి ల్యూట్ చెయ్యడంతో ఆయనకే అర్థమైనట్టుంది. అతనే ఇన్స్పెక్టరని.

"నమస్కారం ఇన్స్పెక్టరుగారూ"

కూర్చున్న కుర్చీలోంచి లేచి నిలబడుతూ అన్నాడాయన.

"నమస్తే" అంటూ తన కుర్చీ లాక్కున్నాడు మురళి.

తలమీది టోపీ తీసి పక్కన పెడుతూ "కూర్చోండి" అన్నాడాయనతో, మురళి కూర్చోగానే ఆయనా కూర్చున్నాడు.

ఆయన్ని పరీక్షగా చూశాడు మురళి.

సుమారు అరవై అరవై ఐదు సంవత్సరాల వయసుండవ్వా యనకి.

జుట్టు నెరిసింది. కానీ మనిషిలో పూర్తిగా వార్ధక్యం రానట్టే ఉంది.

అమాయకమైన మొహం.

పూర్వకాలం మనిషిలా ఉన్నాడు.

"మీ పేరు?"

"నన్నంతా 'గుర్నాథం' అంటారు."

భుజం మీదున్న కండువా సవరించుకుంటూ అన్నాడాయన.

"మనిషే కాదు, పేరూ పూర్వకాలం నాటిదే" అనిపించి నవ్వొచ్చింది మురళికి.

"ఏం పనిమీద వచ్చారు?" నవ్వు నాపుకుంటూ అడిగాడు గుర్నాథాన్ని.

"సదాశివం మా ఇంట్లోనే అద్దెకుండేవాడు."

సదాశివం ఎవరో వెంటనే తట్టక అదోలా చూశాడు మురళి.

అతని చూపుల భావాన్ని గ్రహించినట్టున్నాడాయన.

"అదే! హుస్సేన్‌సాగర్లో తేలిన శవం అంటూ మీరు పేపర్లో ఫోటో ఇచ్చారు చూడండి. ఆ సదాశివం మా ఇంట్లోనే అద్దెకుండేవాడు.



అప్పుడు స్ఫురించింది మురళికి సదాశివం ఎవరో.

ఆ వెంటనే మరింత ఆత్రుతతో ముందుకొంగి 'వెరీ గుడ్!' అతని వివరాల కోసం మేమూ చూస్తున్నాం—

'నా కెందుకులే' అనుకోకుండా మీ అంతట మీరే స్టేషన్‌కొచ్చి మాకు సాయం చెయ్యడానికి సిద్ధపడినందుకు థాంక్స్.

చెప్పండి, సదాశివంగూర్చి మీకు తెలిసినవన్నీ చెప్పండి."

గుర్నాథాన్ని మెచ్చుకోలుగా చూస్తూ అన్నాడు మురళి.

"అంటే.... సదాశివం గూర్చి నాకు అంతగా వివరాలు తెలియవనుకోండి-

అతనుంటున్నది మాత్రం మా ఇంట్లోని వాటాలోనే."

"అంటే అంతకుమించి అతని ఉద్యోగం, అతని వ్యక్తిగత వివరాలు ఏమీ చెప్పలేరా?"

"అదే సార్! అతనొచ్చి నాలుగయిదు నెలలవుతోన్నా, మాతో అతను క్లోజ్‌గా ఎప్పుడూ మాట్లాడలేదు.

ఇంట్లోకి అద్దెకి దిగేముందు చెప్పాడు.

తనకి పెళ్ళి కాలేదని, ఒక్కడ్నీ ఉంటాననీ.

నాకు పెళ్ళికాని ఆడపిల్లల్లేరు. నా పిల్లలంతా ఎవరికి వాళ్ళు సెటిలైపోయి వాళ్ళమానాన వాళ్ళు బ్రతుకుతున్నారు.

ఇంట్లో వుండేది నేనూ, మా ఆవిడా మాత్రమే.

అందుకే అతనికి పెళ్ళి కాలేదన్నది నాకేమీ అభ్యంతర కారణం కాలేదు.

ప్రతి నెలా ఫస్టుకల్లా ఠంచనుగా అద్దె తెచ్చిచ్చేవాడు.

ఈ నాలుగైదు నెలల్లోనూ అతని వాటాకేసి కన్నెత్తి చూసే అవసరం కూడా రానివ్వలేదతను."

గుర్నాథం మాటల్తో చాలా నిరాశ అనిపించింది మురళికి.

తలా తోకా లేకుండా వున్న సదాశివం కేసులో గుర్నాథం వల్ల కొత్త విషయాలెన్నో తెలుస్తాయనీ, కేసు పరిష్కరించడానికి సాయపడతాయనీ ఆశపడ్డాడతను.

కానీ సదాశివం తన యింట్లో అద్దెకుండేవాడనేది తప్ప మరే ఇన్‌ఫర్మేషనూ ఈ గుర్నాథాన్నుండి వచ్చేట్టు లేదు.

బరువుగా నిట్టూర్చాడు మురళి.

అంతలోనే అతనికి అనిపించింది.

అతనుండే యింటి అడ్రస్ తెలిసింది కనుక ఇరుగూ పొరుగూ నడిగితే ఏవో మరికొన్ని వివరాలు దొరక్కపోవని, మనిషి ఎంత ఒంటరివాడయినా, ఏ పాలవాడితోనో, చాకలితోనో, సెలూన్‌వాడితోనో, ఏదో విధంగా అతనికి కనక్షనుండకపోదు.

వాళ్ళలో ఏ ఒక్కరు కొత్త పనికొచ్చే సమాచారం ఇచ్చినా చాలు!

"అతనెక్కడ ఉద్యోగం చేసేదీ మీకు తెలియదా?"

మళ్ళీ అడిగాడు గుర్నాథాన్ని.

"లేదు సార్! ముందే అతను చెప్పాడు.

ఏదో ప్రైవేటు కంపెనీలో పనిచేస్తున్నానని.

నా భార్య మాత్రం అనేది 'ఇతనేమిటండీ, రాకపోకలకి ఓ వేళాపాళా లేదితనికి.

ఎంత ప్రైవేటు కంపెనీలో అయితేమటుకు ఆ యజమానెవడో ఇతనిలా ఇష్టం వచ్చినట్టు ఆఫీసుకి వస్తూంటే ఎలా ఊరుకుంటున్నాడండీ.



మీరయితే రిటైరు కాకముందు ఠంచనుగా తొమ్మిదిన్నరకల్లా కంచంలో భోజనం వడ్డించకపోతే అపళంగా వెళ్ళిపోయేవారు.

ఇతను చూస్తే ఎప్పుడో పొద్దెక్కాక లేస్తాడు.

ఏ పన్నెండుకో ఒంటిగంటకో బయటికెళ్తాడు.....

ఆ వచ్చేదెవత్తో బలే సుఖపడుతుందిలెండి.

పొద్దున్నే లేచి నాలా గడియారంతో పరుగులెత్తక్కర్లేదు' అంటూ.

అదీ అందని కాదనుకోండి. నేను ప్రతీదీ టైము ప్రకారం చేస్తా.

అతనికా పట్టింపు లేనట్టుండేది".

ఆగకుండా చెప్పుకుపోయాడు గుర్నాథం.

ఈ పాతకాలం వాళ్ళింతే. కొస్త చనువు దొరికితే మాటలాపరు అనిపించింది.

ఆయన మాటల్లో తనకుపయోగించే విషయం ఉంటుందేమో అన్న ఆశతో అలా వింటూండిపోయాడు మురళి.

"అసలు అతను చేసే పనేమిటో తెలియదు కానీ రాత్రుళ్ళు కూడా చాలా పొద్దుపోయి వచ్చేవాడు బాబూ!

ఆ వాటాకి, మాకూ ఏ సంబంధమూ లేదు కనుక అతనెప్పుడొచ్చినా మాకు తెలిసేది కాదు. కాకపోతే రాత్రుళ్ళు అతని గదిలోంచి పడే లైటు కాంతివల్ల తెలిసేది– అతనొచ్చినట్టు".

"వంటా అదీ యింట్లోనే చేసుకునేవాడా?"

"అబ్బే, అదేమీ లేదు సార్! కనీసం కాఫీ కూడా యింట్లో చేసుకునేవాడు కాడు. ఓసారెప్పుడో అతనికి కొస్త నలతగా ఉంటే ఎలా ఉందో అని మా ఆవిడ, నేనూ వెళ్ళి చూశాం- మరీ బ్రహ్మచారి కొంపనుకోండి, కిరోసిన్ స్టవ్వు కూడా లేదింట్లో, అతనిక్కాస్త బయటికెళ్ళే ఓపికొచ్చేదాకా

కాస్త కాఫీ, బ్రెడ్డూ పంపేది మా ఆవిడ. అలాగని లేనివాడిలాగా ఉండే వాడు కాదు. ఆ బట్టలూ దర్జా చూస్తే ఏదో ఆఫీసరులా అనిపించేవాడు.

ఇంట్లో కూడా గాడ్రెజ్ చెయిరూ, సోఫా, ఫోంబెడ్డూ, కలర్ టీ.వీ, ఫ్రిజ్. మా ఆవిడ నన్ను సాధించేది.

ఇన్నేళ్లూ గొడ్డులా ఉద్యోగం చేసి మీరో ఫ్రిజ్ అయినా కొన్లేక పోయారు.

అతను చూడండి అన్ని సామాన్లూ ఎలా అమర్చుకున్నాడో.

రేపొద్దున్న పెళ్ళయితే అతనే వస్తువుకీ తడుముకోనక్కర్లేదు" అని.

ఆదన్నదీ తప్పులేదులెండి.

అతని తరహాయే అలాగుండేది.

"అంత దర్జాగా బ్రతికేవాడు అలా హుస్సేన్‌సాగర్లోపడి చచ్చి పోయాడంటే మా కసలు నమ్మబుద్ధికావట్లేదు."

కాస్త విచారంగా అన్నాడు గుర్నాథం.

"అతని ఫోటో పేపర్లో వేసి రెండ్రోజులయ్యింది కదా!

మీరింత ఆలస్యం ఎందుకు చేశారు, స్టేషనుకి రావడానికి?"

అనుమానంగా అడిగాడు మురళి.

జవాబివ్వడానికి కాస్త సిగ్గుపడ్డట్టు కనిపించాడు గుర్నాథం.

ఓ నిమిషం పాటు మౌనం వహించాడు.

"పర్వాలేదు. చెప్పండి.....

మీరు నిజం చెప్పండి. అబద్ధం చెప్తే మా దర్యాప్తులో మాకు తెలిసిందంటే మాత్రం మీకే నష్టం."

"అబ్బే! ఇందులో మరీ అంత సీరియస్ విషయం లేద్సార్!"

రిటైరయినప్పటి నుండీ పేపరు తెప్పించట్లేదు.



నేను పక్కవాళ్ళ పేపర్ చూసి ఇచ్చేస్తూంటాను.

వాళ్ళు రెండ్రోజుల క్రిందట ఊరెళ్ళి ఈ ఉదయమే వచ్చారు.

ఈ రెండ్రోజుల పేపర్లూ వాళ్ళు చూశాక వాళ్ళ నుండి తీసుకుని ాను.

అందుకే మాకీ విషయం యిప్పుడే తెలిసింది.

అదీ మా ఆవిడే అతని ఫోటో చూసి గుర్తించి నాతో అంది.

ఇతను మన సదాశివం లాగున్నాడు కదండీ అంటూ.

అప్పుడే నేనూ చూసి గుర్తుపట్టాను.

సంజాయిషీగా అన్నాడు గుర్నాథం.

తన అనుమానానికి తనకే నవ్వొచ్చింది మురళికి.

డిపార్టుమెంటులో ఉద్యోగం చేసి చేసి తనకి ప్రతీ విషయాన్నీ అను నించడమే అలవాటయిపోయినట్టుంది.

పాపం, ఆ ముసలాయన తన వ్యక్తిగత కారణాల వల్ల పేపరు గా చూస్తే, అతనేదో నేరం చేసినట్టుగా మాట్లాడాడు.

నిజానికి ఆయనకే ఈ నేరంతో సంబంధం వుంటే తనంత తానుగా వివరాలందించేవాడా?

"ఆ సదాశివానికి స్నేహితులెవరయినా ఉన్నారా?

అతను మీ ఇంట్లో ఉన్నంత కాలంలోనూ కనీసం ఏ ఒకళ్ళో రో అయినా అతని కోసం వచ్చి వుంటారు కదా?" గుర్నాథాన్ని అడి మురళి.

"లేదు సార్! చెప్పానుగా అతనదోరకం మనిషి.

అతనికి స్నేహితులంటూ ఏ ఒక్కరూ రాలేదు సరికదా! అతను ట్టుపక్కల ఏ ఒక్కరితోనూ మాట్లాడ్డం కూడా చూడలేదు నేను.

బట్టలు కూడా అతనే ఉతుక్కునేవాడేమో.

అప్పుడప్పుడూ బయట దండేనికి వేల్లాడుతూ వుండేవి.

కనీసం ఆ బట్టల్ని చాకలికిచ్చినట్టు కూడా లేదు ఒక్కసారయినా.

అతను మా యింట్లో దిగిన కొత్తలో మా చాకలబ్బాయికి చెప్పాను నేను. అతని బట్టలు వుంటాయేమో, అడిగి తీసుకుపొమ్మని.

అతను అవసరం లేదన్నాట్ట.

మా చాకలికే కాదు, అసలే చాకలికీ బట్టలు వేసినట్టు నేను గమనించలేదు."

అదో విచిత్రమయిన విషయంగా అనిపించింది మురళికి.

ఈ మహా నగరంలో బ్రతుకుతూ ఈ బ్రతుకు వేగంలో మనిషి రాన్రానూ ఇరుగు పొరుగులతో స్నేహ సంబంధాలని మరిచి కుంచించుకుపోతున్నాడన్నమాట నిజమే.

కానీ మరీ ఇలా ఎవరితోనూ కలవక ఒంటరిగా ఉంటూన్నాడంటే మాత్రం తప్పకుండా ఆలోచించవలసిన విషయమే!

"సరే! మీ ఇల్లెక్కడో అడ్రసు ఇచ్చి వెళ్ళండి.

నేనోసారి పిలుచుకుని రాత్రిలోగా వస్తాను.

అతని వాటా తెరిచి చూడాలి".

గుర్నాథాన్నుండి యింక తెలుసుకోవాల్సినది లేదనిపించడంతో అన్నాడు మురళి.

"అన్నట్టు ఒక్క విషయం మర్చిపోయాను బాబూ!"

"మీకేమయినా పనికొస్తుందేమో" నసుగుతూ అన్నాడు గుర్నాథం.

"చెప్పండి! అదెంత చిన్న విషయమైనా సరే మీరు అలక్ష్యం చెయ్యక మాతో చెప్తే మాకు సాయం చేసినవాళ్ళవుతారు."



"మీకు తెలిసినవన్నీ మీరు మాకు చెప్పకపోతే, మీరు మా డిపార్టుమెంటుకి సహకరించకపోతే, మా వృత్తి ధర్మాన్ని మేము సక్రమంగా నిర్వహించలేం"

గుర్నాథానికీ మాటల్తో కాస్త ధైర్యం వచ్చినట్టుంది.

జేబులో చెయ్యిపెట్టి ఏదో వుండలాంటి దాన్ని బయటికి తీశాడు.

అది ఓ పేపరుతో చుట్టిన పొట్లం.

ఆ పొట్లాన్ని టేబుల్ మీదుంచి నెమ్మదిగా విప్పాడు.

అందులో ఓ ఫోటో తాలూకు నాలుగు ముక్కలున్నాయి.

ఆ ముక్కల్ని సాపుగా టేబుల్ మీద ఒకదానిపక్కనొకటి పెట్టాడు గుర్నాథం.

ఏదో ఫోటో తాలూకు ప్రూఫ్ అని తెలుస్తోంది.

అందులో ఎవరో ఇద్దరు స్త్రీ, పురుషులున్నారు.

మరీ సన్నిహితంగా....

"ఇన్స్పెక్టర్‌గారూ! ఈ ముక్కలు మా పెరట్లో చెత్తబుట్టలో దొరికాయి.

మా చెత్తబుట్ట అంటే మా ఒక్కరిదీ కాదనుకోండి....సదాశివం కూడా తన చెత్త అందులోనే పోస్తాడు.

ఇందాక మాఆవిడ పనమ్మాయిని చెత్త బయట పారబొయ్యమందామని చెప్పి వెళ్ళి చూసిందట.

దానికి చెత్తకుండిలో ఈ ముక్కలు దొరికాయి.

ఈ ఫోటో మేము చింపి పడెయ్యలేదు.

కనక అతనే పడేసి వుంటాడనిపిస్తోంది.

నిజానికి ఈ అసభ్యమైన ఫొటో మీ దగ్గరికి తేవాలంటే సిగ్గుగానే వుంది.

ఒకవేళ మీకు పనికిరాదనుకుంటే ఈ ముక్కలు బాగా చింపేసి బయట పడెయ్యండి."

సిగ్గుతో ఎర్రబడ్డ మొహంతో అన్నాడాయన.

గున్నాథం మాటల్తో ఆ ఫోటోని పరిశీలనగా చూశాడు మురళి.

ఆ ముసలాయనన్నదీ నిజమే.

ఆ ఫోటో ఏదో శృంగార పత్రికకి తీసినట్టు వల్గర్‌గా వుంది.

ఆ యువతీ యువకుల్ని పరిశీలనగా చూశాడు మురళి.

అంతే....

అదిరిపడ్డాడతను.

వాళ్ళు....

వాళ్ళిద్దరూ భార్గవ, లైలాలు.

ఆనాటి వాళ్ళ మాటలతోనూ, ప్రవర్తనతోనూ వాళ్ళ మధ్య సన్నిహిత సంబంధాలున్నాయి అనేది అతనేనాడో గ్రహించాడు.

అతనాశ్చర్యపడేది అందుక్కాదు.

భార్యాభర్తలు కూడా తీయించుకోడానికి సిగ్గుపడే భంగిమలో, అక్రమ సంబంధం వున్న ఓ యువతీ యువకులు ఫోటో తీయించుకున్నారంటే అతనికి నమ్మబుద్ధికావట్లేదు.

అంతగా వాళ్ళు ఫోటో కావాలని తీయించుకున్నారనుకున్నా, అదీ వాళ్ళిద్దరిలో ఎవరి దగ్గరో వుండక, ఇలా ఓ మూడో మనిషి దగ్గరుండటం మరింత ఆశ్చర్యంగా వుంది.



వెంటనే అతనికి అనిపించింది—ఇదేదో బ్లాక్‌మెయిలింగ్ కోసం ...న ఫోటో అని.

మరుక్షణంలోనే ఆ అనుమానం బలపడింది.

సదాశివం గూర్చి ఆ ముసలాయన ఇచ్చిన వివరాలు తలుచుకునే ...కి.

ఏ ఉద్యోగమూ లేకుండా జల్సాగా ఓ వ్యక్తి బ్రతుకుతున్నాడంటే- ...నికి ఏదో అక్రమ సంపాదన వుండుండాలి.

అంటే....

అతనిలా బ్లాక్‌మెయిలింగ్ చేసి బ్రతుకుతున్నాడా?

తను గడిపే చీకటి జీవితం కారణంగానే అలా ఏకాంతంగా బ్రతుకు...న్నాడా?

"ఈ ఫోటోలోని మనుష్యులు ఎప్పుడయినా సదాశివాన్ని కలిశారా?" ...దుకయినా మంచిదని మళ్ళీ అడిగాడు గున్నాథాన్ని.

"మీకిదివరకే చెప్పాను కదా సార్! అతని కోసం ఒక్కళ్ళు కూడా ...ంతవరకూ రాలేదు."

మళ్ళీ రెట్టించి చెప్పాడు గున్నాథం.

కేసు కొద్దిగా అర్థమవుతోంది మురళికి.

భార్గవ, లైలాల ఫోటో తీశాడు సదాశివం.

ఈ ముక్కలు ప్రూఫ్ ముక్కలు కనక అతను క్లియర్ ఫోటో ...నే వుంటాడు.

ఆ ఫోటో సాయంతో అతను తప్పకుండా వాళ్ళని బెదిరించే ...ుంటాడు.

వెంటనే వాళ్ళను కలవాలి.

అదే తన తక్షణ కర్తవ్యం.

గుర్నాథం సెలవు తీసుకుని వెళ్ళిపోగానే కానిస్టేబుల్ని పిలిచి భార్గవని ఒక్కసారి తన దగ్గరికి తీసుకురమ్మని చెప్పాడు.

లోగడ సీత విషయంలో అతను తనను కలిసినప్పుడు అతనికిచ్చిన ఎడ్రను యిప్పుడీ విధంగా పనికొచ్చింది.

* * * * *

ఇన్స్పెక్టరు మురళి ఎదురుగా కూర్చున్నాడు భార్గవ.

అతనికి ఇన్స్పెక్టర్ మురళి కొత్తవాడు కాదు.

ఇదివరలో పరిచయం వున్నవాడే....

కానీ ఇప్పుడు అతను ఏదో కొత్త మనిషిలా వున్నాడు.

అతని చూపుల్లోని కరుకుతనం, అతని ముక్తసరితనం భార్గవలో ఏదో ఓ తెలియని బెరుకుని కలిగిస్తున్నాయి.

"ఏ....మిస్టర్ భార్గవా....! సదాశివాన్ని మీరెప్పుడు కలిశారు చివరి సారిగా?"

ఉలిక్కిపడ్డాడు భార్గవ.

అంతలోనే తనను తాను సంబాళించుకున్నాడు.

కానీ అతని ఉలికిపాటు మురళి ఎక్స్రే చూపుల్ని తప్పించుకోలేక పోయింది.

అయినా మౌనంగా అతని సమాధానం కోసం వేచి చూశాడు మురళి.

"సదాశివమా? అతనెవరు?"



"భార్గవా! సదాశివం మీకు తెలుసనే విషయం నాకూ తెలుసు. మీకు సినంతవరకూ మీరు చెప్పేస్తే మీకు నా సాయం వుంటుంది."

అతని స్వరంలో వినిపిస్తున్న హెచ్చరిక భార్గవను కుదిపేస్తోంది.

గిన విషయాన్ని చెప్పేద్దామా అనిపించిందతనికి.

కానీ మరుక్షణమే తమాయించుకున్నాడు.

ఇందులో శవాన్ని మాయం చేయడానికి తను సాయపడ్డాడన్న దం తప్ప మరో నేరం లేదు తన మీద.

కానీ....

తను పెదవి విప్పిన మరుక్షణం....

లైలా....

తన లైలా ఉరికంబం ఎక్కుతుంది.

ఆమెను రక్షిస్తానని వాగ్దానం చేశాడు తను.

ఇప్పుడు తనే ఓ అప్రూవర్గా మారి....

జరిగిన విషయాన్ని తనే తెలియచెప్పి ఆమెకి అన్యాయం చెయ్యడు, య్యలేదు.

ఆమెకు తనిచ్చిన మాట ప్రకారం దైవం అనుకూలిస్తే ఇద్దరూ ఈ ం నుండి బయటపడతారు.

లేదంటే నేరం తన మీదనే మోపుకుంటాడు.

"ఇన్స్పెక్టర్గారూ! మీరేదో పొరబడుతున్నట్టున్నారు.

అసలు ఆ సదాశివం ఎవరో నాకు తెలియదంటే నమ్మరేం?" తనూ న్ని పలికిస్తూ అన్నాడు భార్గవ.

"సదాశివం ఎవరో చెప్పాలా?

మూడ్రోజుల క్రితం హుస్సేన్‌సాగర్‌లో శవమై తేలాడిన ఆ సదాశివం....

ఇప్పుడొప్పుకుంటారా అతను మీకు తెలుసని?"

భార్గవ కళ్ళల్లోకి తీవ్రంగా చూస్తూ అడిగాడతను.

"అతనెవడో శవమై హుస్సేన్‌సాగర్‌లో తేలినా, గంగానదిలో తేలినా నాకు సంబంధం లేదు.

నాకు సదాశివం అన్న పరిచయస్తుడూ లేడు."

ఓ రకంగా భార్గవ చెప్పిందీ నిజమే!

ప్రాణాలు కోల్పోయాక సదాశివాన్ని చూశాడే తప్ప అతనితో ఏ పరిచయమూ లేదు....

అతను బ్రతికున్న రోజుల్లో.

తను నిజమే చెప్తున్నాడు కనక అతని స్వరంలో ఏమాత్రమూ జంకూ, గొంకూ లేదు.

అతనంత ఖండితంగా చెప్తూంటే మురళీకే అనిపించింది–తన అనుమానం తప్పేమో అని.

కానీ ఏ విషయాన్నీ అంత సులువుగా పోనిచ్చే స్వభావం కాదతనిది.

"అన్నట్టు లైలా-మిసెస్ చౌదరి ఎలా వున్నారు?"

సడన్‌గా టాపిక్ మారుస్తూ అడిగాడు మురళీ.

"మిసెస్ చౌదరి ఎలా వుందో, మిసెస్ నాయుడు ఎలా ఉందో ఎవరి భార్య ఎలా వుందో....ఇవన్నీ సేకరించడమే నా వృత్తి అనుకున్నారా?"



లేని కోపాన్ని నటించాడు భార్గవ.

"మరీ అంత సీరియస్ కాకండి—అది మీకే నష్టం.

మిసెస్ చౌదరికీ మీకూ చాలా క్లోజ్‌నెస్ ఉందనే విషయం నాకు తెలుసు."

ప్రశాంతంగా అన్నాడు మురళీ.

అదిపడ్డాడు భార్గవ.

ఎవరికీ తెలియదనుకున్న ఈ విషయం ఇన్‌స్పెక్టరు దృష్టికెలా వచ్చింది?

ఇంత చురుకైనవాడు కనకేనేమో ... అతనికి డిపార్టుమెంట్లో అంత మంచి పేరుంది.

మురళీ చాకచక్యాన్ని మనసులో అభినందించకుండా ఉండలేకపోయాడు భార్గవ.

"ఇన్‌స్పెక్టర్! పరువుగా బ్రతుకుతూన్న ఓ ఇల్లాలిని మీరిలా అనుమానించి బయటకి లాగడం మంచిది కాదేమో."

ఈసారి భార్గవ గొంతులో ముందున్న తీవ్రత లేదు.

"భార్గవా! ఈ కాకీబట్టలు వేసుకున్నంత మాత్రం చేత మా గుండెలు బండరాళ్ళనుకోకండి.

ఆమెను అల్లరి చేయాలంటే, అనుమానం మీద ఆమెని అరెస్టు చేసి స్టేషనుకి తీసుకురావడం నా చేతిలో పని.

అలాంటి సంఘటన జరగడం ఇష్టంలేకే మిమ్మల్ని పిలిచి అడుగుతున్నాను.

సదాశివం మీకెలా తెలుసో చెప్పండి."

"నా మాట నమ్మండి ఇన్‌స్పెక్టర్. సదాశివం నాకు తెలియదు."

"అంటే....అతను మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చెయ్యలేదంటారు"

"నన్నా?....నన్నతనెందుకు బ్లాక్ మెయిల్ చేస్తాడు?"

అమాయకత్వం నటిస్తూ అడిగాడు భార్గవ.

"ఎందుకా? ఇందుకూ...."

డ్రాయరు లాగి అందులోంచి ఆ ఫోటో ముక్కలు తీసి బయట పెట్టాడు మురళి.

భార్గవ తెల్ల మొహం వేశాడు.

అతని శరీరంలో రక్తప్రవాహం ఆగిపోయినట్టయ్యింది.

అయిపోయింది....అంతా అయిపోయింది.

ఏ రహస్యం బయటపడకూడదని పాపం, లైలా ఓ హత్య చెయ్యటానికూడా తెగించిందో, ఆ రహస్యం ఇప్పుడు వెల్లడయిపోయింది.

ఇప్పుడు తమ ఇద్దరి పేర్లూ పేపర్ల కెక్కడం ఖాయం.

"ఇన్‌స్పెక్టర్!" లేచి మురళి చేతులు పట్టుకున్నాడు భార్గవ.

"ఇవి చేతులు కావు-కాళ్ళనుకోండి.

మా ఇద్దరికీ సంబంధాలు ఉన్నమాట నిజమే.

ఇందులో ఆమె తప్పులేదు.

తన మానాన తను సంసారం చేసుకుంటూంటే, నేనే ఆమెని వల్లో వేసుకున్నాను.

నా కారణంగానే ఆమె దారి తప్పింది."

ఆ మాటలకి చిన్నగా నవ్వాడు మురళి.

"మైడియర్ భార్గవా! విశామ్!



ఇలాంటి సంబంధాల్లో తప్పు ఏ ఒక్కరిదో అనుకుని వాళ్ళనే నిందించడం సమంజసం కాదు.

మీరామెనెంతగా డిఫెండ్ చేద్దామనుకున్నా, ఆమెని అమాయకురాలిగా అనుకోలేం.

పెళ్లికాని ఓ కన్నెపిల్ల ఓ మగాడి మాటలకి మోసపోయి లొంగిపోయిందంటే అందులో అర్థం ఉంటుంది.

కానీ పెళ్ళయి హాయిగా సంసారం చేసుకుంటూ సంఘంలో ఓ ముఖ్యమైన వ్యక్తిగా గుర్తింపబడుతూన్న ఆడది అంత తేలిగ్గా ఓ మగాడి వల్లో పడిపోదు.

తనకంటూ మనసులో ఆ వ్యక్తిపట్ల ఇష్టం వుంటే తప్ప.

సో, మీరింక ఆ విషయంలో ఆమె అమాయకురాలని ప్రూవ్ చేద్దామన్న ప్రయత్నం మానండి.

ఇప్పటి సమస్య అదికాదు.

సదాశివం మిమ్మల్నీ భంగిమల్లో ఫోటో తీశాడంటే అర్థం-అతను కాలక్షేపానికో, కళాభిరుచితోనో తీశాడని కాదు కదా!

మీ రహస్య సంబంధం తెలుసుకుని, మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేయాలనే తీసుంటాడు.

ఇంత మంచి ఛాన్సుని అతను పాపభీతితో పోగొట్టుకోడనే నా ఉద్దేశ్యము.

సో, అతను మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చెయ్యగానే మీరతని నోరు శాశ్వతంగా మూసి అతని పీడ వదిలించుకున్నారు.

యామై కరెక్ట్?"

భార్గవ మనసు మూలల్లోని రహస్యాన్ని వెలికిలాగడానికి మురళి చూపులు అతని గుండెల్లోకి దూసుకుపోతున్నట్టున్నాయి.

"ఇన్‌స్పెక్టర్! మీరు ఏదేదో ఊహిస్తున్నారు.

అతను మా ఫోటో తియ్యడానికి అసలు అవకాశమే లేదు.

ఎందుకంటే నిజానికి మా ఇంట్లోనో, ఆమె బెడ్రూంలోనే తప్ప మేము ఏ హోటల్లోనో కానీ, మరేదయినా పరాయి ప్రదేశంలోనో కానీ కలుసుకోనేలేదు.

సరే....అతనేదోలాగ మా ఫోటో తీశాడనుకున్నా, అతను నన్నింత వరకూ ఆ ఫోటోతో బ్లాక్ మెయిల్ చెయ్యనేలేదు.

మీరు నమ్మినా, మానినా నిజం అదే.

పోనీ అతను నన్ను బ్లాక్ మెయిల్ చేశాడనుకున్నా నేనో, లైలాయో అతనికి డబ్బిచ్చి మా రహస్యాన్ని కాపాడుకుంటాం తప్ప ఇలా హత్యచేసి మరింత పెద్ద నేరంలో ఇరుక్కుంటామా?

అయినా మమ్మల్ని బ్లాక్ మెయిల్ చేస్తూన్న వ్యక్తి మా చేతుల్లోనే చనిపోయేంత అజాగ్రత్తగా ఉంటాడా?"

తన్ని తను డిఫెండ్ చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాడు భార్గవ.

తన మాటలు మురళినెంతవరకూ కన్విన్స్ చేస్తాయో తెలియదు.

కానీ ఏదో విధంగా అతనికి నచ్చచెప్పకపోతే తనీ స్టేషన్లో ఇప్పుడే అరెస్టు చెయ్యబడతాడు.

"అతని అజాగ్రత్త అనుకోనక్కర్లేదు-మీరంతగా అతన్ని నమ్మించి ఉండచ్చు.

సపోజ్ మీరతనితో వ్యవహారం సెటిల్ చేసుకుందాం రమ్మని టాంక్ బండ్ మీదకి పిలిచి, అతను అదమరపుగా ఉన్నప్పుడు నీటిలో తోసేసి వుండచ్చు. చెప్పలేం కదా!"

హత్య ఎలా జరిగి ఉండచ్చో ఆలోచిస్తూ అన్నాడు మురళి.

మురళి గెస్సింగ్ వాస్తవానికి ఎంత దగ్గరగా ఉందో ఊహించేసరికి ఒళ్ళు జలదరించింది భార్గవకి.

సదాశివాన్నలా తోసేసిన మాట నిజమే!

కాకపోతే స్పాట్ మాత్రం హుస్సేన్ సాగర్ కాదు-చౌదరి ఇంట్లో స్విమింగ్ పూల్.



ఇక తను వాదించి లాభం లేదు.

తమని అరెస్టు చెయ్యడం చెయ్యలేకపోడం అన్నది మురళి ఇష్టం.

చివరి ప్రయత్నంగా అన్నాడు భార్గవ....

"ఇన్స్పెక్టరుగారూ! నేనెంత చెప్పినా మీరు నమ్మట్లేదు.

మిమ్మల్ని నమ్మించలేకపోడం నా దురదృష్టం.

నిజంగా నేనా హత్య చేశాననుకుంటే మీ ఇష్టం.

మీరు ఈ క్షణాన్నే నన్ను అరెస్టు చెయ్యచ్చు. ఏం చేసినా మీ ఇష్టం."

భార్గవ మాటల్లోని నిస్సహాయత, నిజాయితీ మురళి మనసుని కదిలించాయి.

ఒంటరిదై పోయిన సీత కనిపించట్లేదంటూ అతడానాడు కంప్లెయింటు ఇచ్చినప్పుడు అతన్లోని మానవత్వాన్ని మెచ్చుకున్నాడు తను.

సాటి మనిషిపట్ల సంఘంలోని ఓ వ్యక్తిగా తన బాధ్యతను తను గుర్తించినందుకు మనసులోనే అతన్ని అభినందించాడు కూడా.

అలాంటి మంచి మనిషి ఇప్పుడిలా ఓ హంతకుడిగా మారాడంటే నమ్మలేకపోతున్నాడు.

ఒక బలహీనమైన క్షణంలో అతను లైలాతో సంబంధం పెట్టుకుని వుండచ్చు.

కానీ ఆ తప్పు కప్పిపుచ్చుకోడానికి మరో మనిషి ప్రాణాన్ని బలిగొన్నాడంటేమాత్రం నమ్మడం కష్టం అనిపించింది.

అయినా అతనెక్కడికి పోగలడు తన కన్నుగప్పి?

జరిగినదాంట్లో లైలా తప్పు లేదంటూ ఆమెను రక్షించడానికతను చేసిన ప్రయత్నం అతనికి ఆమెపట్ల ఏర్పడ్డ అనుబంధాన్ని వివరించి చెప్తోంది.

చట్టాన్నుంచి తప్పించుకోడానికయినా సరే, అతనామెను విడిచి వెళ్ళడు ఎక్కడికీ.

అదీ మాత్రం నిశ్చయం....

చౌదరి కళ్ళుగప్పి లైలాతోసహా ఎక్కడికో ఉడాయించడం అన్న ఆలోచనే అతనికొచ్చివుంటే అది ఎప్పుడో చేసి వుండేవాళ్ళు.

కనుక ప్రస్తుత పరిస్థితిలో అతన్ని స్వేచ్ఛగా బయట తిరగనిస్తేనే నయం....

తనకు తెలియని మరికొన్ని రహస్యాలు బయట పడొచ్చనిపించింది మురళికి.

"నీ భార్గవా! నీ మాటలు నమ్మి నిన్ను విడిచిపెడుతున్నాను ప్రస్తుతానికి.

దీన్ని అలుసుగా తీసుకుని నువ్వు ఎక్కడికయినా పారిపోవాలనుకుంటే మాత్రం చిక్కుల్లో పడతావు.

నువ్వే నేరస్థుడివని నాకు మరిన్ని సాక్ష్యాలు దొరికితేమాత్రం నిన్ను అరెస్టు చెయ్యక తప్పదు.

ఇప్పుడు నీకిస్తూన్న ఈ స్వేచ్ఛ ద్వారా నీ నిజాయితీని నిరూపించుకునే అవకాశం యిస్తున్నాను నీకు.

దీన్నెలా ఉపయోగించుకుంటావో నీ ఇష్టం....

నువ్వు మాత్రం ప్రస్తుతానికి వెళ్ళొచ్చు.

ఎట్టి పరిస్థితుల్లోనూ నాకు చెప్పకుండా ఊరొదిలి వెళ్ళడానికి ప్రయత్నించకు.

దానివల్ల నీకు నువ్వే మెడకి ఉరితాడు తగిలించుకున్న వాడివవుతావు...."

వార్నింగిచ్చాడు మురళి.

"చాలా థేంక్స్ సర్! నన్ను నమ్మండి....

నేను పారిపోయే ప్రయత్నాలు చెయ్యను."

మాట ఇస్తున్నట్టుగా అన్నాడు భార్గవ.

"ఓకే! ట్రై యువర్ లక్....!

ఈ హత్య నువ్వు చెయ్యలేదని తేలేంతవరకూ నా దృష్టిలో నువ్వే అనుమానితుడివి.



ఆ విషయం మర్చిపోకు—"

మరోసారి హెచ్చరించాడు మురళి.

మౌనంగా తలూపి అక్కడ్నించి బయటపడ్డాడు భార్గవ.

** ** ** **

ఊహించని సంఘటనతో మనసంతా మొద్దుబారిపోయినట్టయింది భార్గవకి.

సదాశివం శవాన్ని ఆనాడు హుస్సేన్‌సాగర్‌లో తోసెయ్యడం తప్ప తనుగా చేసిన నేరమేమీ లేదిందులో.

ఏ క్షణాన్నయినా తను నిజం చెప్పి తన ప్రాణాన్ని రక్షించుకోగలడు.

కానీ అసలు తన ఉద్దేశ్యం అది కానేకాదు.

తనను నమ్మి, తనువూ, మనసూ అర్పించిన ఆడదాన్ని పోలీసుల పాల్జేసి, తను మాత్రం హాయిగా బయటపడేంత నీచుడు కాడు తను.

అసలు తమ యిద్దరి మధ్యా ఈ సంబంధమే లేకపోతే సదాశివానికి ఆమెను బ్లాక్‌మెయిల్ చేసే అవకాశమే లేదు.

అది లేనినాడు ఆమెకు సదాశివాన్ని చంపే అవసరమూ లేదు.

స్వహస్తాలతో చెయ్యకపోయినా ఈ హత్యకి కారణం మాత్రం తనే....

అందువల్లే ఈ హత్యలో తనే దోషిగా శిక్షనుభవిస్తాడు.

ఈ నిర్ణయంలో మాత్రం మార్పుండదు.

ఇప్పుడు ఇన్స్‌పెక్టర్ మురళి అనుమానం తామిద్దరిమీదా వుంది.

అంటే కొద్దిరోజుల్లో తను కోర్టులో శిక్షింపబడతాడా?

శిక్షకీ, అవమానానికీ భయపడటంలేదు అతను.

ప్రాణంగా ప్రేమించిన లైలాకి దూరం కావడం ఎలా అన్నదే అతని సమస్య.

హత్యకి కారణాలు బయటకొస్తే ఆమె నలుగురిలోనూ తలెత్తుకు తిరగలేదనే అతని ఆవేదన....

దావానలంలా దహిస్తూన్న ఈ బాధను తట్టుకోవాలంటే లైలా సాన్నిధ్యమే మందనిపించింది భార్గవకి.

ఎప్పుడూ ఫోన్ చేసి వెళ్ళేవాడు అతను.

అలాంటిది ఆ బాధలో అతను తిన్నగా చౌదరి ఇంటికేసి నడిచాడు.

ఆమెను కలుసుకోవాలనీ....

ఆమె ఒడిలో తల వాల్చి తన దుఃఖాన్నంతా మర్చిపోవాలనీ....

** ** ** **

జరిగిన విషయం భార్గవ నోటి నుండి వింటూనే అదిరిపడింది లైలా.

ఆమె మొహంలో కత్తివాటుకి రక్తం చుక్క లేనట్టుంది.

"భార్గవా! పోలీసుల దృష్టి నీమీదున్నప్పుడు నువ్విక్కడికెందుకు వచ్చావు?

వాళ్ళ అనుమానానికి మరింత బలం కలుగుతుంది."

తీక్షణంగా అంది లైలా.

తనను చూడగానే పరిగెత్తుకొచ్చి తనను అల్లుకుపోయే లైలా....

తనతో సరదాగా గిల్లికజ్జాలాడుతూ చిలిపిగా పంతాలుపోయే లైలా తెలుసు భార్గవకి..... కానీ అప్పటి ఆమె రూపం అతనికి కొత్తగా వుంది.

అసలు ఆమె అంతగా కోపించడానికి తనవల్ల జరిగిన నేరం ఏమిటో అర్థంకాలేదతనికి.

తెల్లబోయి చూశాడామెవంక.

"భార్గవా! నువ్విక్కడికి రావడం ఎవరయినా చూసే వుంటారు.

దయచేసి వెంటనే వెళ్ళిపో....

లేకపోతే మనల్ని అరెస్ట్ చేసే అవకాశం పోలీసులకు మనమే యిచ్చినట్టవుతుంది."

ఆమె తీరు చూస్తుంటే అతనికి గుండెనెవరో తరుగుతున్నట్టుంది.

నిజానికి ఆమె అతని స్వంతం కాదు....



పరాయి వ్యక్తి పెళ్ళాం....

అయినా ఆమె నతనెంత ఆత్మీయంగా భావించాడంటే....

ఆమె కోసం నవ్వుతూ ప్రాణాన్నివ్వడానికి సిద్ధపడ్డాడు.

ఒకవేళ చౌదరికి తన రాకపోకల విషయం తెలుస్తుందనా ఆమె భయం?

అదే అయితే దాన్ని చెప్పడానికో తీరుంది.

ఓ పద్ధతుంది....

ఒక్క మాట....

తనతో ఒక్కమాట లాలనగా మాట్లాడితే చాలు....తన గుండె చల్లారుతుంది.

ఆమెను మరింతగా వేడుకోడానికి అతని అహం అడ్డొచ్చింది.....

"సారీ లైలా! అయామ్ వెరీ సారీ!

నా రాక నీకింత కష్టాన్ని కలిగిస్తుందనుకుంటే రాకనేపోయేవాడిని.

ఇంకెప్పుడూ నీకు కనిపించను.

నన్ను మర్చిపోవచ్చు.

గుడ్‌బై...."

విసురుగా అని బయటికొచ్చేశాడు అతను.

ఆ సమయంలో ఆమె గదిలోని పార్టిషన్ స్క్రీన్ వెనకున్న పాదాలను అతనేమాత్రం గమనించినా ఆమె మీద అతనికంతగా కోపం వచ్చుండేదికాదు.

పరాగ్గా చేసిన చిన్న పొరపాటే జీవితంలోని ముఖ్యమైన మలుపులకు కారణం అవుతుంది.

** ** ** **

లైలాని అంతగా ప్రేమించినందుకు....

అంతగా ఆరాధించినందుకు తన మీద తనకే కోపంగా వుంది....

అసహ్యంగా ఉంది అతనికి.

పూల హారంగా భావించి ఓ పాముని న్నాళ్ళూ మెడలో వేసుకున్నాడా తను....

పువ్వుల తోటగా భావించి ఓ రొచ్చుగుంటలో తన్నుకున్నాడా యిన్నాళ్ళూ?

హత్య చేయకుండానే పోలీసుల దృష్టికి వెళ్ళాననే బాధతో బరువెక్కిన అతని మనసు ఆమె చూపించిన నిరాదరణకి అగ్నిపర్వతంలా రగిలిపోతోంది.

అంతవరకూ అంతగా లైలా మైకంలో పడిపోయినందుకు తన మీద తనకే కోపంగా వుంది.

ఈ నయవంచకి కోసం జైలుకెళ్ళాల్సిన అగత్యం లేదు తనకి.

చపల చిత్తురాలయిన ఓ ఆడదాని కోసం బ్రతుకుని బండలు చేసుకునే మూర్ఖుడు కాదు తను.

వెళ్తాడు.... ఇప్పుడు తిన్నగా పోలీస్ స్టేషన్‌కే వెళ్తాడు తను.

ఇన్స్పెక్టర్ మురళితో జరిగిందంతా చెప్పేస్తాడు.

వేరే ఉద్దేశ్యంతో సదాశివంతో తను తీయించుకున్న ఫోటోలు తనకే ఎదురు తిరిగి వ్యతిరేక సాక్ష్యాన్ని యివ్వకముందే అసలు విషయం మురళికి చెప్పేస్తాడు.

ఈ ఊబిలోంచి తననతను తప్పకుండా రక్షిస్తాడు.

అందుకతనే సమర్థుడు.

ఒళ్ళు తెలియని ఆవేశంలో ఆటో ఎక్కాలన్న విషయం కూడా మర్చిపోయి స్టేషన్‌వైపు అడుగులేస్తున్నాడు భార్గవ.

*  *  *  *

చేతిలో వున్న ఫోటో ముక్కలకేసి చూస్తున్నాడు మురళి.

భార్గవని వదిలేసినందుకు అతనికేమీ బాధగా లేదు.

అతను అమాయకుడని ఎందుకో తన సిక్స్త్‌సెన్స్ చెప్తోంది.

నిజానికి యిప్పుడు తను పరిశోధించాల్సిన మూడు హత్య కేసుల లోనూ ఏదో లింక్ మిస్సింగుగా అనిపిస్తోంది.



ముగ్గురి చావూ వేర్వేరు రకాలుగా వుంది.

కానీ మూడు చావుల్లోనూ....

పూసల్లో దారంలా....

ఓ లింక్ కనిపిస్తోంది.

నీలకంఠం చౌదరితో మాట్లాడాడు.

నిజానికి చౌదరి చెప్పిన ఏదో విషయం అతనికెంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది.

సీత చౌదరి దగ్గర డ్రయివర్‌గా పనిచేసినతని భార్య.

చౌదరిని కలుసుకుని వస్తానని చెప్పి ఆమె ఇంటినుండి బయలుదేరి వెళ్ళింది.

శవమై తేలింది.

సదాశివం చౌదరి భార్య రహస్య ప్రేమాయణం గూర్చి ఫోటో సంపాదించాడు.

భార్గవ ఒప్పుకోకపోయినా అతని లక్ష్యం బ్లాక్ మెయిలింగే అయి వుంటుంది.

అయితే అతనూ శవమైపోయాడు.

ప్రతీ కేసులోనూ చౌదరి పేరు వినిపిస్తోంది.

ధన గర్వంతో అతనా రోజు ఏదేదో అన్నమాట నిజమే!

కానీ నిజానికతను కాలు విరిగి మంచంలో పడున్నాడు.

తన పనులకి కూడా నౌకర్ల మీద ఆధారపడుతున్నాడు.

అడవిలో స్వేచ్ఛగా తిరిగే పెద్ద పులిని బంధించి బోనులో పెట్టినట్టుంది అతని ప్రస్తుత పరిస్థితి.

కానీ అతని పేరు మాత్రం అన్ని మూలలనుంచీ వినిపిస్తోంది.

మనిషి మంచంలో పడున్నా అతని పేరు మాత్రం మ్రోగిపోతోంది.

తన ఆలోచనలకి తనకే నవ్వొచ్చింది మురళికి.

యథాలాపంగా చేతిలోని ఫోటో ముక్కల్ని తిరగేశాడు.

ఓ ముక్క వెనకాల కార్నర్‌లో ఏదో స్టాంపు వేసి వుంది.

అనుకోకుండా అతని కళ్ళు ఆ స్టాంపుమీద పడ్డాయి.

చదివాడు మురళి.

'భానూ స్టూడియో, గాంధీనగరం'

అది చూడగానే ఎగిరి గంతెయ్యాలనిపించింది మురళికి.

తలా తోకా లేకుండా అగమ్యంగా వున్న కేసులో ఓ కాంతికిరణములా అనిపించింది ఆ స్టూడియో వివరాలు.

ఆ ఫోటో స్టూడియో అతన్ని పట్టుకుని అడిగితే సదాశివం గూర్చి మరికొన్ని వివరాలు తెలుస్తాయి.

కానిస్టేబుల్ని పిల్చి పురమాయించాడు.

ఆ ప్రొప్రయిటర్ని తక్షణం తీసుకు రమ్మని.

* * * * *

"సార్! పిలిచారట.... ఏదన్నా ఫంక్షనుందా సార్ ఇంట్లో?

ఫోటోలు తియ్యాలా, వీడియోనా సార్?"

చిరునవ్వుతో అడుగుతూ లోపలికొచ్చాడో యువకుడు.

అవసరాన్ని మించి మాట్లాడటంలోని అనర్థం అతనికా క్షణంలో తెలియలేదు.

ప్రశ్నార్థకంగా అతనివైపు చూస్తున్న మురళితో—

"సార్! ఇతనే సార్ భానూ స్టూడియో ఓనరు— భానుమూర్తి."

భానుని తీసుకొచ్చిన కానిస్టేబుల్ చెప్పాడు.

అర్థమయ్యింది మురళికి అతనెవరో.

"రా కూర్చో"

ఎదురుగా వున్న కుర్చీ చూపించాడు మురళి.

"థాంక్స్ సార్" అంటూ కూర్చున్నాడు భాను.

వినయంగా చేతులు ముడుచుకుని ఒళ్ళో పెట్టుకున్నాడతను.

"నువ్వు వీడియో గ్రాఫరువి కూడానా?"

యథాలాపంగా అడిగినట్టుగా అన్నాడు మురళి.

"ఈ రోజుల్లో మామూలు ఫోటో గ్రాఫరుకి బిజినెస్ ఏముంటుంది సార్?



వీడియో గ్రాఫర్ కే చేతినిండా పనుండట్లేదు....

నిజానికి హ్యాండీమాటిక్ కెమేరాకూడా ఆపరేట్ చెయ్యగలను సార్ నేను."

గర్వంగా అన్నాడు భాను.

"ఓ! అయితే నువ్వు చాలా డైనమిక్ వన్నమాట?

టీవీ సీరియల్స్ ఏమన్నా తీశావా?"

అమాయకంగా మొహం పెట్టి అడుగుతున్న మురళిని చూస్తుంటే భానుకి తన గొప్పతనం మీద నమ్మకం పెరిగిపోతోంది.

ఇన్స్పెక్టర్ గారు రమ్మంటున్నారంటే తను ఓ మూల మనసులో భయపడుతూనే వచ్చాడు.

కానీ ఇతనేమిటి ఇంత బిడ్డులా వున్నాడు?

అప్రాల్ గాడిలా వున్నాడతను అతని దృష్టిలో.

చూపిస్తాడు.... తన గొప్పతనం చూపిస్తాడతనికి.

దెబ్బకి డంగై పోవాలి ఇన్స్పెక్టర్.

"ఆమధ్య రెండు మూడు సీరియల్స్ కి కెమేరామెన్ గా చేశాను సార్!"

"ఇప్పుడు తియ్యట్లేదా?"

"ఎక్కడ సార్! క్షణం తీరికుండట్లేదు...

యమ బిజీగా వుంటోంది."

మామూలు ఫోటో గ్రాఫర్ కి పని వుండదన్న ఈ వ్యక్తి టీ.వీ. సీరియల్స్ కేసి కూడా దృష్టి మళ్ళించలేనంత బిజీగా ఉన్నట్టు చెప్తున్నాడు.

అంత బిజీ పనులు వేరే ఉన్నాయంటే ఆలోచించాల్సిన విషయమే!

మనసులో ఆలోచనలు పరిగెడుతున్నాయి మురళికి.

కానీ పైకి మాత్రం ఎప్పట్లాగే బ్లాంక్ ఫేస్ పెట్టి కూర్చున్నాడు.

"ఈ ఫోటో నీ స్టూడియోలో తీసిందే కదా!

అప్పటికే సెలో టేపుతో అంటించి వున్న ఆ ఫోటో ముక్కలని తనవైపుండేలా పట్టుకుని, వెనకాలున్న స్టాంపు అతనికి చూపిస్తూ అడిగాడు మురళి.

"అవును సార్! అది మా స్టూడియో స్టాంపే!

భానుడంటే సూర్యుడు కనక ఉదయిస్తున్న సూర్యుడి ఎంబ్లమ్‌తో భానూ స్టూడియో అన్న పేరు కలిసొచ్చేలా నేనే ప్రత్యేకంగా తయారు చేయించాను ఆ స్టాంపు."

తన ప్రత్యేకతకి మురిసిపోతున్నట్టుగా అన్నాడు భాను.

"ఈ ఫోటోలో మనుష్యుల్ని గుర్తు పట్టగలవా?"

ఫోటో టేబుల్ మీద పడేస్తూ అడిగాడు మురళి.

ఫోటోలో మనుష్యుల్ని పరిశీలనగా చూడటానికి ఫోటో చేత్తో పట్టుకున్నాడు భాను.

అతని చేతికున్న ఆరువేళ్ళు మురళి దృష్టి నాకర్షించాయి.

ఆరువేళ్ళు.... ఆరువేళ్ళు....!

మురళికి సడన్‌గా స్ఫురించింది.

నీలకంఠం చనిపోయినప్పుడు బాత్రూం తలుపు మీదున్న రక్తపు చేతి ముద్రకి వేళ్ళు ఆరు!

తాపీగా భాను చెయ్యి పట్టుకున్నాడు మురళి.

"నీలకంఠాన్నెందుకు చంపావు?"

కూల్‌గా అడిగాడు భానుని.

అతనా మాట అంటుంటే భాను చేతిమీదున్న అతని చెయ్యి కొద్దిగా బిగిసింది.

"నీలకంఠం ఎవరు?"

తిక్కగా అడిగాడు భాను.

అతని దృష్టిలో ఇన్స్‌పెక్టర్ మురళి అంతగా భయపడనవసరంలేని మనిషి....

"నువ్వు బాత్రూంలో పడదోసి చంపిన డాక్టర్ నీలకంఠాన్ని అప్పుడే మర్చిపోయావా రాస్కెల్?"

అరిచాడు ఇన్స్‌పెక్టర్ మురళి.

అతని చెయ్యి విసురుగా పైకి లేచింది.

ఆ దెబ్బకి భాను గడ్డం చిట్లి రక్తం చిమ్మింది.



అదిరిపోయాడు భాను.

అంతవరకూ కళ్ళల్లో ఉన్న నిర్లక్ష్యం స్థానే భయం చోటుచేసుకుంది అతనికి.

ఏమీ చేతకానివాడనుకున్న ఇన్స్‌పెక్టర్ ఒక్కసారిగా పులిగా మారి పంజాదెబ్బ విసిరినట్టయ్యింది

"సార్! నాకేం తెలియదు సార్!"

అతని స్వరంలో వణుకు స్పష్టంగా తెలిసిపోతుంది.

అంతే....

గుప్పిట బిగించి అతని పక్కల్లో 'దబ్ దబ్' మంటూ నాలుగైదు గుద్దులు గుద్దాడు అతను.

తోటకూర కాడలా ఒరిగిపోయాడు భాను.

"చెప్తావా ఇప్పటికయినా?"

మురళి ఘర్జించాడు.

"లేదు సార్! నాకేం తెలియదు సార్!

నన్నొదిలెయ్యండి సార్!

నేనమాయకుడ్ని సార్!"

గొల్లున గోలపెట్టాడు భాను.

"స్కౌండ్రల్....! ప్రాణాలు పోసే వృత్తిలో ఉన్న ఓ డాక్టర్‌ని అమానుషంగా చంపిన నువ్వు అమాయకుడివా?

నీ నోటంట నిజం ఎలా కక్కించాలో తెలుసురా నాకు.

ఏయ్ వన్ నాట్ ఫైవ్...."

గట్టిగా అరిచాడు అతను.

అప్పటికే అక్కడున్న సిబ్బందికి తెలిసిపోయింది—భాను వాళ్ళకి చాలా కావలసిన వ్యక్తి అని....

ఎప్పుడెప్పుడు అతనికి మర్యాద చేద్దామా అని అందరికీ ఆత్రుతగానే వుంది.

"సార్" పరిగెత్తుకొచ్చాడు ఒన్ నాట్ ఫైవ్.

"చూడూ....! పాపం.... అల్లుడుగారొచ్చారు. కాస్తంత మర్యాదలు చెయ్యండి."

ఆ మాత్రం ఛాన్సిస్తే చాలు—విజృంభిస్తాడు వన్ నాట్ ఫైవ్.

"రండి సార్! లోపలికి రండి...."

వెటకారంగా అంటూ అతడిని లోపలికి నెట్టుకెళ్ళాడు వన్ నాట్ ఫైవ్.

ఆ మరునిమిషం నుండీ దెబ్బల చప్పుడయితే లేదుగానీ, అతను బాధగా వేస్తూన్న కేకలు మాత్రం వినిపిస్తున్నాయి.

అయిదు నిమిషాలయినా కాలేదు—

అతడిని నడిపించుకుంటూ అక్కడికి తీసుకొచ్చాడు వన్ నాట్ ఫైవ్.

"సార్! చేసిన మర్యాద చాలటసార్ అల్లుడిగారికి...."

విజయగర్వంతో అన్నాడు వన్ నాట్ ఫైవ్.

"అలా కూర్చోబెట్టు అతన్ని"

వాలిపోతూన్న అతడిని అక్కడే ఉన్న కుర్చీలో కూర్చోబెట్టాడు వన్ నాట్ ఫైవ్.

"ఊఁ! ఇప్పుడు చెప్పు....

నీలకంఠాన్ని చంపింది నువ్వేనా?"

సీరియస్‌గా అడిగాడు మురళి.

"లేదు సార్! నేను చంపలేదు...."

బలహీనంగా అన్నాడు అతను.

"ఏం నాయనా! చేసిన మర్యాదలు చాల్లేదా? ఇంకా కావాలా?"

రెండడుగులు ముందుకు వేసి దూకుడుగా అన్నాడు వన్ నాట్ ఫైవ్.

"నేను నిజమే చెపుతున్నాను.

నీలకంఠాన్ని చంపినప్పుడు నేనక్కడ వున్నాను తప్ప చంపలేదు."

"మరెవరు చంపారు నీలకంఠాన్ని?"



అర్థోక్తిగా అడిగాడు.

"సదాశివం...."

ఒక్కక్షణం ఆ హాలంతా నిశ్శబ్దం ఆవరించింది.

సదాశివమే నీలకంఠం హంతకుడన్నది అతనికూడా ఆశ్చర్యంగానే వుంది.

అతనికి నమ్మకం కలగట్లేదు

"సదాశివం చంపాడా?"

రెట్టించి అడిగాడతను.

"అవును సార్! నన్ను నమ్మండి.

సదాశివమే చంపాడు....

ఆ టైములో నేనూ అక్కడ ఉండి, అతనికి సాయం చేశాను..... తే తప్ప హత్య మాత్రం నేను చెయ్యలేదు."

అంత నీరసంలోనూ ఖాసు గొంతులో వినిపిస్తూన్న స్థిరత్వం అతను మే చెపుతున్నాడని నమ్మేట్టు చేస్తోంది.

"సదాశివం ఎందుకు చంపాడు?

అతనికి నీలకంఠాన్ని చంపాల్సిన అవసరం ఏముంది?"

"సదాశివానికీ నీలకంఠానికీ మధ్య విరోధం ఏమీ లేదు సార్....! ఎవరో అతన్నీ హత్య చెయ్యటానికి పురమాయించడం వల్ల, డబ్బు సం చేస్తున్నట్టు అన్నాడు."

"ఎవరతను....?"

"అది నాతో చెప్పలేదు సార్....

నేను రెండు మూడుసార్లు అడిగాను.

కానీ అదో పెద్ద రహస్యం అన్నాడు సార్"

చాలా నిరాశ అనిపించింది మురళికి.

హత్య కేసు పరిష్కారం అవుతూన్నట్టే కనిపించి మరింత జటిల యిపోయింది.

సదాశివం బ్రతికే ఉంటే అతనిచేత నిజాన్ని కక్కించడం క్షణాల ద పని....

కానీ సదాశివం కూడా చనిపోయాడు. అతనిది ఆత్మహత్య అనుకో డానికి లేదు.

నేరాలు చేస్తూ డబ్బు సంపాదించడానికి అలవాటుపడ్డ వ్యక్తి మరణం ఆత్మహత్యకంటే హత్య అనడానికే అవకాశా లెక్కువ.

సదాశివాన్నుండి ఏ విషయాన్నీ సేకరించే అవకాశం లేదు గనక ఖానునుండే లాక్కోవాలి వివరాల్ని.

"నీకు తెలిసినదంతా వివరంగా చెప్పు...."

ఖానుని ఆజ్ఞాపించాడు మురళి.

"ఆ రోజున నేను స్టూడియో కట్టేసే ప్రయత్నంలో ఉన్నాను సార్!

సదాశివం వచ్చి నన్ను తనతో రమ్మన్నాడు.

అప్పుడప్పుడు నన్ను అతనలా సాయం పిలుస్తుంటాడు.

నేనతడికి సాయం చేసినందుకు నాకు కొద్దో గొప్పో ముట్టజెప్తాడు.

అందుకే నేనూ సంతోషంగా అతనితో వెళ్లాను.

అతనూ నేనూ కలిసి ఓ బార్‌కి వెళ్లాం.

ఆ తర్వాత అతను నన్ను నీలకంఠం ఉంటూన్న హోటల్‌కి తీసి కెళ్లాడు. మేమిద్దరం కలిసి నీలకంఠం రూముకెళ్ళాం.

నేను కాస్త దూరంలో నిలబడ్డాను.

సదాశివం వెళ్ళి బెల్ నొక్కాడు.

తలుపు కొద్దిగా తీసి నిలబడ్డ నీలకంఠంతో అతనేదో చెప్పాడు— అది నాకు వినిపించలేదు.

అతను తలుపు పూర్తిగా తీసి మమ్మల్ని లోపలికి తీసుకెళ్ళాడు.

వాళ్ళిద్దరూ ఏమిటో మెల్లిగా మాట్లాడుకున్నారు.

అంతలో నీలకంఠం బాత్రూంకి వెళ్లాడు.

సదాశివం కూడా వెనకే వెళ్ళాడు.

వెళుతూ నాకు సైగ చేసినందువల్ల నేనూ అతనితోనే వెళ్ళాను ....

బాత్రూం నుండి రాబోతున్నాడు నీలకంఠం.

అతన్నో తోపు తోశాడు సదాశివం.



అలా తోస్తూనే జేబులోంచి ఓ ప్లాస్టిక్ సుత్తి తీశాడు. సాధారణంగా ు దాన్ని కూడా తెస్తూంటాడు. దాంతో నీలకంఠం బుర్రమీద ఒక్కటి డు. దెబ్బకి అతని బుర్ర పగిలిపోయింది.

పెద్దగా అరుస్తూ నేలమీద పడిపోయాడు నీలకంఠం. అతని అరుపు ఎవరయినా వస్తారని భయం వేసింది నాకు. నిజం సార్! దేవుడి మీద ే చెపుతున్నాను. నీలకంఠం చచ్చిపోయాక అతని శవాన్ని సరిగ్గా ోబెట్టి, అక్కడ మా ఆనవాళ్ళు లేకుండా చెయ్యడం తప్ప నేను మరే ి చెయ్యలేదు సార్!"

చెప్పాడు ఖాను.

ఖాను నీలకంఠం హత్య ఎలా జరిగిందో చెప్తుంటే మురళికి రక్తం లా మరిగింది.

వీడిలాంటి క్రిమినల్స్ ఇష్టం వచ్చినట్టు మనుషుల్ని చంపుకు పోతూ ే తనలాంటి వాళ్ళు ఏం చెయ్యగలరు?

మహా అయితే నేరం జరిగాక నేరస్తుడ్ని పట్టుకోగలరు....

అంతే!

కానీ దానివల్ల ఫలితం ఏముంది?

తప్పు చేసినవాడు శిక్షింపబడటం మంచిదే!

కానీ అసలు తప్పే జరక్కుండా చెయ్యగలిగితే?

జరగబోయే నేరాన్ని అరికట్టగలిగిననాడు....

ఓ పోలీసాఫీసరు ఎంతయినా గర్వంగా ఫీలవడానికి అర్హుడు.

నీలకంఠంతో ఏదో చెప్పాడంట సదాశివం.

అది ఏదయినదీ తెలియడం కష్టం.

సదాశివం ఏదయినా చెప్పి వుండన్చు కానీ నీలకంఠం నమ్మి వాళ్ళతో ి రాత్రివేళ ఫ్రీగా మాట్లాడాడు.

ఫలితంగా వాళ్ళతని ప్రాణాలు తీశారు.

నమ్మించి ద్రోహం చేసిన కిరాతకులు వీళ్ళు.

పట్టలేని కోపంతో ఖానుని మరో గుద్దు గుద్దాడు.

"సదాశివం నీలకంఠాన్నెందుకు చంపాడు?

అది నీకు తెలిసే వుంటుంది.

నువ్వెంత బుకాయించినా నమ్మను నేను."

"నిజంగానే నాకు తెలియదు సార్!

అనలింతవరకూ బ్లాక్ మెయిల్ చెయ్యడం....

బ్లూ ఫిలిమ్స్‌లో నటించడంలాంటి చిన్న చిన్న నేరాలు తప్ప హత్య లెప్పుడూ చెయ్యలేదు

సదాశివం మేము బార్‌లో కూర్చున్నప్పుడయినా ఏదో ఆలోచిస్తుంటూ కూర్చుండిపోయాడు తప్ప నాతో ఏమీ మాట్లాడలేదు సార్" ఏడుస్తూ అన్నాడు ఖాను.

ఖాను ఏడుపు చూస్తుంటే ఒళ్ళు మండిపోతోంది మురళికి.

దుర్మార్గుడు! తన ఒంటిమీద పడిన దెబ్బలకి యింతగా ఏడ్చేస్తున్నాడు....

ఎదుటి వాడి ప్రాణాలు మాత్రం నవ్వుతూ తీసేస్తాడు.

అంత చిరాకులోనూ ఖాను చెప్పిన 'బ్లూ ఫిలిమ్స్' అన్న మాట అతనికెంతో ఇంట్రెస్టింగ్‌గా అనిపించింది.

"సదాశివం బ్లూ ఫిలిమ్స్‌లో నటిస్తాడా?"

రెట్టించి అడిగాడు మురళి.

"అవున్సార్! అతని పర్సనాలిటీ చిన్నదే కానీ అతనికా ఫిలిమ్స్‌లో చాలా డబ్బొస్తుంది.

నన్నూ అడిగాడు సార్ నటించమని. నాకు సిగ్గనిపించి ఒప్పుకోలేదు."

వెధవ! ఇంకా అంత మాత్రం సిగ్గుందన్నమాట వీడికి

ఈ బ్లూ ఫిలిమ్స్ సమస్య ఒకటి సమస్య మరింతగా పెరిగిపోతోంది.



తెలిసీ తెలియని వయసులో వున్న యువతీ యువకులు ఆ చిత్రాలు చూసి నాశనమయిపోతున్నారు.

నిజానికి సెక్సు అనేది ఓ బయాలాజికల్ నీడ్.

ఓ ఆడదానికో మగాడూ....

ఓ మగాడికో ఆడదీ వుంటే చాలు.

కానీ ఇష్టపడ్డ వ్యక్తుల మధ్య సెక్స్ అన్నది ఓ అద్భుతమయిన శృంగారం.

వాళ్ళ మనసులని వ్యక్తం చేసే శారీరక కార్యం అది.

నింగినున్న స్వర్గాన్ని నేలకి దించే మహత్తర క్షణాలవి.

భార్య మీద అనురాగంతో ఆమెనికాక మరే ఆడదాన్నీ తాకలేక ఒంటరిగా మిగిలిపోయిన మురళికి నైతిక విలువల మీద చాలా పట్టింపు.

ఎన్నోసార్లు అతను బ్లూ ఫిలిమ్స్‌లోని కొన్ని భాగాల్ని వృత్తి ధర్మంలో చూడాల్సి వచ్చింది.

ఆ క్షణాల్లో అతనికి సెక్స్ అంటేనే ఏవగింపు కలిగింది.

ఆ చిత్రాలని చూసినందుకే తనకలాంటి ఫీలింగు కలిగితే....

అందులో నటించిన వాళ్ళు ఎంత బాధపడి వుంటారో అని ఎన్నోసార్లు అనిపించిందతనికి.

ఎంత శాడిస్టు అయినా ఆ పని ఏకాంతంలోనే కోరుకుంటాడు తప్ప పదిమందీ చూడాలనుకోడు.

ఎంత తప్పనిసరి పరిస్థితుల్లో అలాంటి చిత్రాల్లో నటించి వుంటారో అని వాళ్ళమీద జాలి పడతాడతను.

ఇప్పుడా ముళ్ళ కంపలని కదపడానికో తీగ దొరికింది.

ఈ తీగని తను సరిగ్గా కదపగలిగితే డొంకంతా కదుల్తుంది.

తెర వెనకాలున్న మూలవిరాట్టులు బయటికొస్తారు.

"ఖానూ! నువ్వో నాకో విషయం చెప్తే నిన్ను ఈ కేసులో చిన్నపాటి శిక్షతో పోనిస్తాను."

"చెప్పండి సార్! మీరేం అడిగినా నాకు తెలిసినవరకూ చెప్తాను."
ఆశగా అన్నాడు ఖాను.

"ఈ బ్లూ ఫిలిమ్స్ తయారు చేస్తున్న దెవరు?
వాళ్ళ వివరాలు కావాలి."

మురళి మాటలు వినగానే నీరుగారిపోయాడు ఖాను.

"అది నాకు తెలియదు సార్"

నీరసంగా అన్నాడతను.

ఈ గండంలోంచి తను తప్పించుకునే దారి దొరికినట్టే దొరికి మూసుకుపోయిందనుకునే సరికి అతనికి చాలా దిగులుగా వుంది.

"పోనీ ఈ విషయంలో నీకింకేమీ తెలియదా?
బాగా ఆలోచించి చెప్పు."

"లేదు సార్. నాకేం తెలియదు."

అంటూనే ఆలోచనలో పడ్డాడు ఖాను.

"అన్నట్టు కిందటి వారంలో సదాశివం నాకో కేసెట్ యిచ్చాడు సార్!

అది నా దగ్గర జాగ్రత్తగా వుంచమనీ, మళ్ళీ తనొచ్చి తీసుకుంటాననీ అన్నాడు.

కుతూహలం కొద్దీ నేనా కేసెట్ ప్లే చేసి చూశాను.

మామూలు బ్లూ ఫిలిమ్ సార్ అది....

బహుశా ఎడిటింగ్ చెయ్యలేదేమో?

ఏక్టర్లు కాక చూస్తున్నవాళ్లు కూడా వున్నారు ఇద్దరు ముగ్గురు.
సదాశివానిక్కూడా ఫిలిం తియ్యడం వచ్చు.

అతనే తీసుంటాడు దాన్ని.

అందుకే అందులో వేరే అతనెవరో వున్నాడు."

ఆ సమాచారం ఏమీ ఉపయోగించదనే భావం ఖాను మాటల్లో తెలుస్తూనే వుంది.

మురళికి మాత్రం ఆ విషయం ఆసక్తికరంగా అనిపించింది.



రొటీన్‌గా బ్లూ ఫిలిమ్స్‌లో నటించే ఓ మనిషి ఓ బ్లూ ఫిలిం కేసెట్‌నీ....

అదీ ఎడిట్ చెయ్యబడని దాన్ని....

అంత జాగ్రత్తగా భద్రపరుచుకున్నాడంటే అందులో ఏదో విశేషం వుండే వుండాలి.

ఏమిటది?

ఏమై వుంటుంది?

"అది నీ దగ్గరుందా?"

"ఉంది సార్! నా రూంలోనే వుంది."

"నాతోరా! ఇప్పుడే మనం వెళ్ళి ఆ కేసెట్ తీసుకొద్దాం"

రహస్యాన్ని తెలుసుకోవాలనే కంగారులో గమనించలేదు మురళి.

ఖానుతో కూడా వచ్చి బయట నిలబడ్డ ఓ కుర్రాడు అప్పుడే చల్లగా జారుకున్నాడని.

* * * * *

ఖాను రూంలో నాలుగు వైపులా పరీక్షగా చూస్తున్నాడు మురళి.

ఓ చిన్న సైజు థియేటరులా ఉందా గది.

ఓ మూలగా టి.వీ., వి.సి.ఆర్....

హంగులన్నీ బాగానే అమర్చుకున్నాడన్నమాట అనిపించింది.

ఖాను వంక చూశాడు పరీక్షగా.

"సదాశివం, నేనూ ఇక్కడ అప్పుడప్పుడు బ్లూ ఫిలింస్ చూస్తుంటాము సార్.

ఇవన్నీ సదాశివమే తెచ్చిపెట్టాడు."

సంజాయిషీగా అన్నాడు ఖాను.

ఖాను ఇచ్చిన కేసెట్ చేతిలో పట్టుకోగానే అనిపించింది మురళికి దాన్ని వెంటనే చూడాలని.

అందులో ఏ ముఖ్యమైన రహస్యం ఉందో తెలుసుకోడానికి మరికొంత టైం దాకా ఆగాలంటే చిరాగ్గా వుంది.

ఈ కేసెట్ ఎటూ ఖాను చూసేసినదే.

ఇక్కడే ప్లే చేసి చూస్తే పోలా? అనిపించింది మురళికి.

ఆ మాట ఖానుతో అనగానే ఖాను క్షణాల మీద వి.సి.ఆర్. లో కేసెట్ పెట్టాడు.

మరు నిమిషంలో టి.వీ లో బొమ్మలు కనిపించసాగాయి.

తెరమీద యువతి బొమ్మ కనిపించగానే ఉలికిపడ్డాడు మురళి.

పట్టి పట్టి చూస్తున్నాడు మురళి.

అవును....సీత....ఆమె సీతే!

ఏదో ట్రాన్స్‌లో ఉన్నట్టుందామె.

పోస్టుమార్టం రిపోర్టు మనసులో మెదిలింది మురళికి.

"హతురాలి మొహం మీద, గెడ్డం కిందుగా అక్కడక్కడా ఫారెన్ మెటీరియల్ వుంది.

మేకప్ క్రీం తాలూకు చిహ్నాలవి."

అంటే....అంటే సీత నటించినది బ్లూ ఫిలింలో అన్నమాట.

ఆమె నటించిందా?

నటింప చెయ్యబడిందా?

రెండొదే నిజమై యుంటుంది.

అందుకే ఆమె రేప్ చెయ్యబడి, హత్య గావింపబడింది.

అమాయకురాలని అందరిచేతా చెప్పబడ్డ సీత, ఇష్టపూర్వకంగా బ్లూ ఫిలింలో నటించదనేది మాత్రం నిశ్చయం.

అందుకే ఆమె సెమీ కాన్షస్‌గా ఉన్నట్టు కనిపిస్తోంది.

సంభోగం క్లైమాక్స్‌లో వుంది.

సడన్‌గా కెమేరా అక్కడ కూర్చున్న వారివేపు తిరిగినట్టుంది.

చుట్టుపక్కల వాళ్ళు కనిపిస్తున్నారు.

అందర్లోనూ ఎంతో పైశాచిక కాంక్ష కనిపిస్తోంది.

కెమేరా నెమ్మదిగా తిరుగుతోంది.



అసలు కెమేరా వాళ్ళమీద ఫోకస్ అయిన విషయం కూడా గమనించలేనట్టుంది వాళ్ళు.

వాళ్ళ భావాల్లో మార్పు లేదు.

అంతలోనే మరో వ్యక్తి తెరమీద కనిపించాడు.

ఒక పక్కగా ప్రత్యేకంగా నిలబడి చూస్తున్నాడతను.

అతన్ని గమనించగానే షాక్ కొట్టినట్టు అదిరిపడ్డాడు మురళి.

ఏమిటి?

తను నిజమే చూస్తున్నాడా?

ఇంత విలాసంగా నిలబడి ఆసక్తిగా చూస్తున్న ఈ వ్యక్తి ఆతను .. అతనేనా?

ఇదీ....ఇది సంభవమేనా?

ఎలా సాధ్యం ఇది?

ఊహించని విషయం కళ్ళబడేసరికి మురళి మెదడు పనిచెయ్యడం మానేసింది.

అతనికంతా సంభ్రమంగా వుంది.

తన కళ్ళని తనే నమ్మలేకపోతున్నాడు.

ఆ ఆశ్చర్యం నుండి నెమ్మదిగా తేరుకున్నాడు మురళి.

తను చూస్తూన్న విషయాన్ని ఎనలైజ్ చేస్తోంది అతని పోలీసు బుర్ర.

అతని అనుమానాలన్నీ పొగమంచులా కరిగిపోతున్నాయి.

జరిగిందేమిటో అతనికి అర్ధమయ్యేసరికి క్షణాలలో ఎలర్టయ్యాడు.

టి.వి. ఆఫ్ చేసి కేసెట్ తీసి చేత్తో పట్టుకున్నాడు.

ఇప్పుడు ఖానుని స్టేషనుకి తీసికెళ్ళి అప్పగించడానికి టైం లేదు.

ఆ గదికున్నది ఒకే ఒక్క గుమ్మం అని ఆ గదిలోకొస్తూనే తెలిసింది అతనికి.

ప్రక్కనే నిలబడ్డ ఖాను మెడ మీద అరచేయి బాకులా చేసి ఒక్క దెబ్బ కొట్టాడు మురళి.

దబ్బపండులా మొదలునరికిన చెట్టులా కూలబడ్డాడు ఖాను.
మరుక్షణం తెలివి తప్పిందతనికి.

మరో రెండు గంటల్దాకా అతనికి ఎట్టి పరిస్థితిలోనూ మెలకువ రా అనేది బాగా తెలుసు మురళికి.

అప్పటికి తన పని ముగించుకుని తిరిగిరాగలడు తను.

అయినా ముందు జాగ్రత్త కోసం పక్కమీదున్న దుప్పటి తీసి పీ కలుగా చింపి ఖాను కాళ్ళూ, చేతులూ కట్టిపడేసి నోట్లో గుడ్డలు కుక్కాడు
అతన్నలాగే మంచం కిందకి లాగిపడేసి, బయటికి పరిగెట్టాడ మురళి.

ఆ కంగారులో తన సర్వీస్ రివాల్వర్ అక్కడ జారిపోయినట్టు గమ నించనేలేదు మురళి.

*  *  *  *

యాంత్రికంగా నడుస్తున్నాడు భార్గవ స్టేషను పైపు.
అతని మనసు శరవేగంతో పాత విషయాల్ని తిరగతోడుతోంది.
సడెన్‌గా అతనికి గుర్తొచ్చాయి....
సదాశివం శవాన్ని తను చూస్తూ ఆ రాత్రి నిలబడ్డప్పుడు లైల తనతో—

"నేనిక్కడ భయపడి చస్తూంటే నువ్వక్కడ బొంబాయిలో హాయిగా ఎంజాయ్ చేస్తున్నావ్" అని అన్నమాటలు.

అతని బుర్రలో ఫ్లాష్ లైటులా ఓ ఆలోచన మెరిసింది.
తను బొంబే వెళ్ళిన విషయం తనకి, చౌదరికీ తప్ప మూడో వ్యక్తికి తెలియదు.

పరోపకార బుద్ధితో ఆయన అతనెవరో అప్పటిదాకా తీసిన ఆ నాలు గయిదు రీళ్ళ సినిమా తనతో పంపించాడు ఆ బొంబే సేఠ్ దగ్గరకి.
ఆ విషయం తనకి లైలాతో చెప్పే అవకాశమే దొరకలేదు.
అలాంటప్పుడు ఆమెకెలా తెలిసింది, తను బొంబే వెళ్ళినట్టు?



ఆ పాయింటు అంతవరకూ తన బుర్రకి తట్టనందుకు ఆశ్చర్యం అనిపించింది.

నిస్సందేహంగా ఇదీ ఆలోచించవలసిన విషయమే.
అతని మనసు పరిపరి విధాల ఆలోచిస్తోంది ఆ పాయింటు మీద.
అంతలోనే అతని దృష్టి ఎదురుగా పాపనెత్తుకుని వస్తూన్న స్త్రీ మీద పడింది.

పాప తెల్లగా, బొద్దుగా, అందంగా ఉంది.
ఆ స్త్రీ ఆ పాపకి తల్లి కాదని ఆమె రూపు రేఖలే చెప్తున్నాయి.
పనిచేసుకు బ్రతుకుతూన్న మనిషిలా ఉందామె.
ఆ పాప ఆమెతో ఏమో చెప్తోంది నెమ్మదిగా.
ఆ పాప అతని దృష్టినాకర్షిస్తోంది.
పాపనెక్కడో చూసినట్టుంది భార్గవకి.
ఎక్కడ చూశానా అని ఆలోచిస్తూనే వున్నాడు.
అంతలోనే జరిగిందా ఘోరం!
ఓ నల్ల కారొచ్చి ఆ స్త్రీ పక్కన ఆగింది.
ఆమె తృళ్ళిపడ్డట్టుంది.
ఆ కారు వంకే చూస్తోంది.
ఆ కార్లోంచి నలుగురు వ్యక్తులు దిగారు.
క్షణాల మీద వాళ్ళామె చేతుల్లోని పాపని లాక్కున్నారు.
"ఏయ్! ఏమిటిది? పాపనొదులు" అరుస్తోందామె.
వాళ్ళ చేతుల్లోంచి పాపని తప్పించడానికి విశ్వప్రయత్నం చేస్తోంది ఆమె.

"నోర్మూయ్యవే ముసల్దానా"
ఒకడామెని నేలమీదకు తోసేశాడు.
పాప అరుస్తోంది "ఆయా....ఆయా" అంటూ.
మరుక్షణం వాళ్ళు కారు ఎక్కేశారు పాపతో సహా.
ఆ కారు వెంటనే కదిలి వెళ్ళిపోయింది.

చూస్తుండగానే కళ్ళ ముందు జరిగిన ఆ సంఘటనకి స్టన్నయ్యాడు భార్గవ.

వెంటనే ఆమె దగ్గరికి పరిగెట్టాడు.

ఆమెకి తలకి దెబ్బ తగిలినట్టుంది

రక్తం కారుతోంది.

గాయం బాధతోనూ, భయంతోనూ ఆమె మొహంలో రక్తంచుక్క లేనట్టు పాలిపోయింది.

"బాబూ! పాప....పాప విషయం ఇన్‌స్పెక్టరు మురళిగారికి ఫోన్ చేసి చెప్పు."

భార్గవని అర్ధిస్తూ చేతులు జోడించిందామె.

మరుక్షణం తెలివి తప్పిపోయిందామెకి.

ఇన్‌స్పెక్టరు మురళి తనకి తెలిసినవాడే.

అతని స్టేషను ఫోను నెంబర్ తనకి తెలుసు.

తనేం చెయ్యాలో ఒక్క క్షణం ఆలోచించాడు భార్గవ.

పాపని ఆ రోజు పార్కులో మురళితో చూశాడు.

అందుకే ఆ పాప నెక్కడో చూసినట్టనిపించింది.

పక్కనే వున్న షాపులోకి వెళ్ళి స్టేషనుకి ఫోన్ చేశాడు.

ఇన్‌స్పెక్టరు లేడట.

ఎస్.ఐ. ఫోనెత్తి చెప్తున్నాడు.

జరిగినదాన్ని ఫోన్లో ఎస్.ఐ కి వివరించి ఫోన్ పెట్టేశాడు భార్గవ.

తను ఇన్‌స్పెక్టర్ కూతుర్ని ఎవరో కిడ్నాప్ చేశారంటే ఆ ఎస్.ఐ. వెంటనే రంగంలోకి దూకుతాడని తెలుసు భార్గవకి.

ఆ ఆయా విషయం కూడా పోలీసులే చూసుకుంటారు.

తన విషయం తను చూసుకుంటే చాలు.

స్టేషను వెళ్ళడం మాని చౌదరి ఇంటివేపు తిరిగాయి అతని పాదాలు.

*    *    *    *



"వెల్‌కం....హార్టీ వెల్‌కం మైడియర్ ఇన్‌స్పెక్టర్"

విలాసంగా కుర్చీలో కూర్చుని నవ్వుతూ ఆహ్వానించాడు చౌదరి.

అతని పక్కగా నిలబడుంది లైలా.

"ఇలా కుర్చీలో కూర్చుని నన్ను ఆశ్చర్యపరిచేస్తున్నాననుకుంటున్నావేమో!

చౌదరీ! యు ఆర్ మిస్టేకెన్. నీ విషయం నాకంతా తెలిసిపోయింది."

తనూ నవ్వుతూ ఠీవిగా లోపలికొచ్చాడు మురళి.

"ఐనో యిట్ ఇన్స్‌పెక్టర్! నువ్వు చాలా విషయాలు తెలుసుకున్నావని తెలుసు.

అయినా నాకేం భయం లేదు. నువ్వు నన్నేం చెయ్యలేవు."

ధీమా ఉట్టిపడుతోంది చౌదరి మాటల్లో.

"చౌదరీ! యాక్సిడెంట్లో నీకేమీ కాలేదు.

అయినా కాలు విరిగినట్టూ, మంచాన పడ్డట్టూ నటించావు.

అప్పుడు నిన్ను ట్రీట్ చేసిన నీలకంఠానికి నీ కాలూ చేయీ పోలేదని తెలుసు.

ఆ విషయం ఎక్కడ బయట కొస్తుందో అనే భయంతో నిన్ను చూడడానికొచ్చిన నీలకంఠాన్ని చంపించావు సదాశివంతో.

నువ్వేదో వేషాలిచ్చి బ్రతుకుతెరువు చూపిస్తావన్న భ్రమతో నీ దగ్గర కొచ్చిన సీతని బలవంతంగా బ్లూ ఫిలింలో నటింప చేశావు.

ఆమె నిన్నల్లరి చేస్తుందని చంపించావు.

పోతే నాకు అర్థం కానిది ఒకటే!

నీ బ్లూ ఫిలిం వ్యాపారంలో నీకంతగా తోడ్పడుతూన్న సదాశివాన్నెందుకు చంపించావన్నదే....

ఆ సందేహం తీర్చగలవా చౌదరీ."

నిర్భయంగా కుర్చీ లాక్కుని కూర్చుంటూ అడిగాడు మురళి.

"నీలాంటి తెలివయినవాడికి కూడా అర్ధం కాని బ్రెయిన్ నాది.

ఆ సదాశివంగాడు....

నేను పారేసిన డబ్బు తినే కుక్క.

పొగరెక్కి నన్నే బెదరించబోయాడు.

సీతతో తీసిన బ్లూ ఫిలింలో నన్నూ కేసెట్లలోకి ఎక్కించాడు.

ఎడిట్ చేసిన కాపీ నాకిచ్చాడు.

తన దగ్గర మరో ఎడిట్ కాని కాపీ వుందనీ అ దులో నేనున్నాననీ చెప్పి బ్లాక్ మెయిల్ చెయ్యబోయాడు.

అ విషయం దాచడానికి వాడికి పది లక్షలు కావాలట.

ఒక్క లక్ష చాలు.... వాడ్ని లేపెయ్యడానికి.

ఏది లాభం చెప్పు?

నువ్వయితే ఏం చేస్తావు?

పది లక్షలిచ్చి మళ్ళీ మళ్ళీ వాడెక్కడ బెదిరిస్తాడో అని భయపడి చచ్చేకంటే, ఒక్క లక్షతో వాడి పీడ శాశ్వతంగా వదిలించుకోవడమే నయం కదా!"

వికృతంగా నవ్వాడు చౌదరి.

"కానీ పాపం నీ బేడ్‌లక్! నువ్వు నా చేతుల్లో ఇరుక్కుపోయావు"

అపరాధిని పట్టుకోగలిగానన్న గర్వం తొణికిసలాడుతోంది మురళి గొంతులో.

"మురళీ! నీకు ఆత్మవిశ్వాసం ఎక్కువ.

కానీ అన్నిసార్లూ నువ్వే గెలవగలననుకోకు.

సదాశివం చావుతో నా రహస్యాలు తెర వెనక్కెళ్ళిపోతాయనుకున్నాను.

కానీ ఖానుద్వారా కూడా నాకు ప్రమాదం రాగలదని ఆ కుర్రాడు వచ్చి చెప్పేదాకా తెలియలేదు

అయితే ఏం?

జాగ్రత్తగా ఆలోచిస్తే ప్రతిదానికీ ఓ సొల్యూషన్ దొరుకుతుంది. ఎంత డబ్బిచ్చినా నువ్వు నాకు లొంగవనే విషయం తెలుసు నాకు. అయితే నిన్నెలా లొంగదీసుకోవాలో అదీ తెలుసు నాకు.



జాగ్రత్తగా గుండె దిటవు చేసుకుని విను—

మైడియర్ ఇన్స్‌పెక్టర్! నీ గారాల కూతురు నా దగ్గరుంది.

నువ్వు నా మాట వినకుండా మొండితనం చేశావనుకో....

ఆ పిల్లని పైకి పంపించేస్తాను."

చౌదరి చేతి సైగతో లైలా ఆ ప్రక్కనే వున్న గది తలుపు తెరిచింది

అక్కడ మంచం మీద బేబీ నిద్రపోతోంది మత్తుగా.

పాప తెలివిలో లేదని ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసలే చెప్తున్నాయి.

తన ప్రాణానికి ప్రాణమైన బేబీని అక్కడలా చూసేసరికి గుండె ఆగినట్లయ్యింది మురళికి.

'బేబీ'

ఒక్క ఉదుటున అటు నడవబోయాడు.

"స్టాప్ దేర్ యూ ఆర్."

చౌదరి చేతిలో రివాల్వర్ కర్కశంగా నవ్వుతోంది.

అంతలోనే లైలా ఆ తలుపులు మూసేసి తిరిగి తనున్న చోట్లోకి వచ్చి నిలబడింది.

మురళి చెయ్యి వెనక జేబు మీదకి పోయింది రివాల్వర్ కోసం.

ఖాళీ పాకెట్ వెక్కిరించింది.

గుండె ఝల్లుమంది.

అవసరమయితే బేబీ కోసం ప్రాణాల్ని నవ్వుతూ ఇచ్చెయ్యగలడు మురళి.

కానీ అనవసరంగా రిస్క్ తీసుకోదల్చలేదు.

తప్పనిసరయినప్పుడు ఎలాగూ తెగిస్తాడు.

వీలయితే చౌదరిని బుట్టలో పడేసి తప్పుకోవాలన్నదే అతని ఐడియా. తన దగ్గర ఆయుధం లేదు కనక అతన్ని మాటల్లో పడేసి తప్పించుకోవాలి.

"ఏం ఇన్స్‌పెక్టర్! అందర్నీ అధికారంతో శాసించే నీ నోరు మూగబోయిందేం?

కూతురంటే అంతిష్టమా నీకు?

అయితే ఆ పిల్లనెత్తుకు రావడం వృథా కాలేదన్నమాట

నేనూ మనిషినే కదా! మమకారాన్ని గౌరవించాలి కదా! అందుకే ఓ పని చెయ్యదల్చుకున్నాను.

మీ ప్రాణాలు తీశాక మీ ఇద్దరి శవాలూ ఒక్కచోటే పూడిపిస్తాను. సరేనా?"

విషం కక్కుతున్న పాములా వున్నాడు చౌదరి.

"ఇన్స్‌పెక్టర్! నీ చావు ఎలాగూ తప్పదు. అనవసరంగా తప్పించుకోవాలని శ్రమపడకు.

కమాన్ కౌంట్‌డౌన్ బిగంబర్స్.

టెన్....

నైన్....

ఎయిట్....

సెవెన్....

సిక్స్....

అంటున్నాడు చౌదరి.

రివాల్వర్‌కి అంత సమీపంలో వుంటూ, ఆ కాస్త వ్యవధిలో ట్రిక్కులు చెయ్యడానికి తను సినిమా హీరో కాడనే విషయం బాగా తెలుసు మురళికి.

ఇక్కడికి వచ్చేముందు స్టేషనుకి ఫోన్‌చేసి రావాల్సింది.

చౌదరి దుర్మార్గం తెలిశాక కూడా ఇలా ఒంటరిగా వచ్చి తనో పెద్ద తప్పు చేశాడు. దానికి పెనాల్టీ తన బేబీ మీద పడబోతోంది.

తనని చంపాక పాపని పీడెలాగూ వదలడు. వదిలినా తల్లినీ, తండ్రినీ కోల్పోయాక బేబీ బ్రతకదు కూడా.

కానీ ఈ క్షణంలో తనేమీ చేయగలిగే స్థితిలో లేడు. నిస్సహాయతతో నిలబడిపోయాడు.



"బేబీ" అతని గుండె ఆక్రోశిస్తోంది.

టూ....

చౌదరి గొంతు మెషిన్‌గన్‌లా చెవిలో మ్రోగింది.

మరుక్షణంలో వినబడబోయే 'ఒన్' కోసమూ, తన గుండెల్లో దూరబోయే బుల్లెట్ కోసమూ చూస్తూ నిస్సహాయంగా కళ్ళు మూసుకున్నాడు

ఎలా వచ్చాడో అప్పుడే వెనకవేపు గుమ్మంలోంచి భార్గవ.

చిరుతపులిలా చౌదరిమీదకి వురికి అతని చెయ్యిమీద బలంగా కొట్టి విరిచేశాడు.

'ఠప్' మంటూ గుండు సీలింగులోకి దూసుకుపోయింది.

ఆమాత్రం వ్యవధి చాలు మురళికి.

సింహంలా దూకాడు చౌదరి మీదకి.

చౌదరి కూడా తక్కువ బలమున్నవాడు కాడు.

వాళ్ళిద్దరితోనూ సమంగా పెనుగులాడుతున్నాడు.

ఆ గందరగోళంలో క్రిందపడిపోయింది రివాల్వర్.

కాల్తో దాన్నో ప్రక్కకి తన్నాడు చౌదరి.

అది వెళ్ళి సరిగ్గా గుమ్మం దగ్గర పడింది.

వాళ్ళిద్దరూ.... తనొక్కడు. తనెంతోసేపు వాళ్ళనెదుర్కోలేనని చౌదరికి తెలుస్తూనే వుంది.

లైలా తనకి సాయంగా రాదేం?

ఆమెకేసి చూశాడు.

ఆమె కొయ్యలా నిలబడి వుంది.

జరుగుతున్న దానికి భయపడుతోందా?

సరిగ్గా అప్పుడే తలుపులు తెరుచుకున్నాయి.

'సాక్'అంటూ డ్రయివర్ దుస్తుల్లో ఓ వ్యక్తి లోపలికి రాబోయాడు

"జాన్! గుమ్మం దగ్గర రివాల్వరందుకో" అరిచాడు చౌదరి.

ఆ వచ్చిన వ్యక్తి జాన్!

చటుక్కున ఆ రివాల్వర్ అందుకున్నాడు.

"హేండ్సప్...."

అతని అరుపుతోపాటే షురో గుండు గాల్లో పేలింది.

భార్గవ, మురళీ చేతులెత్తి నిలబడ్డారు అతడిని విడిచి.

గెలుపు తమ చేతుల్లోకొచ్చినట్టే జారిపోయినందుకు వాళ్ళిద్దరికీ చాలా నిరాశగా అనిపించింది.

ఒళ్ళు దులుపుకుంటూ చౌదరి లేచి నిలబడ్డాడు.

"వెల్‌డన్ జాన్! సమయానికొచ్చావు."

రివాల్వర్ అతన్నుంచి అందుకుంటూ అన్నాడు చౌదరి.

"నువ్వెళ్ళి బయట కారు దగ్గరుండు"

యజమాని రహస్యాలు పనివాడు తెలుసుకోవటం మంచిది కాదనే విషయం అతనికి బాగా తెలుసు.

జాన్ తలాడించి వెళ్ళిపోయాడు.

"సో.... నువ్వూ వచ్చావన్నమాట!

అసలారోజు మనీషతోపాటే నువ్వూ చావాల్సింది.

కానీ ఆ డైమండ్ కోసం నిన్ను ప్రాణాలతో ఉంచాల్సి వచ్చింది."

"దుర్మార్గుడా! మనీషని నువ్వు చంపావా?"

నిప్పులు చెరిగాడు మురళి.

"నా స్మగ్లింగ్ వ్యవహారాల్లో నాకు తోడుగా పనిచేస్తూనే ఆ వజ్రాన్ని నా నుంచి కొట్టేసిందా ముండ....

ఎనభై లక్షల విలువ చేస్తుందా హారం....

దాన్ని పోగొట్టుకోవడం అంటే మాటలా?

అందుకే ఆ విషయం రాబట్టాలనే ప్రయత్నం చేశాను.

ప్రాణాలయినా వదిలిందికానీ నీకిచ్చిన విషయం చెప్పలేదది.

ఆమెతో ఆ రాత్రి కలిసిన చివరి మనిషివి నువ్వే గనక అది నీకే యిచ్చి వుంటుందనుకున్నాను.



సడన్‌గా మారిపోయిన నీ ఆర్థిక పరిస్థితి నా అనుమానాన్ని నిరూపించింది.

నీ నుంచి ఆ డైమండ్‌ని లాగడానికే నిన్ను నాకు దగ్గరగా లాక్కున్నాను లైలాని నీకు కలిపాను....కానీ ఆ వివరాలు తెలియలేదు.

ఏమయితేనేం ఆరోజు తప్పించుకున్నా, ఈరోజు చావుతప్పదు నీకు"

"ఛీ! డబ్బు సంపాదన కోసం కట్టుకున్న భార్యను కూడా పరాయి మొగాడికి అప్పగిస్తావా?

పూటకి గతిలేని వాడెవడో ఇలాంటి పని చేస్తుంటే ఆకలి బాధకి అలా చేశాడనుకోవచ్చు....

నీకేంరోగం?"

అసహ్యంగా చౌదరిని చూశాడు భార్గవ.

"పోరా పిచ్చివాడా! లైలా నా భార్య అనుకోవడం నీ పొరపాటు.

ఆమె నా భార్యగా నీకు పరిచయం అయిందంతే!

ఓ బీద కుటుంబంలోంచి వచ్చిందామె.

కుటుంబాన్ని పోషించడం కోసం నీ దగ్గర శీలాన్ని పోగొట్టుకుంది.

నా భార్య నా యింట్లోనే వుంది."

"సదాశివం నీ మనిషే కదా?

అతను భార్గవ, లైలాల ఫోటో తీసి వాళ్ళనెందుకు బ్లాక్‌మెయిల్ చెయ్యబోయాడు?"

మురళి అడిగాడు.

అతని మనసు ఆలోచిస్తూనే ఉంది తప్పించుకోవడం ఎలా అని.

"అది నేనాడించిన నాటకమే....

అసలా ఫోటో తీసే అవకాశం కలిగించింది లైలాయే.

ఆ ఫోటోని భార్గవకి ఆమె మీద పుట్టిన పిచ్చి ప్రేమనీ ఆధారంగా తీసుకుని సదాశివం హత్య కేసులో భార్గవని యిరికించి, ఆ వజ్రాన్ని అతన్నుంచి లాగాలన్నదే నా ఆలోచన!

ఆ సదాశివాన్ని ఊపిరాడకుండా చేసి చంపింది నేను.

ఆ తర్వాత అతన్ని స్విమ్మింగ్‌పూల్లో పడేశాను.

లైలా అతన్ని తనే నీటిలోకి తోసి చంపినట్టు సీతతో చెప్తే....

నువ్వో హీరోలాగా ఆమెను రక్షించాలని ముందుకొచ్చి బురదలో పడ్డావు.

అప్పుడు నువ్వు తీయించుకున్న ఫోటోలేకాదు....

ఆ రోజు నిన్ను శవంతో చూసిన ఆ తాగుబోతు కూడా సాక్ష్యంగా వుంటాడు—

నీకు వ్యతిరేకంగా....

నిజానికి వాడు తాగినవాడిలా నటించాడు తప్ప తాగలేదు...."

తనకెదురులేదనే అహం చౌదరిలో కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది.

"సదాశివం నీటిలోకి తోయబడక ముందే ప్రాణాలు కోల్పోయాడని పోస్ట్‌మార్టం రిపోర్ట్‌లో వుంది.

నీటిలో పడటం వల్లనే అతను చనిపోయుంటే అతని కడుపులో నీళ్ళుండాలి.

కానీ అతని కడుపులో నీళ్ళు లేవు....

ఒకవేళ భార్గవ తనే ఈ నేరం చేశానని ఒప్పుకున్నా, మేము నమ్మేవాళ్ళం కాము."

మురళి చిన్నగా నవ్వుతూ అన్నాడు.

"అప్పుడు మరేదో ప్లాన్ ఆలోచించేవాడిని.

అన్నట్టు మైడియర్ భార్గవా!

గుండె జారిపోకుండా చూసుకో....

ఆ రోజు నువ్వు బొంబే పట్టుకెళ్ళిన ఆ ఫిలిం రీలు, సీతతో తీసిన బ్లూ ఫిలిం రీలు...."

చౌదరిని చూస్తుంటే పాపాల పుట్టలా అనిపించింది మురళికి....

భార్గవకి చౌదరి మాటలు వినగానే ఆవేశం ఆగలేదు.

సీత ఎంత అమాయకురాలో అతనికి తెలుసు.

ఆమెను చూస్తే ఓ చెల్లెల్ని చూసినట్టుండేది.



అలాంటి సీతతో తీసిన బ్లూ ఫిలింని ప్రపంచానికి
...నే సాధనంగా అతను వాడుకున్నాడని వినేసరికి ఆ...
...చ్చింది.

"భండాలుడా! నిన్ను ప్రాణాలతో వదల...

పిచ్చిగా అరుస్తూ చౌదరి మీదకు దూసు...

"అయితే చావు" అంటూ రివాల్వర్ ట్రి...

సరిగ్గా అప్పుడే ఊహించని అద్భుతం జ...

అంతవరకూ ప్రాణం లేని బొమ్మలా నిల...
...రిగా చౌదరి మీదపడి అతని చేతిని తన పళ్ళ...
...క్కడి కండ బయటకి ఊడిపడింది. రక్తం ధారలు

అతను కెవ్వున అరిచాడు

ఆ బాధలో అతని గురి తప్పింది.

మళ్ళీ మరోసారి ఆ గదిలో గుండు వృథా అయ్యింది.

"రాక్షసీ! నువ్వు నాకు ఎదురు తిరుగుతావా?

నీకు పీడి మీద రోజు రోజుకీ మోజు పెరుగుతోందని నాకూ తెలు...స్తోందే—

ముందు నువ్వు చావు...."

అంటూ మళ్ళీ రివాల్వరు కాల్చాడు చౌదరి.

ఈసారి గుండు ఆమె పక్కల్లోంచి దూసుకెళ్ళింది.....

అయితే భార్గవ కలబడుతున్నందువల్ల ఆ గుండు ఆమెకి మామూలు గాయాన్ని మాత్రమే చేసింది.

ఈ గడబిడలో ముందుకు దూకిన మురళి రెండు క్షణాలలో అతడిని ...దుపులోకి తీసుకున్నాడు.

వలలో పడ్డ పులిలా మూలుగుతున్నాడు చౌదరి.

"లైలా.... నా కోసం ప్రాణాలకి తెగించావా?"

ఆమెను గుండెలకు హత్తుకుంటూ కన్నీళ్ళతో అన్నాడు భార్గవ.

"భార్గవా! డబ్బు కోసం నటించడానికొచ్చిన నేను నీ ప్రేమలో ...నసు పారేసుకున్నాను.

Mathur
town
Krishr
might
them.
by the
and th
of the
Kams
sa the
boys,

ఆ తర్వాతలేదు కదూ....?

లైలా అతన్ని ప్రాణాలు బోతేమాత్రమేం?"

నువ్వో హీరోలాగా వంక చూసింది లైలా.

యినా పోతూన్న రక్తం ఆమెని నీరసపడ్డావు.

అప్పుడు నువ్వు తీయి రావట్లేదు భార్గవకి.

ఆ రోజు నిన్ను కాలొదలటానికి సిద్ధపడ్డ ఆ ప్రేమమూర్తికి వుంటాడు—

నీకు వ్యతిరేకంగా అంటూ ఆమెను మరింతగా దగ్గరకు తీసుకున్నా

నిజానికి వాడు డు.

తనకెదురులేని ఎత్తుకుని, మరో చేత్తో స్టేషన్‌కి డయల్ చే

"సదాశివం తనికి కనిపిస్తున్నది....

పోస్ట్‌మార్టం రిడా, ఇక్కడా, ఎక్కడ చూసినా అతనికి కనిపిస్తున్నది ఒక్క రూపం....

అది....

లైలా రూపం....

శరీరాలు మాత్రమే వేరు!

ఆత్మ ఒక్కటే....

అన్నంత ఆర్తితో ఆమెను తన బలమైన కౌగిట్లో బం భార్గవ

అతని నుండి పిలుపుని వింటూ పొంగిపోతోంది లైలా.

ఆ జంటని చూస్తున్న మురళి పెదాల మీద ఓ ర్వాదపై మెరుస్తోంది.

—: అయిపోయింది :—



Mathura town

Krishna mighty them. B by the and thr of the Kamsa's sa then boys, bu